చారిత్రవిషయక నవల.

# విద్యుత్ప్రభ

గ్రంథకర్త

భాగవతుల పన్నకృష్ణమ్మ

*(A Retired Teacher from Government Training Schools.)*

గుంటూరు.

1934

 కిని వెల రు. **0-10-0.**

Copy of the opinion expressed by

**M. R. Ry. Y. S. Hanumantha Rao, B. A., L. T.,**

*Headmaster, Government Training School,*

ANANTAPUR.

---

Vidyuthprabha is a historical novel relating to Rajaputrasthan. It is written in classical style.The plot is so well and thoughtfully constructed that the story is interesting throughout. The discriptions of the natural phenomena are destinguished with novel sentiments and idiomatic expressions. The effect on the whole, of reading of the book, is refreshing and educative - educative in the sense that there is plenty of moral beauty upheld and expressed in fine poetic language which may engender in the hearts of young readers, love of self help enterprise, truthfulness and devotion to duty. My humble opinion, therefore, is that the book benefits and suits III and IV forms as a " Nondetailed " text.

---

# విద్యుత్ప్రభ

—(౧)—

## ౧వ భాగము.

మన కథ ప్రారంభమైన దిప్పటికి రమారమి పదునేడు వందల సంవత్సరముల క్రిందఁ గడచిన వేసవికాలము. కమలాసనుం డఖిలజంతుసంతానసంతాపకారణం బగునుష్ణరసంబును సంతరించి తెచ్చి భూమండలంబను ఘటంబున నునిచెనో యనఁ దీక్ష్ణకిరణుండగు భానుండు తన వాడిరుచుల నెల్ల యెడల వ్యాపింపఁజేసి పథికజనంబున కధికశ్రమను గలుగఁ జేయుచుండెను. హెచ్చుగ వెచ్చని పడమటిగాడ్పు లొక చెవి నుండి యొకచెవికిం బోవ విసర నారంభించెను. ఆకసంబు భూరజఃపుంజ మేఘావృతంబయి ధూళివృష్టిఁ గురియుచుండెను. పౌర్ణటిపూఁటలుమార్గవాదృతంబులయి పరిసరోపవనలతాంతవిసరసంచారణాసాదిత పరిమళంబయిన మందపవనాలయా నిలయముచే నతిమనోహరంబులయినను, మధ్యాహ్నదినంబులు నిబిడంబగు తపనాతపంబున దుర్భరంబులయ్యె. తటాకకూపాది జలాశ్రయంబులందలి జలంబు లతినిర్మలంబులయి స్వచ్ఛశిలకాకరంబుగఁ జూపట్టుచుండెను. తచ్ఛీతలజలంబుల హాయిగ స్నానపానంబు లొనర్చుకొనుచు జను లానందించుచుండిరి.

చండభానుని వేఁడిమిని సహింపఁజాలక కొందఱుజను లప్పుడప్పుడు వేసవిం దూఱుచుండిరి. జను లెంత వెఱ్ఱివారు? వారో

క్కొక్కప్పు డజ్ఞానులయి యభ్యర్చనార్హులగు మహోపకారులయందు సయితమవజ్ఞాభావముం గనుపరుచుచుందురు. వారలకు వేసవి యసహ్యము. కాని దాని యుపకారములను గూర్చి కొంచె మాలోచించిరేని వారట్లనుకొనరుగదా! తానెన్నికష్టములకయిన నోర్చి ప్రజాసంరక్షణంబుసేయు యశోగుణసంపన్నుండగు నినుండునుంబోలె నినుండు లోకోపకారచింత మనంబునంబూని యుష్ణకాలంబున సముద్రక్షారోదకముంగాని సస్యాభివృద్ధికిని స్నానపానాదులకు నుచితమగు నుదకంబు లోకంబున కొసంగును. మహోపకారులన నిట్టివారు! ఈవిషయములు తాము పరిగణింపక తీక్ష్ణకిరణంబుల భరింపఁజాలక సూర్యభగవానుఁడు మిత్రుఁడాయని శంకించి యాతనిం దూఱుదురు. అది సరియగునా?

ఇట్టి సకలజంతు భీష్మంబగు గ్రీష్మకాలంబునం దొక్క దివసావసానంబున, నించుమించు, రెండుగడియల ప్రొద్దుకడ, నలువది నలువదియొక్క వత్సరంబుల యీడుగల బ్రాహ్మణుఁడొకఁడు, చిత్తూరునుండి నాగేంద్రమునకు నడచుచుండెను. అతని మొగ మతిఘోరమగు విచారభారమును సూచించుచుండెను. దీర్ఘాలోచనంబు సేయుచుండెను. చూచువారల కతని యాలోచనల కంతము లేనియట్లగుపడుచుండెను. ఒకపరి యాతఁడాకసమువంకఁ జూచుచు దిగువత్రోవయందుండు కంటకాది సంకటములనేని నెఱుంగఁడయ్యె. మఱియొకపరి యాతం డెప్పుడేమి క్రొత్తవింతలు తటస్థించునోయని బహు

విధములఁగనుఁగలిగి నలుగడలం బరికించుచుండెను. ఈవిప్రుని పేరు విష్ణుశర్మ. ఆతం డిట్లు విచారింపఁదొడఁగెను:—

ఆహా ! ఎట్టిరాజ్యమున కెట్టిదురవస్థ సంభవించెను ? నా తాతతండ్రులనాఁటనుండియు నీరాజ్యమే మావంశజులాశ్రయముగఁ జేసికొని, సగౌరవంబుగ బ్రతుకుచుండిరి. అందు వలన, మాపూర్వులు తదధిపతుల మేలు నెప్పుడును గోరుచుండువారు. ప్రభువులును, మా యోగక్షేమముల నెక్కుడు ప్రియంబునం గనుఁగొనుచుండువారు. తా మేకార్యమును జేయఁబూనినను, చిత్తూరురాజులు, మమ్మాలోచించి మఱి చేయువారు, గాని మమ్ముల నిరాకరించి యెఱుఁగరు. ఇప్పు డన్నయో యవియన్నియు విపరీతములయ్యె. కాలము మాఱి పోయెను. ఈప్రమాదుఁ డీరాజ్యమునకు వచ్చినది మొదలన్నియుఁ దలక్రిందులయ్యెంగదా! ఆయనకు నామాటయే కొఱఁగాదు. ప్రభువునకు నేనెద్దియయిన మంచిమాట చెప్పఁ బోయినను బూడిదను బాగుచేయఁబోవు వానికిఁ గలిగినట్లు నాకుఁ దిరస్కారమే కలిగెను.

దీనికిఁదోడు సకలజంతుహింసప్రియగు వృకంబునకు నీచసృగాలంబువలె, యీప్రభువునకు భూతివర్మ తోడువడిన వాఁడు. ఈతనికి నేనేమి విసముపోసితినోగాని వాఁడు నన్నుఁ జూచిన నగ్గివలె భగ్గున మండుచుండును. ఈరాజ్యమున నెన్నితరములనుండియో రాజాశ్రితులమైయున్న మాకిప్పు డీభూతివర్మ యకారణముగ నాశ్రయాశుఁడయ్యెను. ఇటీవల నీతండు

నాపై రాజుతోఁ గొండెములు సెప్పుట మొదలయ్యె. ప్రభువునకును వీనిమాటలయం దతిగౌరవము. అతఁడు చెప్పినదే వేదములోని ముక్క. రాజ్యమభివృద్ధి కావలయుననిన రాజు మంత్రిపురోహితుల యోగ్యులనుగాఁ జూచి గ్రహింపవలెను. దుర్మార్గుఁడగు మంత్రివలన రాజు తనరాజ్యమునేగాక సకల సంపత్కీర్తులనుం గోలుపోవుట నిశ్చయము.

రాజు యోగ్యుఁడయి ధర్మమార్గమున నడచువాఁడయినయెడ నంతగ బాధలు గలుగవు. లేనియెడ రాజుచేయు దుష్కృత్యములకుఁ బురోహితుఁడునుఁ బాలిభాగస్థుఁడు గావలసివచ్చును. 'రాజపాపం పురోహితః' అనెడి న్యాయము నామనంబును గలంచుచున్నది.

ఈరాష్ట్రంబునఁ బ్రజాక్షోభంబు మొదలయ్యె. దీని కంతయు భూతివర్మయే కారకుఁడుగదా! అతఁడీచటనే యీ రాజ్యవృక్షమునకు వేరుపురుగయి జనించినాఁడు. ఇవి దురాగతముల నెట్లు మాన్పనగు. ఈసందర్భములలో నే నిచట వసించుటయు నుపద్రవకరము. నేఁటికీరాజ్యమునకును నాకును ఋణముతీఱినది కాఁబోలు. లేకున్నఁ బ్రభువున కేల యీ బుద్ధిపుట్టును.

భూతివర్మమాటలను విని నేఁడు నిండుసభలో రాజు నన్నెంత యవమానమొనర్చెను; నే నాభూతివర్మకనుసన్నల మెలఁగవలెనఁట! అతనికి విరుద్ధముగ నడువఁగూడదఁట; అట్లుకాని యెడల నే నీరాష్ట్రమును విడువవలెనఁట!

ఇట్టియవమానమునొంది నే నిందుండఁగలనా? అయిన నే నీరాజ్యక్షోభంబుఁగని యెట్లు భరింపఁగలను! భూపతి రాజ్యము దుష్టజన పరిభూతమయినచో, రాష్ట్రప్రజనులకు బ్రదుకెక్కడిది. ప్రస్తుత మే నీరాజ్యమును విడిచిపోవుట యొక గొప్పగాదు. ఇచ్చటనయుండి యీరాష్ట్రంబును రాష్ట్రప్రజనంబును నీబాధనుండి రక్షించుట కర్తవ్యము. ఆలాగొనర్చితినేని నాకిహమందుఁ గీర్తియుఁ బరమందు ముక్తియు లభించును. కాని ప్రజలందఱిట్టి నుడువరాని కడగండ్లఁబడుచుండ నే నొకఁడను మాత్రము నాప్రాణము దక్కించుకొని పాఱిపోయి స్వర్గమునకు సోపానములఁగట్టికొందునా! అట్టి నీచపుంబ్రతుకు బ్రతికియు నేమి ప్రయోజనము! "జాతస్య మరణం ధ్రువ" మని యెప్పటికయినను జావు నిక్కువము. వినశ్వరమగు నీపాడు శరీరము పరోపకారమందు వినియోగించినఁ గొంత సార్థకము. నే నిందే వసించియుండి యీరాష్ట్రోద్ధారణమునకయి నాశక్తి కొలఁది పాటుపడియెదను.

అనియిట్లు చింతానిమగ్నమానసుండయి నిష్ఠానగ్ర తన [illegible]నంబోవుచుండ నతిదీనంబగు నార్తధ్వని యొకటి యాతని చెవింబడెను. ధ్వని చనుదెంచిన దిక్కున, [illegible] యొగ్గి యాతురతతో నాతండు వినసాగెను. అతని కది స్త్రీకంఠధ్వని యని తోఁచఁగా వానియాతురత మఱింత హెచ్చెను. ఆస్త్రీరోదన సమీపమం దెచ్చటనుండియో వెడలునటులను దెలియవచ్చెను.

భూమిసురున కేమియుం దోఁచలేదు. అప్పుడాతఁడు కొంచెమాలోచించి, రివ్వున రోదనధ్వని చనుదెంచుదిక్కునకయి పరువిడసాగెను. త్రోవయంతయుఁ గత్తెరరాళ్ళతో నిండి యుండెను. పాదములయందవి సూదులవలె గుచ్చికొనఁ దొడఁగెను. అతండు విప్రుఁడయినను క్షత్రియునివలె ధైర్యసాహసములతోఁ బరువిడఁజొచ్చెను. మఱియొకసారి చెవి యొగ్గివినెను. అప్పు డీదిగువవాక్యము లాతనికి వినంబడియెను.

"దైవమా! రక్షింపుము రక్షింపుము! ఈదీనురాలి మొఱ యాలింపుము. ఓరిక్రూరుఁడా! నాబిడ్డను వదలుము. నన్నుఁ బరిమార్పుము. ఓరీఘాతుకా! ఈపసిశిశువు నిన్నేమి చేసెనురా? అయ్యో పుత్రా? మనకింక దిక్కెవ్వరు? నిజపరాక్రమవిజితారియగు పతింగోలుపోయియు నిన్నుఁజూచికొని కాలముగడుపవలెనని ప్రాణంబులు చిక్కఁబట్టియుంటిని. నిన్నిందు కాపాడువా రెవ్వరు లేరుగా?" అని యొకస్త్రీ మూఁడేండ్లనిసువును తన భుజాంతరమున నునిచికొని వాపిడిచి యేడుచుచుండెను. సమీపమున నిరువురు భయంకరులగు భిల్లులు పరస్పరవిజిగీషులయి ఘోరమగు మల్లయుద్ధమును సల్పుచుండిరి. అందొకఁడు రెండవవానిం దప్పించుకొని బిట్టడలుచున్న యాస్త్రీ కౌఁగిలియందలి పసిపాపని నూడఁబెఱికికొన నప్పుడప్పుడు యత్నించుచుండెను. కాని రెండవభిల్లుఁడతనిని వదలక వాని నిలుపుటకు విశ్వప్రయత్నము సేయుచుండెను. ఇంతలో 'విడువకుము, విడువకుమ'ని కేకలు వేయుచు వచ్చి విష్ణుశర్మ శిశువు నపహరింపఁజూచుచున్న

మష్టభిల్లునిఁ దనచేతిదండంబున నొక్కడపడచెను. ఆవ్రేటుతో నతఁడు కొంచెము తెలివితప్పి భూమిపయింబడెను. కాని వెంటనే లేచి తొందరపాటున సందావ మొనర్చెను. అంత వారిరువురుం దిరిగి యాస్త్రీతిలకముకడ కేతెంచిరి.

అతిభయవిహ్వలయయిన యాయబల యీావచ్చువారలు తనపట్టి నపహరింపవచ్చినవారయనితలంచి 'అయ్యో మాలదైవమా! ఇఁక నేనేమిచేయుదును! ఈక్రూరుఁడు మఱల నాచిఱుతనింగొనిపో నేగుదెంచినవాఁడు' అని యొక కేకవేసి యొడలెఱుఁగక పుడమిపయింబడెను. అంత వారిరువు రామె నుచితోపచారములం దేఱిచిరి.

"అమ్మా! భయము విడువుము. మేము నీకూన నపహరింప వచ్చినవారముగాము. నీకు మాశక్తికొలంది తోడు సూపనేతెంచితిమి. ఈతఁడు నీచిరంతన సేవకుఁడగు భిల్లుఁడు. నేను నాగేంద్రగ్రామవాసుఁడను. భూసురుఁడను. దీనజనార్తిహరుండగు భగవానునిచేఁ బ్రేరేపింపఁబడి యీాయాపత్సమయమున నిన్నుఁగాపాడఁగలిగిన ధన్యుఁడను. నన్నుమన్నించి చూపఱులకు జాలిగలిగించు నీయుదంతము నాకెఱుంగఁజేసి నన్ను ధన్యునింజేయుము" అని విష్ణుశర్మ యామె నడిగెను. ఆ యువతీలలామ యంతట తనమనంబునంగల యనుమానంబుతో భయంబును వదలి యాభూదేవునితో నిట్లనియెను.

"అయ్యా! నేనతిమందభాగ్యను. నాదుఃఖోదంతమునకంతములేదు. తమకేమని విన్నవింతును? కష్టసముద్రమున

నిండుగ మునిఁగియున్న దానసాటచే నావృత్తాంతం బిక్వాడు నాకే స్పష్టముగఁ దోఁచుచున్నది. అహో! దైవమా" అని యెద్దియో మనంబునఁదలఁచి, నైరాశ్యాగ్నిచేత దైన్యమున నాయబల యొక కేక వైచి మూర్ఛిల్లెను.

బ్రాహ్మణుని కాళ్ళు గడగడవడఁక సాగెను. నిస్పృహా కులిత మానసయయిన యాదేవింజూచి యాభిల్లున కేలనో పట్టరానిదుఃఖము పొరలి పొరలివచ్చి యాతఁడు బిగ్గరగ విల పనముసేయుచు నామెపాదములకడంబడెను. కుఱ్ఱఁడుమాత్ర ము మనోవికారాతీతుఁడయిన యోగిపుంగవునిమాడ్కి మాతృశరీరముపై శైశవక్రీడలు సల్పుచుండెను.

ధరణీసురుఁడు కొంతతడవునకు ధైర్యము తెచ్చుకొని సమీపమునఁ బాఱుచున్న సెలయేటిజలంబులఁ దెచ్చి యామె నొసటఁజల్లి శీతోపచారములంగావించెను. అంత నామెకుఁ గొంత తెలివివచ్చి మెల్లనలేచి కూరుచుండెను. ఇంకను రో దనముసల్పుచున్న యాభిల్లునిం గొంచెమూరార్చి బ్రాహ్మణుఁ డాబాలునిం దనచేతులలోనికిం దీసికొని వానిమోముం దేఱి పాఱజూచెను. జనని ముఖలక్షణంబు లాశిశువుమోమునం గని యానందించుచు 'ధన్యోమాతృముఖస్సుతః' అనునుడి జ్ఞప్తికి వచ్చి యాబాలుఁడు ముం దదృష్టవంతుఁడు కాఁగలఁడని యతఁడు నిశ్చయించుకొనెను.

ఆమెను మఱల నెచ్చరించిన నేమిమూఁడునో యనుభ యంబు తనమనంబునం బెనంగొన నాయంగనంగూడ మెల్లన నిట్లు

నియెను. 'దేవి! రేయి గడచుచున్నది. ఇచట చోరభయంబు మెండు. నాగేంద్రపుర మిక్కడి కింక నొకక్రోసున కెక్కువ యున్నది. శీఘ్రముగ నిల్లుసేరుదము రండు' అనియన నా. నారీరత్నము తన కాబ్రాహ్మణుఁడు సూపిన యాదరణము వలన మనంబు కొంచెము కుదుటఁబడి నిమ్మళముగా లేచెను. విష్ణుశర్మయు భిల్లుఁడును నామె కిరువంకల రా, వారు నాగేంద్రపురమువైపున కరుగఁజొచ్చిరి.

పండు వెన్నెలలు పిండియారఁబోసిన వితాన దిక్కుల నెల్లయెడలనుఁ బిక్కటిల్లుచుండెను. ఉష్ణకాల మగుటవలనఁ బగలంతయుఁ జెట్లతొఱ్ఱలయందో భూవివరములలోనో దాఁగికొనియున్న జంతుసంతానమంతయు నాహారసంపాదనేచ్ఛ నప్పుడప్పుడ వెలికిఁదలసూప నారంభించెను. దగ్గఱఁ బాఱు చున్న సెలయేటియులుకుడును, చెవులు గింగురుమనునట్లు గుంపుగఁగూడి చేయునిలకోడి పురువుల కీచుధ్వనులు, నప్పుడప్పుడొక పక్షి లేచి కెవ్వనవైచు కేకయునుందక్క మఱియేచప్పుడును వినఁబడుటలేదు. లోకము నిశ్శబ్దముగ నుండెను. చెట్ల సందున మినమినమనుచు నాగేంద్రపట్టణమునందలి దీపికల వెలుఁగు గాన్పించుచుండెను.

విష్ణుశర్మ చుట్టుపక్కలనుండు ప్రదేశములయందు నింపుపరిచితిగలవాఁడు గనుక తన చేతనయినంత చక్కని త్రోవన వారలను దోడికొని పోవుచున్నను మార్గస్వభావమును నతఁడు మానుపలేఁడయ్యె. ఆప్రదేశమంతయు మిట్ట

వల్లములతోడను ఱాలగుట్టలతోడను నిండియుండెను. అచ్చటచ్చటఁ జిన్నసెలయేఱుల యురువడివలనఁ దెగఁగోయఁబడిన యామార్గమునఁ బెద్దపెద్దకందకములువడి యందునిండుజవ్వానునికైననుఁ బట్టపగలుకూడఁ బయనముసేయుట కష్టతరముగ నుండెను.

ఆనారీరత్న మప్పుడప్పుడు క్రిందఁ దూలిపడుచుండినను భయముచేత దేహమువడంక శివమెత్తిన మతంగంబుం బోలె శరీరమునకొక వింతబలము కల్పించుకొని రువ్వురువ్వున నడువసాగెను. ఆమెనుఁ జూచినకొలఁది బ్రాహ్మణున కాశ్చర్యంబు హెచ్చసాగెను. ధైర్యసాహసంబులం గనిన నామె సామాన్య స్త్రీ కాదని మాత్రము స్పష్టమయ్యెను. ఇడుమలనియెడు పెనుకడలినిం గడచుటకుఁ గావలసిన మనోనిశ్చలత యామెమొగమున నాతఁడు చదివెను.

ఇంకను నాగేంద్రము మైలుదూరము గలదు. ఆయబల మనోబలంబున నడచుచున్నదిగాని దేహబలమునం గాదని యావిప్రుఁడు గ్రహించి యెప్పుడామె విఱిగిపడిజీవమును విడుచునోయని సందేహింపఁజొచ్చెను. ఆమెనేమి హెచ్చరించిన నేమివిపరీతములు సంభవించునోయను మఱియొక యధైర్యమాసందేహమును వెంబడించెను.

ఈలా గాధరామరుని మనం బుయ్యేలపగిది నూగులాడుచుండఁ ద్రోవనున్న యొకరాయి కాలికిఁదగిలి యాయంగన క్రిందఁబడెను. బ్రాహ్మణుఁడు బాలుని భిల్లునిచేతికిచ్చి యాలే

మును లేవఁదీయఁబోయెను. కానియామె స్పృహతప్పిపోయినదా నివలె లేవలేకపోయెను. భూసురునకు గుండియలవిసిపోయెను. “హా స్వామీ! నేఁడు నేననుకొనినంతయగునాయేమి. ఇపుడేమిచేయనగును. ఇఁక నీయబలకాయాస మొసఁగితినేని స్త్రీహత్యాదోషముంగూడ నేఁడు నేఁగట్టికొందును.” అని తనలోఁదాను వితర్కించుకొని యాభిల్లునివంకఁ జూచి “భిల్లుఁడా! నీయుదంతముగాని, యీ చెలియ వృత్తాంతముగాని నాకుఁ దెలియదు. అయినను నీవీమెకు సేవకునివలెఁ గానుపించుచున్నాఁడవు. ఈమెరక్షణకై నీప్రాణములనయిన నర్పింపసిద్ధముగనున్నాఁడవు. పరోపకారము మహాత్ములకెప్పుడును బుట్టుకతో జనించినగుణము. నీవు యజమానునియందు భక్తిశ్రద్ధలుగల మహాపురుషుఁడవు. అల్పజాతియందు జన్మించినవాఁడవయ్యును బూజనీయుఁడవు. ఇప్పుడీ దేవి తెలివితప్పి పడిపోయినది. మన మామెకిఁక శ్రమంబాసంగుట తప్పు. మన మొనర్పఁదగు కార్య మిప్పుడు నాకొక్కటి గానంబడుచున్నయది.

అల్లదిగో చూడుము! అమ్మహీధరమ్మున నెడమవైపున నొక గుహగలదు. అందొక యతీశ్వరుఁడు సర్వదానివసించుట యప్పుడప్పుడు చూచుచుందును. ఆయతి యిపుడచ్చట నుండినను నుండకపోయినను నీరాత్రి మీరచ్చట శయనింపవచ్చును. నే నీమె నెట్లయిన నాప్రదేశమునకుం గొని వచ్చెద. నీవా బాలు నెత్తికొని రమ్ము” అని యావిప్రుండు నొడివెను. ఆమాటలనువిని భిల్లుఁడు తనకు మఱి యేయూహయుం దోఁచమి వల్లెయని తానట్లు సల్పుట కొడంబడియెను.

విష్ణుశర్మ యామెను దనరెండుచేతులపయి వైచికొని సవిధనగంబున కరుగసాగెను. అచ్చోటికాగుహ యేబది గజముల దూరముననున్నది. బ్రాహ్మణుఁడంత దార్ఢ్యముగలవాఁడు కాకపోయినను నాయాపత్సమయమున నామె భారమతని కంతగాఁ దోఁచలేదు. ఆవశ్యకత నూతనకల్పనలకు మాతృక గదా! వారిట్లు తల్లిబిడ్డలను దమచేతనయినంత సత్వరముగ నాకొండచఱియనున్న యతీశ్వరాలయమునకుం జేర్చిరి.

విష్ణుశర్మ తనపయియుత్తరీయమును దిగువం బఱచుమని భిల్లునకు మెల్లన సైగసేయ నాతఁడట్లొనరించెను. పఱచిన యుత్తరీయము పయి నామెను బరుండఁబెట్టెను. అంత వారిరువురును దాపుననున్న నాలు గెండుచితుకులంగొని తెచ్చి చకుముకిరాయివలన నిప్పునుఁగలిగించి యంధకారముతోనిండియున్న యాగుహకుఁ గొంతవెలుగును గలిగించిరి.

బ్రాహ్మణు డాగుహను నలుప్రక్కలనుఁ బరిశీలించి యొకమూల భద్రముగ నునుపఁబడియున్న కొన్ని పాత్రములం గాంచెను. ఆతఁడు వానినిఁ బరీక్షింప నొకదానియందు స్వచ్ఛమయిన నీరంబును మరియొక దానిలో క్షీరములును, మూఁడవదానియందు రుచ్యంబులగు కొన్నిఫలంబులునుఁ గానంబడియెను.

ఇవియు భగవదనుగ్రహలబ్ధములయని మనంబున నెంచి యాజలంబున నామెమోముం దుడిచెను. అంత నాయువతి గొంతతెప్పిఱిల్లుటంగని, యాతఁడు మెల్లన నామె నోటి కాక్షీర

మందిచ్చెను. రెండుగ్రుక్కలు లోనికిం బోవ నామెకన్నులు కొంచెము తెఱువఁబడి బ్రాహ్మణునకును భిల్లునకును నించుక ధైర్యస్థైర్యములఁ గలిగించెను. వారంతట నాబాలు నెత్తికొని పాలుం ద్రావించిరి.

బాడబుఁడిట్లు వారికింగొంత శ్రమోపశమనముంగావించి యుదయమునఁ దానొకశకటముంగొనివచ్చి వారినూరికిం జేరిచెదనని భిల్లునకుఁ దెల్పి తాను నాగేంద్రమునకుఁ బయనమాయెను. భూనిర్జరుఁడు తమయెడలంజూపిన కారుణ్యమునకునుఁ జేసిన మహోపకారమునకును భిల్లుఁడు కృతజ్ఞతాపూర్వకనమస్కారంబులొనర్చి “ప్రొద్దున మరల నేతెంచి మమ్ము రక్షించు భారము మీయది ” యని వేడుకొనెను.

———:o:———

# ౩వ భాగము

“ అకటా ! ఏమి నానిర్భాగ్యత ! ఎన్నియపాయములనో పరిగణింపక నిద్రాహారములనైన లెక్కచేయక యలసటయనుమాట తలంపునకుం దేక మాదేవినిఁ జిన్నదొరను నింతదూరము గొనివచ్చితిని. ఆపదలకుం బాసి గట్టెక్కితిమి గదాయని యీపాడు హృదయము సంతసించుచుండెను. ఇంతలో దేవుఁడు నాయాశాపాత్రము నెట్లు పగులఁగొట్టినవాఁడు! అయ్యో నా తెలివితక్కువ నాకెంతటి పాటుదెచ్చినది ! నా జాతి స్వాభావికమగు బుద్ధిజాడ్యము నన్నేలవదలును ? రేయి

యంతయుంగాఁచియుండి యీనఁగాచి నక్కలకిడినయట్లు చివర
కీ యాపత్సమయమందు వారిని విడనాడితిని. వెఱ్ఱిగొడ్ల
కంటె హేయు లయినయామూర్ఖులు వారినిఁ బ్రాణములతోడ
నుంతురా ! ఉంచినను వారిబారినుండి తప్పింపనాకెట్లుసాధ్య
మగును ? శత్రువులబారింబడి యుండరని యనుకొందము.
వారింక నెచ్చటికేగఁగలరు? ఆబ్రాహ్మణుఁడే వారినిఁదోడికొని
పోయియుండవలయును. అట్లేజరిగియుండెననుకొందము. అ
ప్పుడును వారింత వేగిరమేలపడవలయును? నేమఱలి యేతెం
చువఱకు నాఁగియుండరా! అందు నాదేవి చిరపరిచయుఁడను,
నమ్మిన సేవకుఁడనునయిన నన్ను విడనాడి యెవ్వరో ముక్కు
మొగమెఱుఁగని క్రొత్తబాపనయ్యను వెంబడించిపోవుట
కొప్పుకొనునా ? కాదు కాదు. నామనంబున కిపుడు నిజము
వికృతాకారమున విస్పష్టమగుచున్నది. నిజము దెలిసియు నే
నింకేలబ్రతుకవలయు? అచ్చట జాతిద్రోహినయితిని. ఇచ్చట
స్వామికిని మేలేమియుఁజేయఁజాలనైతిని. అన్నివిధములను
దురదృష్టుఁడను. అయ్యో యింకేలయీబ్రతుకు? దయాదా
క్షిణ్యశూన్యుఁడవయిన యోపాపదైవమా ! ఇవిగో కొమ్ము
నాపాడుప్రాణములు."

అని పర్వతగుహాసమీపమున నొకబండపైఁ జదికిలఁ
బడి మోకాటిపై శిరంబుమోపికొని యొకనడిప్రాయపు భిల్లుఁ
డు దుఃఖించుచుండెను. అప్పటికి జాముప్రొద్దెక్కినది. సూ
ర్యుఁడు తనమయూఖముల వాడిసూదులంబోలె వానినల్లని
దేహమెల్ల గుచ్చుచుండెను. ఇంతలో నెచ్చటనో కొంతదూర

మున మనుజుఁడు సంచరించుచున్నట్టు కాలియలుకుడు వినంబడెను. భిల్లుఁడు చివ్వునదలయెత్తి మెల్లనఁజెవియొగ్గి విని యాచప్పుడు వెడలు ప్రదేశమునకై కరువిడెను. ఇతఁడు నాలుగడుగులకంటె నెక్కువ వేయలేదు. రమారమి యేబదిగజములదూరమున కాషాయాంబరాంచితుండై యేగుదెంచుచున్న యొక తపసిరాయనిం గాంచెను. తా మారేయి వసియించియున్న గుహాకధీశ్వరుఁడితండయని యూహించి యామహానుభావునకుఁ దనవిపత్తుల విన్నవించుకొనిన మేలగునని యెంచి యాభిల్లుఁ డతని పదంబులపయిం బడెను.

యతీశ్వరుం డాజానుబాహుఁడు. యోధులమించిన శరీరపటిమ గలవాఁడు. పండినపత్తింబోలె తెల్లగనున్న యాతని జడలను గడ్డమునుంజూచిన నాతండు వయసు చెల్లినవాఁడని యనుకొనవలయునేగాని యతని దేహదార్ఢ్యము నిందుజవ్వనునకైన నుండదు. మొగ మతితీక్ష్ణమయినది. ఎవ్వరిపైనదృష్టి పారించి చక్కఁగఁజూచెనేని వా రెంత ధైర్యవంతులైనను సామాన్యులవలె బలమఱి యతనికి వశులగుదురు. అతని యాజ్ఞను శిరసావహింతురు.

ఈత్రిదండి తన కాళ్ళపయిం బడియున్న యాభిల్లుని వెన్ను మెల్లనఁ జఱచి లేవనెత్తి “ నాయనా ! నీ వెవరవు ? నీకేమియాపద సంభవించెను ? నేఁజేయఁదగు నుపకార మేదయిన నున్నయెడల శీఘ్రముగ వచింపుము” అనెను.

భిల్లు - అచార్యా ! నేను భిల్లుఁడను. మీరు నాకొక మహానుభావులవలెఁ గానుపించుచున్నారు.

యతి - మీదేయూరు ? ఈదూరుప్రాంతుఁడవా ?

భిల్లు - ఆహా ! అయ్యగారు, మీరు దేవులేనండి !

యతి - భిల్లుఁడా ! నీవొక వారమునుండి యుద్ధసన్నాహమున నున్నట్టున్నది ! నిన్నటిదినముగూడ నెవ్వరితోడనో కలహించినట్టున్నదె !

భిల్లు - (తనలో) ఏమీ యీయోగివరుని మహిమ ! నావృత్తాంతమంతయు నామొగమునందే చదువుచున్నాఁడు. ఈయనలో నేదో మహత్తున్నది. నే వీరిదగ్గఱ నేమియుం దాఁచలేను. దాఁచినను బ్రయోజనముండదు. ఒకవేళ నిన్నటి బాపనయ్యయే యీ వేసమున వచ్చియుండఁడు గదా ! లేదు లేదు ! నిన్నటి యయ్యవారి కింత గడ్డ మెక్కడిది ? యోగులు మహానుభావులు. గతాగతములు వారికిఁ గరతలామలకములు- అని యోచించుచుండెను.

యతి - భిల్లుఁడా ! ఏమిట్లు వెఱ్ఱివానివలె నావంకఁ జూచెదవు ?

భిల్లు - అయ్యా ! అంతయు నున్నది యున్నయట్లు వచించితిరి. ఇది యొకటిగూడం జెప్పితిరేని నాకుం బరమోపకారంబొనర్చినవార లవుదురు.

యతి - వత్సా ! నీ కేమియు భయంబులేదు. నాతోడరమ్ము. పిమ్మట నన్నియుం జక్కఁబడును.

యతియు భిల్లుఁడును మెల్లఁగా నాకొండగుహాం బ్రవేశించిరి. భిల్లుని వెలుపలంగూరుచుండ నియమించి యతి లోనికిం

జని నలుప్రక్కలం బరీక్షించినపిదప నచ్చోనదివఱకుంచఁబడిన యాసనముపయిం గూరుచుండి ముక్కువట్టుకొని జపముసేయ నారంభించెను. కొంతతడవునకు జడదారియును భిల్లునిం బిలిచి

యతి - భిల్లుఁడా! సరియె. నీచరిత్రమంతయు నాకుఁ దేటతెల్ల ముగఁ దెలిసినది.

భిల్లు - అయ్యా! దేవిగారును జిన్నదొరవారు నెచ్చోనున్న వారు?

యతి - కడచినరేయి యీగుహాయందుఁ బరుండి యుండిరి గదా?

భిల్లు - అవును. వారిప్పు డెచ్చట నున్నవారు.

యతి - వారివిషయమై నీ వెంతమాత్రమునుఁ జింతింప నవసర ములేదు. వారి కేమియు భయములేదు.

భిల్లు - ఆ బ్రాహ్మణుఁడే తీసికొనిపోయెనా? మాదేవి సుర క్షితమై యుండఁజూచి నేఁబ్రాణములు విడిచితినేనిఁ గృతార్థుఁడను.

యతి - ఓరీకుమారా! వారిపయి నీ కెందు కింత ప్రేమ?

భిల్లు - చిన్నప్పటినుండి వారు నన్నుఁ దమబిడ్డవలెఁ బెని చిరి గనుక.

యతి - ఆహా! ఏమి నీరాజభక్తి! భిల్లులందఱు మీరాజు నేల చంపిరి? మీజాతిలో నీవు తప్పఁబుట్టితివి.

భిల్లు - రాజుగారు నామీఁద నెప్పుడు పుత్రవాత్సల్యముం జూపెడువారు.

యతి - కాకపోయిన వారిమెడ నీ కెందు కింతభక్తి కుదురు

నులె! కాని మీజాతివారికి రాజుమీఁద నింతయసూ
యయేలఁగలుగవలెను ?

భిల్లు - వారల కిసుగడ గలుగుట కేమిలెండి, నేరములు మోప
వలెనన్నఁ గారణములే దొరకవా ?

యతి - ఊరక జాతికంతయు నొక్కరి యాగ్రహము రాదు
గదా ? దుష్టరాజులవలని కష్టము నీ వెఱుంగవు
కాఁబోలు.

భిల్లు - స్వామీ! రాజులింత చెడ్డవారని నేనిదివఱ కెఱుఁగనండి!

యతి - పాపము, నీ కెటులఁ దెలియును? మీజాతికిఁ గుడుము
చేతికిచ్చినఁ బండువుగదా ? భిల్లుఁడా! వినుము. దుష్ట
రాజుల దౌర్జన్యమున కంతము లేదుసుమా !

భిల్లు - అయ్యా! ఇదియంతయు సత్యమేగాని మారాజట్టి
వాఁడుగాఁడు. ఆయన చిన్నప్పటినుండి నన్ను మిగుల
గారామునం బెనిచినవాఁడు. అట్టిమహారాజును జెట్ట
బట్టిన యాదయామతిని, కసిగందువగు వారిబిడ్డను
నితరులు బాధింపుచుండఁ గన్నులారఁజూచి నే నెట్లు
సహింపఁగలను ?

యతి - (నవ్వుచు) ఓరి పిచ్చివాఁడా! దానికేమిలె ? నీయింటి
యొద్దఁ బెరుఁగు కుక్క నీ వేమర్యాదకృత్యములం
జేయుఁబూనినను, నీకుఁ దోడుపడునే గాని యెదిరిం
చునా? మీరు మందబుద్ధులు. కొంచెమెచ్చుతగ్గుగాఁ
గుక్కజాతిలోఁ జేరినవారే! కూడువేసినవారి ననుస
రించుటయె గాని వారికి దీర్ఘాలోచన యెక్కడిది ?

జాత్యభిమానము మీవంటి హీనజాతుల కెట్టులోదవును ?

భిల్లు - అయ్యా ! నేనిప్పుడేమిచేయఁగలను ? అచ్చట జాతికి విరోధి నైతిని. ఇచట ఆ. ఆ. ... ...

యతి - భిల్లుఁడా ! భరింపుము భరింపుము.

భిల్లు - 'అయ్యా! నాకింక దిక్కెదియు లేదు. నాఖడ్గమే నాకు శరణము' అని పెద్దపెట్టున నేడువసాగెను.

యతి - శాంతింపుము. ఏల నీ కీమనోవ్యధ?

భిల్లు - తాము చెప్పినదంతయు వినినపిదప నిఁక నాబ్రతు కేల?

యతి - నే నేమి చెప్పితిని ?

భిల్లు - శ్వానసముఁడనయి యీ రాజుపక్షమువహించి నాజీవిత కాలమంతయు నీతీరునఁ బెనఁగులాడుకొనుచుంటిని.

యతి - భిల్లుఁడా ! రమ్ము. నీజన్మము సార్థకము చేసెదను. నాయాశ్రమంబునందుండి దేవుని స్మరింపుము. సేవింపుము. నీ చేసినపాపము లన్నియు నశింపఁగలవు.

భిల్లు - "అట్టులనయిన మీతోడన వచ్చెదను పదుండు" అని యతి మాటకు సంతసించి వానివెంట నందేనిఁ జనెను.

—o—

# 3 వ భాగము

వేసవి గడచెను. వానకాల మారంభమయ్యెను. ఇం తదనుక నుష్ణకాలంబునఁ దన చండకిరణముల భూమండల మంతయు బెండువడునట్లు మలమల మాడిచి ప్రజాక్షోభం బుం గలిగించిన మార్తాండుం డిప్పు డీవానకాలమందు మంద కిరణుండయి యెవ్వరి కంటంబడకుండఁ బెనుమొయిళ్ళం జాటు చేసికొని పయనంబు సల్పుచుండెను. ఇది సహజముగదా! అధికారబలంబున విఱ్ఱవీఁగు దుష్టు లాయధికారంబు దొలంగిన పిదప సిగ్గుపడి బొగ్గుగఱచుకొని యొక మూల నొదిగి యుంట కనుంగొనుచున్నాము. మండు వేసంగియం దగ్గివలె భగ్గున మండిపడుచు నీచు పశ్చిమంపు వేడిగా డ్పులు వర్షకాలంబునఁ గదలక మెదలక చప్పుడు సేయక తూర్పునుండి పడమటికిం బోవుచుండుటయు మనము చూచు చున్నాముగాదె? అధికారమద్యం బెవ్వనికి మత్తుఁగలుగఁ జేయదు?

దుర్భరంబగు నిదాఘసమయము గడచినవెంటన వచ్చి నదౌటచే నీవానకాలము జనుల కాహ్లాదకరముగ నుండెను. అప్పుడప్పుడు విచ్చుచున్న జాజివిరుల నెత్తావిం గ్రహించి గంధవహుం డన్ని దిక్కులను దాని గుప్పుచుఁ బాటువడుజన సమూహమున కెంతయు శ్రమాపహంబు సేయుచుండెను. పయోధరంబులు భూధరంబులపయిం గయ్యమునకుం గాలుద్రి

వృచందంబున నాకసంబంతయు నెక్కడఁజూచినఁ దామయై దట్టముగ వ్యాపించి తమశరపరంపరల వానిం గ్రుచ్చుచుండెను. ఈ ప్రావృట్కాలమునందు,

చ. విరివిగఁ బూచినట్టి యరవిందమృదూత్పలకేతకీసుమో
త్కరముల తావి నాముకొని గంధవహుండను చెల్మికాఁడు తా
నరవుగఁ బువ్వుగుత్తులను నుయ్యెలలందిడి యూచుచుండ బం
భరనికరంబులూగె ఘనవర్ష సమాగమవేళఁ బాడుచున్ ॥

చ. ఒనరఁగఁ బువ్వుగుత్తులను నుయ్యెలలందిడి షట్పదాళినూ
చుననిలుఁ జేరి మార్జనలచొక్కునఁ బల్వలభూముల న్మృదు
ధ్వనులొనరింపఁ జొచ్చె ఘనదర్దురము ల్గుమిగూడి వారకా
మినులగతి న్మయూరములు మేళనజేసెడు నాటపాటలన్ ॥

క. ధరణియనుతరుణిఁ బ్రియమునఁ । బరిణయమాడం గడంగి
ప్రావృట్థారా । ధరుఁ డనువరుఁ డానతిపయిఁ । జిఱునగవుల
జలకణంపుసేసలు సల్లున్ ॥

వానకాలమును ముగియుచుండెను. ఆశ్వయుజమాసమున సగముగడచెను. ఆశ్వయుజ బహుళ విదియదినంబున సాయంకాలమున నాగేంద్రపట్టణమునం దెల్లెడల మెండగు పండుగ వేడుకలు జరుగుచుండెను. ఏయింటఁజూచినను బాలికలందఱుఁ బరమోత్సాహకందళితహృదయులయి యాటలాడుకొనుచుండిరి. కొంద అభ్యంజనంబు సేయుచుండిరి. కొందఱు కురులారం బెట్టుకొనుచుండిరి. ఎందుఁ జూచినను గొప్పులు సవరించువారె! ఎచటఁ గాంచినను సవరించిన కొప్పులయందుఁ బువ్వులు దుఱుముకొనువారె! సాయంసమ

యమ్మ నిట్లందఱు వేడుకలం బ్రొద్దుపుచ్చిపుచ్చి ప్రొద్దు గ్రుంకుటతోడన బాలికలు తమతమ యిండ్లకుం జనిరి. అదివఱకె వృద్ధస్త్రీ లింట వంటకంబులు సేసి బాలికలకొఱ కెదురు చూచుచుండిరి. కన్యలందఱు సుఖముగ భోజనముచేసి దీపములచెంతం గూరుచుండి చేతుల కతిశ్రద్ధతో గోరంటాకు నలందుకొనిరి. అలందుకొనిన గోరంటాకు చెరిగిపోకుండఁ జేతులకు గుడ్డలు చుట్టుకొని పాన్పులపయిం బవ్వళించి నిదురకుం జొచ్చిరి.

కన్నియలంద ఱిబ్బంగి భోగిపండుగను గడపిరి. మఱుదిన మట్లతద్దె పండుగ. భోగిదినమురాత్రి బాలికలకేమి వృద్ధవనితలకేమి చక్కఁగఁ నిదురపట్టలేదు. తెల్లవారకముంద, యింకను రేయి జాము ప్రొద్దుండఁగనే బాలికలందఱు మేలుకొని తమహస్తముల శుభ్రముగఁ గడిగికొని చల్దులారగించిరి. పిమ్మట వారు యుక్తవస్త్రధారణం బొనర్చికొని, చక్కని యాభరణముల నేర్పరచి యలంకరించుకొని యిలు వెడలిరి. అంత పరస్పరాహ్వానంబు లొనరుచుచు నిరుగుపొరుగిండ్ల కేగి తోడి బాలికల మేలుకొల్పుచుఁ దిరుగ మొదలిడిరి. ఆ సకియలును వచ్చి తమ్ముఁ గలిసికొనఁ దాము వారలం గూడుకొని చెట్టబట్టములు బట్టికొని కేకిసలుగొట్టుచు వీధులయందుఁ దిరుగ నారంభించిరి.

గోరంటాకు తిన్నఁగ నంటినది లేనిది చూచికొనుచు నొకరిహస్తముల నొకరులకుం జూపించుచుఁ జక్కఁగ రంగంటనివారల నగతాళిసేయుచు వెక్కిరించుకొనుచుఁ బలువిధము

లగు నాటలం బాటలం బొద్దుపుచ్చుచుఁ దెల్లవాఱువఱకు గ్రామమంతయు విచ్చలవిడి సంచరించిరి.

ఇ స్త్రీబాలికలు తెల్లవాఱువఱ కుఱుసుఁబుచ్చి డోలా కేళీలాలసలయి యుయ్యేల యెందు లభింపఁగలదని తహతహం బడుచు వెదకుచుండిరి. తద్దైవందుగ దినమున నుయ్యేల లూ గని పడఁతులకు నీజన్మమునఁగాని ముందుజన్మములయందుఁ గాని ముసలిమగఁడు సంభవించునని యువతులలో నొకపిచ్చి యూహ గలదు. ఈయూహ బాలికలకగాక జవరాండ్రకును వృద్ధనారులకుంగూడఁ గలదు.

ఈలాగు పడుచు లుయ్యేలల న్వెదకుచు సమీపమం దున్న యొకతోఁటలోనికిం జనిరి. అందు నిమ్మ, నారింజ, మామిడి మొదలగు ఫలవృక్షములును, కుసుమ విసరంబుల మిసిమి దేలుతీవియలెగాక, వేఁప చింత మొదలగు గొప్పవృ క్షములును విరివిగఁగలవు. తోఁటమధ్యనున్న వేపచెట్టు విశా లమయి దృఢమయిన శాఖలు గలిగి యుయ్యేలవమర్చికొనుట కన్నివిధములం దగియుండెను. అందునకా బాలికలంద ఱానం దంబునొందిరి. కాని యాయుయ్యేలకుం దగిన రజ్జువెచ్చటనుం గానక తమరజ్జువులఁదమకరంబులంబట్టి యాడించుచు నేమియుం దోఁచక నిలువంబడియుండిరి.

వారిలో మేలుజాతిపసిండివన్నియం గేలిసేయఁదగు శరీ రచ్ఛాయగలిగి చూపఱులకు మురిపంబుఁజూపు వదనకమలం బుగల యిందువదన యొక్కర్తు తనవిలోలసితనేత్రముల యో జింపక యాతోఁటలో నొకవయిపునకు మఱల్చెను. ఈ చి

న్నది నాగేంద్రపట్టణాధికారి గారాబు కూఁతురు. ఈమె పేరు శంప యందురు. తల్లి దండ్రు లీమె కేమి నామమిడిరో గాని శంపానామ మామెకుఁ దోడిబాలిక లిడినది. శంప తనదృష్టినిఁ దోఁటలో నొకదిక్కునకు సారింపఁగాఁ గొంతదూరమున గోపబాలు రామెలనాగ కంటంబడిరి. వీరచ్చట పశువులఁ గాయుచుండిరి. శంప యాగోపబాలురం గాంచినతోడన యామెకుఁ బ్రాణము లేచివచ్చినట్టయ్యెను. సంతసముం బట్టఁజాలక యా చిన్నది తోడిబాలికలతో "చెలులారా! అటు చూడుఁడు. అచ్చటఁ గొందఱు బాలు రగుపడుచున్నారు. వారు పసిగాఁపులు. ఆ ప్రక్కనున్న దప్పుఁడేమో? ఆతని మనమిదివఱకుఁ జూచియుండకపోయినను బేరు విన్నాముగదా? వారియొద్ద పశువుల త్రాళ్ళుండకపోవునా? మనమచ్చటికేగి యడిగి తెలిసికొందమా?" అని హెచ్చరించెను. "నీదిసరియైనయూహ! అందఱమచ్చోటికింజని విచారింతము పదుండి" అని యందఱైకకంఠ్యముగ బదులు సెప్పిరి. నడచుచు వారిట్లు మాటలాడిరి.

ఇందు - వారు గొల్లపిల్లవాండ్రుగదె? మనము వారికడ కేఁ
గుదుము? చిన్నతనముగదా?

శంప - "ఏమి చిన్నతనము" 'కార్యార్థినః కుతో గర్వమ్' అని ఎఱుఁగరా? అయినను వారు మంచిబాలురు. అందును నప్పుఁ డొకరివంటివాఁడుగాఁడని విన్నాము. వాని గుణము లతిశ్లాఘ్యములు. అతని రూపంబు నట్టిద! అతనిచూపులేమె?

ఇందు - అతం డొకరాచయింటఁ బుట్టఁదగినవాఁడు. అట్టివాని
కీ పశులగాపరితన మెట్లలవడెనో !

శంప - వానిరూపగుణాలకుం దగువృత్తి దైవము వానికిం గలుగఁ
జేయలేదు. దైవ మెట్టివారికిని దురతిక్రమముగదా !

ఇట్లు వారిరువురు మాటలాడుచుండఁ దక్కిన బాలికలును శంప పాడినపాట కనుగుణమయిన పల్లవిం బాడుచు నప్పని సద్గుణంబుల వర్ణించుచుండిరి. ఈ తెఱంగున నప్పనిం బ్రశంసించుచు నాయువతీలలామము లాగోపబాలురకడ కేగిరి. వీ రచ్చటి కేగినవెంటన యాపసువులఁగాపరి బాలురును వచ్చి బాలికలచుట్టును మూఁగికొనిరి. అప్పుడు గోపబాలురలో నాయకరత్నంబువలెఁ బ్రకాశించుచుఁ బ్రభువువలెఁ దోడి బాలురవలనం బనులుగొనుచున్న యప్పనిం గాంచి శంప యిట్లనియె. " బాలకశ్రేష్ఠా ! నీవు మాకొక్క సాయము సేయవలెను. చేయుదువా ".

అప్ప - అభ్యంతరమేమి ? నా శక్తివంచనలేక చేయుదును.
నావలన మీ రే సహాయ మభిలషించెదరు ?

శంప - నేఁ డట్లతద్దె పండువుగాన నూయెల నూగుకోరికతో
నిచ్చటి కేమే తెంచితిమి? మాపెద్దవాండ్రు మారాక
నెఱింగిన మమ్ము రానీయరను భయంబున నేరికిం
దెలియకుండ బయలు వెడలితిమి. ఈతొందరలోఁ
ద్రాడుదే మఱచిపోయితిమి. మాకొక పగ్గము సంపా
దించి యిచ్చెదవేనిఁ గడు సంతసించెదము.

అప్ప - ఇదెంతపని ? మాయొద్దన వస్త్రములున్నట్లున్నవి. కాని యవి మీకీయవచ్చునాయని యాలోచించుచున్నాను.

శంప - మాకేల యీయఁగూడదు ? దీనివలన నీకుఁ బుణ్యమేగాని పాపమురాదు గదా?

అప్ప - పుణ్యమే గావచ్చును. కాని యవి పశువులకొఱకుఁ దేఁబడినవి మీ కెట్లొసంగుదు నబ్బా !

శంప - ఒసంగిన నేమి ? అప్పారావుజీ ! అడ్డు చెప్పక వస్త్రములిమ్ము.

అప్ప - బాలికలారా ! ఈపండుగ దినమున మీరువ్యాల త్రెడడిగిన నీయకుండుట సరిగాదు. పశువులకొఱకుం గొనివచ్చిన వస్త్రముల నిచ్చుటయు మంచిదని తోఁచదు. ఈయాలోచనలో నామనం బుయ్యెలపగిది చలించుచున్నది. ఏమిచేయుటకుం దోఁచ లేదు.

శంప - దీనికింత యాలోచింపనేల ? మాసంతోషావాప్తికిం గారణుండ వౌట కిష్టపడవా ?

అప్ప - ఏదియెట్లయినను మీ యుత్సాహభంగము గలుగఁజేయ నా కెంతమాత్రి మిష్టములేదు.

శంప - అట్లయిన వైశంబ వస్త్రముల మా కొసంగుము.

అప్ప - ఇచ్చెదను. కాని వాని మీరూరక గొనుటయు నంత యుక్తముగాదుగదా ?

శంప - బదులేమియ్యగలము. మానగలలో నేదైనఁ గోరికొనుము. మేమది నీకు సంతోషముగా నిచ్చివేయుదుము. తొందరగాఁ బస్త్రముల నిమ్ము.

అప్ప - ఈ నగలు నాకేల ?

శంప - మఱేమి గావలెనందువు ? మాయొద్ద మఱేమియును లేదే ?

అప్ప - మీయొద్దియు నాకీయనక్కఱ లేదులెండి.

శంప - మఱేమి చేయుమందువు ?

అప్ప - చెప్పుదునా ? మీరు కోపపడరుగదా ?

శంప - 'నిర్భయముగ వచింపుము.' అని శంప ముసిముసి నగవుల నిలువంబడెను.

అప్ప - నాతోడ మీరందఱొక్కపరి యాడుకొనుట కియ్యకొంటిరేని మీ కోరిన ట్లుయ్యేలత్రాడు సమర్పించుకొన సిద్ధముగ నున్నాఁడను.

శంప - మేమాడుకొనుటకే వచ్చియున్నాము. కాని బాలురు బాలికలుఁగలసి యాడుకొనువాడుకకలదా ! అట్లు చేసినఁ జూచినవారు నవ్వరూ ?

అప్ప - ఆలాగైన నాపగ్గములు నాయొద్దన యుండునులెండి.

శంప - మేమాలాగె నీతోఁగలసి యాడుకొనెదముగాని మాకుఁ బగ్గములు మాత్రమొసంగుము. ఏయాట యాడుదము ?

అప్ప - మఱేమియుంగాదు. పెండ్లియాట.

అప్పఁడాడుదమని చెప్పిన యాట యొరులెఱింగిన నగుబాటునకుం గారణమౌనని బాలికలెఱిఁగియుండినను తామాడమని చెప్పిన నుయ్యలత్రాడెక్కడ లభింపకపోవునోయను భయంబు బాలికలకుఁగలిగినది. ఆ భయమునకు నప్పనివచో

మాధురియుం దోడయి బాలికల నాతండు గోరినయాట కియ్య కొనునట్లు చేసెను.

అంత నాగేంద్రపట్టణాధిపతి కూఁతురగు శంపయొక్కయు నామెచెలికత్తియల యొక్కయుఁ జీరకొంగులను నప్పుడు తనశాలువచెఱఁగునకు ముడివైచికొని శంపహస్త పల్లవముం బట్టికొని సమీపమందున్న భూరుహమునకుఁ బ్రదక్షిణము సల్పి తదనంతరము వివాహమునందు సాధారణముగ జరుపఁబడు లాంఛనములతోఁ బాణిగ్రహణమహోత్సవము పరిసమాప్తినొందించెను. బాలికలకుంగూడ నాతఁ డిట్లొనర్చుట పరమసమ్మతమయి యాతని దండ నిలిచిరి. చెంగటనున్న తక్కొజవర్గమునుఁ బూవుందీవియలవలె సతులు పార్శ్వసంశ్రితులఁ జేరికొనుట సహజమగదా!

తరువాత నప్పుడు వారలకొసంగిన వాగ్దత్తమునను సరించి వారికిఁ బగ్గముల నొసంగుటయగాక యాపగ్గములను బాలికలు కాన్పించిన నింబతరువున కుయ్యెలను కూడ నమరిచి యిచ్చెను. బాలికలు మహానందమున నోలలాడి తనివిసనున ట్లుయ్యెలలూఁగి సాయంకాలమున నిల్లుసేరిరి.

పసితనమునుండి యప్పఁ డవనిసురగృహంబునం బెరిఁగినవాఁడౌటచే నతనికి భూతదయాశాంతాదిసద్గుణము లలవడెను. అతనిపుట్టుపూర్వములు జనులకుఁదెలియమి వారాతని యల్పకృత్యములయందునిచి పనులు గొనుచుండిరి. ఆబాల్యము నాతం డూరివారి పశువులనుఁ గాచికొని జీవించుచుండెడు వాఁడు. ఆతండు సహజముగా నతిసాహసియు మిక్కిలి శరీర పాటవమునుఁ గలవాఁడు.

ఈపెండ్లిని గురించిన సంగతులెవ్వియు నేరికిం దెలియ నీయఁగూడదనియు, గ్రామమున జరుగు సంగతు లెప్పటి వప్పుడు వ్రాసిపంపుచుండవలయుననియు, తనకు సహాయముగా నుండి యీ విషయమునం దోడ్పడవలయుననియు నప్పుడు తోడిబాలురకుం గట్టికట్టడిచేసి తానును వారలునుఁ గూడి యధేచ్ఛం జనిరి.

# ౪ వ భాగము

---

"త్వరితముగ రండు. అయ్యో నేనేమి చేయుదును! నాముద్దులపట్టీ! ఇఁక నాకేది దిక్కు? తండ్రులారా! ఊరక చూచుచుండెద రేల? శీఘ్రముగ నాచిన్న దొరసానిని నాకం దిండు. ఆలసించిన నాబాలిక నాకు దక్కదు. అదెచూడు డది యంతకంతకు దూరంబు పోవుచున్నది. వేళంబ మీ రీ నీటం జొచ్చి యీ చెలిని గట్టునవేయఁ బ్రయత్నింపుఁడు. వేగిరమ మీ చెయ్యందిండు. ఈఁతనేర్చిన పుణ్యాత్ముఁ డెవ్వఁడయిన నిందుండిన నిప్పట్టున నాపట్టిని నియ్యేక్కట్టునుండి రక్షించి యీఁతకాఁ డీతగాఁ డనుపత్రీతి వహింపుఁడు. నాయనా! నన్నును నాకాపురమును నిల్పుఁడు. బాలిక నీటమునుగకమున్న యామెం గాపాడుఁడు." అని నాగేంద్రపట్టణ ప్రాంతమున విలోకానదీసమీపమం దొక వృద్ధవనిత మిగులఁబొగులుచుఁ దత్తఱమున నటునిటుఁ బరువిడుచుండెను.

పురమువయిపుగట్టుమీఁద బహుజనులు మూఁగియుం డిరి. ఎచ్చటఁజూచినను జనుల కలకలధ్వనులు క్రిక్కిరిసి యుండెను. 'ఆహా! ఏమి యీ వైపరీత్యము! ఆపడుచునేరును రక్షింపఁబూనరైరిగదా' అని యెలుఁగెత్తి యఱచువారును, నేఁ డాబాలిక పొద్దునలేచి యెవరిముఖముచూచెనో యిట్టి పాటొదవెననువారును, ఆ పాడుదైవమునకీ బాలికయే కనుపడ వలయునా! దానిప్రాణమాతనికింత బరువయినదికాఁబోలు' నని యను వారును కాటికిఁగాళ్ళులు సాచియున్న యీ ముసలిది పోయి, ముందింకను బ్రతికి బాగుపడవలసిన యీ చిన్నది బాగుండఁగూడదాయనువారును, పూర్వకృతమెవరు దప్పించు కొనఁగలరనువారును, నేఁటితో నీ చిన్నదానికి నూరేండ్లునిండి నవిగాఁబోలును లేకున్న నిట్లేల సంభవించుననువారును, పొందు తెంపుసేయుఁడు; ఊరక చూచుచున్న గోరంబుసంభవిం చునని చెంతనున్నవారినిఁ బ్రేరేపించువారును నెక్కడఁజూచిన వ్యాపించియుండిరి. కాని యొక్కఁడును సాహసించి ముందంజ వేయలేదు. తెగించి యెవ్వరయిన ముందొక యడుగిడి నీటం దిగఁబోయిన వానింగూడ దగ్గఱనున్నవారు ఱెక్కఁబట్టుకొని వెనుకకు లాగుచుండిరి, కాని పోనిచ్చుటలేదు. వీ రిట్లు చేయుట యా చిన్నదానికి రక్షణము కలుగకుండ నుండవలెనని గాదు సుండీ. పోనున్న ప్రాణ మెట్లోపోవును. దానికిందోడు మఱి యొకజీవహత్య తోడౌనేమో యను భయమే, వారల నిట్లు జేయఁజొచ్చెను.

చదువరులారా! అపాయసమయములయందు జనుల కిట్టి భయములును, మనస్థైర్యాభావమును గలుగుట మనము తెలియుచుంగ జూచుచున్నాము గదా? గృహము పరశురామ ప్రీతియగునపు డెందఱు జను లెంత యాతురతతోఁ గాలు చున్న యింటిచుట్టును మూఁగుదురు? వారంద ఱూరక కన్నులు వెట్టుకొని చూచువారగాని యొక్కరయిన నక్కఱతో నాపాల్లగునిల్లుం జల్లార్ప యత్నింతురా? ఇది జన సామాన్యమునకు సహజము.

జలమునం బడిన బాలిక ప్రవాహముతోడం గొట్టుకొని పోవుచునే యున్నది. నీటిలో నొకపరి మొకమునుకయు వేసి యున్నది. ఇంకొక మునుకతోడఁ బ్రాణావసానమవున ట్లగుపడెను. నను రక్షింపుము, నను రక్షింపుమని భగవంతుని వేఁడికొనుదానివలె నాబాలిక తన హస్తకమలములం బయికెత్తుచుండెను. దైవ మాపద్బాంధవుఁడు గదా! భగవంతున కా బాలిక ప్రార్థన చెవింబడెను గాఁబోలును. అప్పుడాగట్టున మూఁగియున్న జనసమూహమునుండి పదునాలుగు పదునయిదు వత్సరముల పడుచువాఁ డొకఁ డాకస్మికముగ గుబాలున నీటిలోనం దుమికెను. స్వస్థానబలముచేవిజృంభించిన మకరిబాధ కోర్వఁజాలక తనను స్మరించిన మాత్రన కరి మొరాలించి దానినిం గాచిన భగవంతుఁ డీ చెలినిమాత్ర మేలయుపేక్షించును?

ఆ పడుచువాఁ డా మునుక వెంబడి నీటియడుగుభాగమునకుంబోయి కొంచెముకాలము జనులకనుల కగుపడక

యుండెను. అందునకు జనులందఱు హాహాకారము లొనరించిరి. కొందఱు అయ్యో బాలుఁడు చచ్చెచచ్చెననిరి. ఎప్పుడయిన రాలిపోవలసిన యీపాడుదేహమును బరోపకారమునందు విడువయత్నించుచున్నాఁ డిది సర్వవిధములఁ బొగడఁదగినది గదా యని మఱికొందఱనిరి.

ఇట్లనేకు లనేకవిధములుగ యోజించుచుండ నొకటి రెండునిముసములు గడచెను. జనుల నేత్రంబులన్నియు నా బాలుఁడు మునిఁగినచోటన యుండెను. ఇంతలో నాపడుచువాఁ డా బాలికకడమరలఁ బొడసూపి యాపడుచుం గడు మెలఁకువతోడం బట్టుకొని గట్టునకుం జేర్చుచుండెను. బాలిక తన బాహులతల నాతనియెడమ బుజముపయి వైచి యుండెను. దుఃఖము వలన స్రవించుజనులకన్నీళ్ళు వెంటన యానంద బాష్పములుగ మాఱెను. జయజయధ్వనులు కెలంకులను బలంబుగఁ జెలంగెను. బాలికయు యౌవనుఁడును సురక్షితముగ గట్టుఁజేరిరి. వీరినిద్దఱుం జూచువేడ్క జను లొకరిని మించి యొకరత్యాతురతతోడ వారిచుట్టును మూఁగఁజొచ్చిరి. కొందఱు త్రోయొత్తుకొనివచ్చు జనులవలన బాలికకొత్తరువు గలుగకుండఁ బయింబడి వచ్చు జనంబుల నీవలావలకు నొత్తుచుండిరి. మృత్యుముఖమునుండి తప్పింపంబడిన తన చిన్నికూనం గౌఁగిలించుకొని వృద్ధసేవకురాలు కనులవెంట సంతోషజలంబుల విడిచెను. ఇట్టి మహోపకారం బొనరించిన యౌవనునకుం దగు మరియాదలు సేయం గొందఱు ప్రయత్నించిరి గాని

యాతం డీ సందడిలో నేరికంటం బడకుండ మెల్లన నదృశ్యుం డయ్యెను.

ఈ మహోపకార మొనర్చిన యుదారపురుషుం డెవ్వం డనియూహించెదరు ? రక్షణమునొందిన యాయదృష్టవతి యెవ్వరు ? ఆమె నాగేంద్రపురాధికారి ముద్దులబిడ్డ. ఇంక నా యాపవనుండో! మనయప్పండెసుడీ. ఈతని ధైర్య స్థైర్యములం దెలుపుట కిది యొకతార్కాణము. ఆతండు మేరుసమాన ధైర్యుండని వచించుట యొక యుపమానివయికము కాదు. బాహుబలమం దాతండపరభీముండనుట యొక యుచ్ఛకంబు గాదు. సాహసమున నాతని కాతండసాటి. కొండొక యల్పసాహసకృత్యంబు నెఱపినంతమాత్రమున నొకనిని సాహసవిక్రమార్కుం డని పేర్కొందురు. గాని యితనిముం దా విక్రమార్కుం డెంతటివాఁడు ! ఈతని సాహసముం దెల్పుమఱియొక విషయముం జెప్పినంగాని చదువరుల కాతని సమయస్ఫూర్తి యిట్టిదని బోధపడదు.

నాగేంద్రపట్టణసమీప విపినభూములయందుం దిప్పలలోనిచిక్కని మఱుఁగుప్రదేశమున నొక బెబ్బులి బహుకాలమునుండి వాసంబుసేయుచుఁ గ్రమక్రమమున గ్రామోపశల్యములకు రాసాహసించి యందచ్చటచ్చటఁ జెదరి తిరుగు నే పశువునో లేక దురదృష్టుఁడగు నే మనుజునో నోటవేసికొనుచుండెను. ఆకటికు మొకముదాడికి నోరువనోడిపురవాసులు పగటిపూట నెట్లోకాలంబుఁగడపి పొద్దుగూకుటకుముందే తమ

పశువులఁ దమయిండ్లలో భద్రముచేసికొని తాముసు లోనం జేరి తలుపులు మూసికొని కాలంబుఁగడపుచుండిరి. భయమున స్వేచ్ఛగాఁ దిరుగమానివేసిరి. వారెంత జాగరూకులయియు న్నను, వారికన్నుమొఱఁగి యెప్పుడప్పు డది దేనినో నోటఁగఱ చుకొని యీడ్చుకొని పోవుచుండెను. దానివలనిబాధను దప్పించుకొనుటకు వారనేకప్రయత్నములు చేసిరి. కాని వారి యత్నములన్నియు నిర్ధనుని కోర్కులవలె నిష్ఫ లంబులయ్యెను. ఎవ్వరయిన నీ ఘాతుకమృగమును మట్టువెట్టి నయెడల వానికిం గోరినధనం బొసంగెదనని గ్రామాధికారి చాటింపించెను. కాని యూర నెవ్వరికి నట్లుచేయుట సాధ్యము కాక పోయెను.

ఒకనాఁడు సూర్యోదయమయిన పిదప నప్పఁ డడవి కయి పయనంబు సేయుచుండెను. అతండు కాళ్ళకొక బూడి దవన్నె చెడ్డియు, శరీరమున ముతక యంగీయు, వేసికొని యుండెను. ఆతని మొలను నొక మడ్డుకత్తి చెక్కఁబడి యుండెను. ఒక పరశ్వధము నొక వంకకత్తియు నడుమున వ్రేలాడఁ గట్టఁబడి యుండెను. వామభుజంబున ధనుస్సునుఁ గుడిచేత నాశుగమును ధరించి యుండెను. ఈతం డొంటరి పాటున నడవి కేగుటం గని పురజను లనేకు లాతని వెంబడిం చిరి. వాని సాహసకృత్యముల నదివఱకెన్నియో వినియుఁ గనియు నున్నవారగుటచేత నతఁడు నాఁడెట్లో తమ కపాయ కారణంబగు బసితిండిని సంహరింపఁ బోవుచున్నాఁడని తలం చిరి. ఆవింత చూడవలెనని కొందఱును, సాధ్యమయిన నతనికిం

దోడుపడవలెనని కొందఱును దూరమున నతనిని వెంబడించు చుండిరి.

అప్పు డడవిం బ్రవేశించి యయ్యరణ్య మధ్యమున నా చారలమెకంబు నారయుచు నిర్భయుంబుగ సంచరింపఁ జొచ్చెను. ఆ మృగం బెచ్చటం గానరాదయ్యె. మధ్యాహ్న మాయెను. ఆతండు తిరిగి తిరిగి వేసరెను. ఆయాస మించుక జనించి యొక వృక్షమూలమున నాతండు గొంతవిశ్రమించెను. మార్గాయాసమువలన నాతనికిఁ గొంచెము నిదురయు వచ్చి వాని కన్నులు తమంతతాము ముకుళించెను. ఈసుషుప్త్యవస్థ యం దొక నిముసమయినం గాలేదు ; 'అదిగో పులి యదిగో పులి' యను గుసగుస ధ్వని యొకటి పుట్టి నిదురగూరిన యప్పని చెవిం బడెను. ఆ ధ్వని మిక్కిలి యల్పమయి నను నప్పని నిదురకు భంగ మొనర్చి యతనిని మే ల్కొనునట్లు చేయకమాన లేదు. అంత నాతం డాతురతతో లేచి కనులు విప్పి నలుదెసలం బరికించెను.

అప్పు డా మువ్వన్నెమెక మా సమీపమందున్న చిన్న రాలగుట్టచాటున నొక యావును వ్రేసి తినుచుండెను. దాని శరీరమంతయు రాలచాటున దిగువభాగమందుండుటచే దాని శిరముమాత్ర మీతనికిఁ గనుపడెను. పులఖండంబులంబోలె పలలఖండంబులు నములుచు నెవరివలననైనఁ దనకపాయంబు వాటిల్లునోకో యనికాఁబోలును, నా శార్దూలంబు నడుమ నడుమ తనయుత్తమాంగ మొకింతయెత్తి యీవలావలంజూ చుచుండెను. ఇట్లు శిరం బెత్తుటలో నొకపరి దానితల యా

యప్పనికంటఁబడినది. ఒకఁడొకకార్యమునందఁ దనమదిని
జొప్పించి యున్నపుడతం డేవస్తువునుగాని యేవనింగాని కాం
చినది తనకార్యమున కనుకూలవిషయమని భావించుట సుప్రసి
సిద్ధము. ఆ మెకంబు తనకనులకుఁగానరాఁగానే యప్పఁడు చి
వాలునలేచి చేతినారిసారించి గుఱిచూచి యామృగము శిర
మునెత్తినపు డాతురతతో నొకబాణమును వదలెను. ఈలోం
దరలో గుఱిచెదరి విడిచిన శరంబు దానిశిరంబుపయి నెగిరి
పోయెనుగాని దానికిఁదగులలేదు.

ఇందువలన వానికి గుఱితప్పిన దనుటకును వీలులేదు.
ఆమృగము తనతలపైకెత్తినపు డాతండు బాణంబువిడిచెను. ఇం
తలో నా జంతువు శిరంబువంచెను. కాన నాయాశుగమసిఁబో
యెను. కాకున్నది దానియసువులంగొనియుండును. అబ్బాణ
పాతికిందప్పి యాశరవేగధ్వనికి రౌద్రమూర్తియయి యవ్వ్రి
టుతోడన యా బెబ్బులి యప్పనిపయి కుఱికెను. తా నేసిన
యమ్ము వమ్మయినదని వాఁడెఱిగెను. మరల బాణసంధాన
మున కెడములేదనియు గ్రహించెను. కాన నప్పఁడు తన
చేతనున్న చాపాశుగంబుల నేలపయింబాఱవైచి తనశరీర
సంరక్షణార్థమయి చేతులుసాచి కవచంబుఁ బైకెగఁజెక్కి సిద్ధ
ముగనుండెను.

కసిమసంగి యా పశువుల దిండి తన ముందుకాళ్ళం
బయి కెత్తికొని రివ్వుమని యతనిపయికి దూఁకెను. ఎత్తినదాని
ముందుకాళ్ళను దనకుడియెడమచేతులతో దాని కుడియెడమ
కాళ్ళ నొడిసిపట్టుకొని యప్పఁడు దానితోఁ బెనఁగులాడ మొద

లిడెను. దూరమందుండు జను లదిచూచుచు నిలువఁబడిరి. కొందఱును నతనికిందోడుపడరైరి. 'రండు, యీ మృగమును ఖండింపుఁడు మీకెద్దియు హానిరాకుండ నేనీమెకంబును భద్రముచేసితిని' అని యప్పఁడెలుఁగెత్తి యఱచుచున్నను నొక్కరయినం దెగించి యతనిసరస కేగరయిరి. అదిచూచి యప్పఁడా జనులవలనఁ దనకేమాత్రము సహాయ మబ్బదని నిశ్చయించుకొని చావునకుం దెంపుచేసి దానిరెండు ముందుకాళ్ళను దటాలున నొక్కపరి కరలాఘవంబునఁ దనయెడమ చేతంజొప్పించికొని నడుమున దోఁపియున్న మద్దుకత్తికుడిచేత లాగి దానినెత్తిపయిఁ జేటికొలఁది నొకయేటునాటెను. ఆయేటుతోడనఁదలవగిలి యాక్రూరమృగము తనయసులులంగాసెను.

అప్పఁడప్పడాజంతువును దిగువంబాఱవైచి తనగండ్రగొడ్డలిచే మఱిరెండు దెబ్బలనమరిచెను. అప్పటికిని జనులాతని సమీపమునకు రాసందియపడుచుండిరి. ఆ ఘాతుక మృగంబు భూతలంబునంబడి చాలకాలము లేవకుండుటంగాంచి చచ్చినదని నిశ్చయించుకొని తుదకు వారు క్రమక్రమముగ నప్పని కడకుఁజనుదెంచిరి. అతనిధైర్య స్థైర్యముల కెంతయు సంతసించిరి; ఇట్టిప్రతాపభూయిష్ఠమగు కార్యంబు లాతండెన్నియో యొనరించినవాఁడు.

---o---

# ౫ వ భాగము

నేఁడు నాయజమానుని యింట నెవరి మొగము చూచినను నెద్దియో యొకవిధముగఁ గాన్పించుచున్నది. ఇంటి యాఁడువాండ్రలో నేఁ డేమో గుసగుసలు మెండయ్యె. ఎన్నఁడును రాని శూరశింగు, రణశింగు మొదలగు నూరి పెద్ద మనుష్యు లీ దినమున నా యజమానుఁడగు ధీరసింగు గారింటికే తెంచి పరమరహస్యముగ సంభాషించుచున్నారు. తక్కిన గ్రామవాసులనుఁగూడఁ దోడికొని రమ్మను మని యీ ప్రకటన పత్రికను నాచేత నిచ్చి పంపిరి. కారణ మేమయి యుండును? జగత్సింగుగారి గృహంబున కిప్పటికి రెండు పర్యాయములు వెళ్ళివచ్చితిని. ఆయన దర్శనమే కాదయ్యె! వచ్చినట్టు మరల వచ్చుటకే పోవలెను. తిరిగి తిరిగి నాకాళ్ళు పడినవి. సేవకవృత్తి చాల చెడ్డది గదా! వీరి యాలోచన లేరి కొంపఁదీయుటకో! ఉరుమురిమి మంగలము పయిఁబడిన దన్నట్టు లీ ప్రయత్నమంతయు నాయప్పని విషయముగాదు గదా? వానికే మూఁడినట్టు గనుపడుచున్నది. పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రమా! వానివిషయమయి యింతగావలెనా? ఈపిన్న వాఁడేల యింత సాహసింపవలయును? పాపము! ఆ పిల్ల వాని దేమితప్పు? తమ బిడ్డలు తమకు మంచివారే! గొప్ప వా రేమన్ననుఁ జెల్లును. పేదవాఁడెంత మంచికార్య మొనర్చినను, నది చెడ్డదిగానే పరిణమించును. పిల్లవాండ్ర యాటల విషయమయి యింత యార్భాట మెందునకో!

దీనికంతయు నాజ్యోతిషికుఁడే మూలము. బాలికల తల్లిదండ్రులు తాముతమబిడ్డలకిదివఱకు వివాహముచేయలేదని స్పష్టముగ నెఱుఁగుదురు. బాలికలు తమకు జరిగిన యాట పెండ్లి సత్యమయినపెండ్లిగాదనియు ముందు క్రొత్తగ వివాహమాడవలసిన వారమనియు నెఱిఁగియుండిరి. బాలికలును తామాయాటపెండ్లిని మఱచిపోయిరి. ఇట్టిసంగతిలో నాకార్తాంతికుఁడీయాటపెండ్లిప్రస్తావ మేల తేవలెను? ఈతం డీవిషయము ముచ్చటించియుండకపోయిన తల్లిదండ్రులకీవార్తయే తెలిసియుండదు.

ఆనాఁడీ యప్పుఁడీ గ్రామమునందలి యాఁడుబిడ్డలతోఁ బెండ్లియాట యాడెనఁట! నవ్వులాటకై చేసిన యాతప్పున కింతచేయవలయునా? ఆతఁడును బాలుఁడు. తెలిసియో తెలియకయో చేసినాఁడని యుదారబుద్ధిగలిగి వానిని క్షమించి యుండఁగూడదా? ఆటపెండ్లి నిశ్చయమగు వివాహమగునా? పోనీ! అదియే సరియైన వివాహమనుకొందము. అప్పుడును నప్పని క్షమించుట యుక్తముగాని యీ దుర్మార్గమునకుఁబూనవచ్చునా? ఆపడుచులకుఁదిరిగి వివాహము చేయఁగూడదుగదా? అప్పుఁడీ జన్మమునం దీ బాలికలకుఁ బెనిమిటియుఁ దమకల్లుండును నయ్యెంగదా! అల్లునకు హానిఁదలంచిన నది తమకే తాము కీడొనర్చికొనుట గాదే! ఇంతకాపిల్లవాని యదృష్టమెట్లున్నదో! దిక్కులేనివానికి దైవమే తోడని చెప్పుదురు. భగవంతుఁడు వాని రక్షింపకుండునా? అని విచార

సూచకమగు మోముతో నొక సేవకుఁడు నాగేంద్రపట్టణ రథ్యాంతరమునఁ గాగితమొకటి చేతంబూని పోవుచుండెను.

అలాగనుకొనుచుఁబోవుచున్న యాసేవకున కెదురుగాఁ బదునాల్గు వత్సరముల యీడుగల బాలుఁడొకఁ డామార్గమున వచ్చుచుండెను. వా రిరువురకు నీరీతిగా సంభాషణము జరిగెను.

బాలు - కేశవసింగుజీ ! నీ వెచ్చటి కేగుచున్నావు ?

సేవ - నాయనా ! సేవకుని కొకటియాపని ! యజమానుఁడు తలఁచుకొనినయెడ సేవకులకుఁ బనులకుఁ గొదువా ?

బాలు - మీ యజమానుఁ డెవరు ?

సేవ - ధీరసింగుగారు.

బాలు - ఆయన యిపు డెచట నున్నవాఁడు ?

సేవ - ఇంటనేయున్నాఁడు.

బాలు - ఏమి చేయుచున్నాడు ?

సేవ - ఎవరోకొందఱు గూరుచుండి మాటలాడుచున్నారు.

బాలు - ఆచేతిలోని దేమిటి ?

సేవ - ఇదేమోచూడుము. ఇదియొక పత్రికటన కాగితమని యెంచెదను.

బాలు - దాని నిటు దెమ్ము.

సేవకుఁడంతట నాకాగితమతనిచేత నీయ బాలుఁడు దానిఁ జదువుకొని మరల నాతనికిచ్చెను. అందు జగత్సింగు చే వ్రాలుండెను. ఆ చేవ్రాలు చూచినతోడనె బాలున కేటికో

మనంబునఁ గలవర మారంభమాయెను. జగత్సింగదివటుకుఁ గొంత కాలముక్రింద నప్పునికిని పురములోని యాఁడుబిడ్డలకును జరిగిన యాటపెండ్లి విషయము కొందఱితో ముచ్చటించుచుండుటయు, నిక్కార్యంబు సల్పినందునకై యప్పునిపయి యాగ్రహము కలిగి యుండుటయు, బాలుఁ డెఱుంగును. కాన నీ పత్రిక తత్సంబంధమయి యుండవచ్చునని యాబాలునకుఁ దోఁచెను. తన యనుమాన మా సేవకునకుఁ గనుపరపలేదు. లేని సంతసమును మోమున నాత్తించికొని బాలుఁడు సేవకుని వీడ్కొని తన తోవం జనియెను.

## ౬వ భాగము.

ధీరసింగుగారి యిల్లు గ్రామమునకుఁ జిట్టచివర జన సమ్మర్దము లేని యొక మాఱుమూలనున్నది. దానికి సమీపమున విశాలమయి వృక్షచ్ఛాయాచ్ఛాదిత క్రీడాసరోవర స్వచ్ఛజలంబులచేఁ బెంపుఁ బడుచున్న యుపవన మొకటి గలదు. ఈ యుపవనములోని యొక చిన్న యింటియం దొక దినము సాయాహ్నమున నాగేంద్రపట్టణవాసులు కొందఱు కొంత కార్యాలోచన మొనరించుటకు నాయింట నొక రహస్యస్థలమునఁ గూర్చుండి గుసగుస లాడుచుండిరి. వారి రహస్య సంభాషణ మీావగిది జరిగెను.

జయ - మనకీ పరిభావమెట్లు తొలఁగును ? మన మెఱింగి నంతలో నిట్టి విపరీతము లెప్పుడయినం గలిగెనా ?

జగ - ఆనీచుని కనులకుఁ బొగరెగఁదట్టినది. వాని కులమెంత, వాఁడెంత ! తనస్థితి దానెఱుఁగఁడయ్యె. గొల్లవానికి రాచబిడ్డలతోఁ దచ్చనలేల ?

ధీర - మాదే మఱియు నన్యాయము. శంప తల్లిలేనిబిడ్డ. దాని కింటంగూడ సుఖము లేదు. గోరుచుట్టుమీఁద రోఁకటిపోటన్నట్లు లా దురదృష్టమునకుఁ దో డీదుస్థితి సంభవించినది.

జయ - మనమేలాగయిన నప్పని మట్టుపెట్టవలసినదే. అటుల నొనరించినంగాని ముందయిన మఱియొకఁడిట్లు తెగింప కుండనుండఁడు.

ధీర - పాప మాచిన్నవాఁ డేమిచేసెను. దానియదృష్ట మట్లున్నది. వానిదండించి మాత్ర మేమిప్రయోజనము?

రణశింగు - నీ వొక పూర్వకాలపు మనుజుఁడవుసుమా! సత్యకాలమంత కొట్టుకొని పోవుచున్నదనుకొంటివా? దండనార్హుఁడు దండింపఁబడవలసినది. వంకాయకు వచ్చిన చెయ్యి టెంకాయకేల రాఁగూడదు ? ఇప్పుడు కన్నియలకుం బన్నంబు ఘటియించెను. ఱేపు మగవాండ్రకే తెగఁబడును.

జయ - ఆమాట సత్యము. వానికెంత కనులకావరము కాక పోయిన నిట్టికులీనులబిడ్డలతోఁ జనవులఁగొనఁ దెగిం

చునా? వాఁడు తప్పక శిక్షార్హుఁడ. అతఁడు నేర్చిన కలువ. ఇదివఱ కాతఁడొనరించిన దొంగతనమింతవఱకు బయలఁ బడలేదు. మీఁదుమిక్కిలి యిది యొకటి వచ్చినది.

అప్పుడయి నీ నాగేంద్రపట్టణవాసులు మోపిన నేరములు రెండు. వాఁడాగ్రామాధికారికూఁతు శంపను, దాని చెలికత్తియలను నుయ్యాలత్రొక్కుచుండగ నొసంగి పాణిగ్రహణ మొనర్చికొననునది మొదటి నేరము. గ్రామస్థులు వానివశములోనునిచిన పశుసముదాయమునందలి పశువుల పాలను వాఁడు ప్రతిదినమునుఁ బిదికికొని త్రాగుచున్నాఁడనునది రెండవనేరము. ఇట్టి పౌరు లప్పని నిందించుటకుఁదగిన కారణములు లేకపోలేదు. వాఁడు పసుల మేపుచున్నకాలమున సహజముగ సుకరయయిన చింతపూవన్నియ యావొకటి బహుక్షీరయయ్యుఁగొంతకాలమునుండి యేటికో యింటికివచ్చి పాలుచేఁపక యెగఁదన్నుచుండెను. అప్పుఁడీగోవుపాలనుబిదికికొనుచున్నవాఁడని గ్రామమునందలి పెద్దమనుష్యు లనుమాన పడఁజొచ్చిరి. వాని దొంగతనము గనిపెట్టవలయునని గూడఁ గొందఱు వేచియుండిరి. ఈ నేరములను గుఱించి యాలోచించుటకే ధీరసింగింట నందఱు సభ చేరిరి.

ధీరసింగింటు చేరిన మనుజులంద ఱాలాగు మాటలాడుచుండ నొక క్రొత్తమనుజుఁడు వారింటివాకిలితలుపు తట్టెను. ధీరసింగాధ్వనివిని తలుపుఁదెఱచి వానిలోనికి రమ్మనెను. ఆ వచ్చిన మనుజుఁడు లోనంబ్రవేశింప వారిట్లు సంభాషించిరి.

జయ - నీవు వెళ్ళిన పని యేమైనది? జాడ యేమైనం దెలిసెనా?

మను - తెలియలేదు. కాని యీపని యప్పనిదే యని నేను దృఢముగ నమ్ముచున్నాను.

జగ - వాఁడుగాక మఱెవరు? వాని వశముననున్న పశువుల నింకొకఁడు తాఁకఁగలఁడా! తప్పక వాఁడే యీ పని చేయుచున్నాఁడు.

ధీర - వాఁడయని మనమెట్లు చెప్పఁగలము? మనము చూచితిమా?

జగ - చూచినయెడల నీవిచారణలన్నియు నేల? అప్పుడ వాని దండించి యుందుము.

ధీర - నీ వప్పని కంటబడలేదు గదా?

మను - లేదు. నే నొకరహస్యస్థలమునఁ గూరుచుండి వానిం గనిపెట్టియుంటిని. అప్పఁ డెచ్చోటికిం బోవలేదు. పశువుల చెంతన యున్నాఁడు.

జయ - ఈ దినమునఁగూడఁ బాదుగుమాత్రి మొదుగుఁబడి కాన్పించుచున్నను నాధేన్వాపీన మెప్పటియట్ల వట్టిది యయియే యుండెను. ఇంకను మనము వానిని బరిశోధింపవలసి యున్నది.

వీరీలాగు సంభాషించుచుండ మఱియొక మనుజుఁ డచ్చటికేతెంచి తొందరపాటున "స్వామీ యప్పఁ డీదినమున నాలమందను మఱియొక చాటుచోటునకుం గొనిపోవుచున్నాఁడు. త్వరితముగ మన మచ్చటికేగి రహస్యముగ వాని

వర్తనముం గనిపెట్టవలయును. అలసించిన నాతం డెందుc బోవునో!" అని యన వారంద అచ్చటినుండి వెడలి యప్పని యన్వేషణమునకయి బయలుదేరిరి. ఈ మనుజుc డును వారి నందఱిని వెంటనిడికొని తూర్పుదెసకయి నడువc బ్రారంభించెను.

———:o:———

# ౭ వ భాగము.

నాగేంద్రపురసమీపమునc బుష్పపల్లవాలంకృత వివిధతరులతావితానయుతంబును, ప్లవంగ కురంగ శశాది సాధుమృగ సంయుతంబును, మహోన్నతంబును నగు మూడు శృంగములుగల పర్వతంబొకటి గలదు. ఏతద్గిర్యుపత్యకమున సకలజనసేవ్యంబగు పుణ్యక్షేత్ర మొందు గలదు. ఆ క్షేత్ర మునc బవిత్రమయిన శివాలయ మొకటి యుండెను. ఈ యాలయమునం దేకలింగస్వామి యను నామముగల మహా శివలింగము ప్రతిష్ఠ చేయcబడి యుండెను. ఆ దేవాలయమున కెదుట నాదేవు వాహనముగు నంది యొకటి గలదు. ఈ యేక లింగస్వామిని నాగేంద్రపురవాసులు పూజించుచుండువారు. వీరలేగాక యాదేవు నారాధించుటకై బహుదూరమునుండి యారాష్ట్రపు జనులు నయిత మప్పుడప్పుడు వచ్చి సేవించుచుం డిరి. మహాతపశ్శాలియైన మార్కండేయమహర్షి తన తపంబున వేడికంటిని మెప్పించి యా పరమేశ్వరుకటాక్షము

తోడ సంపూర్ణాయువునుం బొందిన దీ పర్వతరాజమునందు యని యిప్పటిజను లనుకొనుచుండువారు. ఈ మహాక్షేత్రమఖిలజన ములకు యాత్రాస్థానమాటయగాక సాధుసందోహమునకును యోగిజనబృందమునకును గాణాచియై యుండెను.

ఏకలింగస్వామ్యాలయము నధివసించు మహాపురుషు లలో మహామహిమగరిష్ఠుఁడగు సిద్ధుఁడొకఁడు గలఁడు. ఆతం డేకలింగస్వామి దేవళమును జిరకాలమునుండి నిజనివాసంబుగ నొనర్చికొని ముముక్షుమార్గావలంబియయి జపతపోవ్రతోప వాసంబులఁ గాలంబు గడపుచుండెను. ఈ మహామహుఁడు దండకమండలు కాషాయాంబరధారణ మాత్రమున జనుల మోసపుచ్చి పొట్టఁబోసికొను నిప్పటికొందఱు మతకరియతు లవలెఁ గాక నిశ్చలజ్ఞానసంపన్నుఁడయి మనంబు పరబ్రహ్మం బునం దైక్యమొందింప యత్నించుచు నిరాహారుఁడయి నిండు మనంబున నీశ్వరోపాసనంబుఁ జేయుచుండెను. జను లెప్పు డునుఁదన్ననుసరింపవలెననిగాని వారివలన ధనకనకవస్తువాహ నముల సంపాదింపవలెననిగాని యాతని కెంతమాత్ర మిచ్ఛ లేదు. ఏలయినఁ దా నొరులకంటెఁబడకుండఁ గాలము గడుప వలయుననియ యాతనియభిలాష.

ఏకలింగస్వామి దేవాలయాంతర్భాగములోని యొక విశాలమగు నరుగుమీఁద వ్యాఘ్రాస్తరణంబుపయి పద్మాస నమువైచికొని యీ సదానందసిద్ధయోగీంద్రులవారు కూ ర్చుండి యొకక్రొత్త శిష్యునితో ముచ్చటించుచుండిరి.

యోగి - "వత్సా! నీ వెవరవు? నీ విచటికి రాఁగతంబెద్ది?"

శిష్యు - స్వామీ! నేనీ యూరం బసులకాపరివృత్తిం జీవించుచున్న యొక గొల్లపిల్లవాఁడను. బహుకాలమునుండి నేనీ నాగేంద్రపట్టణమందు యున్నాను. నా మందనుండి నేఁ డొకగోవు తప్పిపోయియున్నందున దానిని వెదకికొనుచు నిందువచ్చి నాపూర్వజన్మ సుకృతమువలన మిమ్ముం గాంచితిని. కృతార్థుండనైతిని.

యోగి - వత్సా! నీ చెప్పిన యీ విచ్చటికి వచ్చినమాట సత్యమ. నేఁడ యననేల? ప్రతిదినమును నా యీ విచ్చటికి వచ్చుచునే యున్నది. ఆగో వనుదినమును నిచటికరుదెంచి యీ కొండచఱియయం దొక యిరవున నీఆమగు పువ్వుటీరమునడుమ నొక వేదికపయి నమరియున్న మహాశివలింగమునకును నాకునుఁ దనపొదుగునుండి పాలను జేఁపి యభిషేక మొనర్చుచుండును. దానిపురాకృత సుకృతమువలనన దానికీ జ్ఞాన మలవడినది సుమీ!

సూక్ష్మబుద్ధియగు సిద్ధుండు పలికిన యీ పలుకుల కలరి యప్పుఁడా గోక్షీరములఁ దా నపహరించుచున్న వాఁడను జనక్రివాద మిఁకఁ దప్పనుగదాయనియు, నీ గోరాజంబుమూలమునఁ దన కీ మహామహానిదర్శనం బబ్బినదనియు, మనంబున ఘనం బగుప్రమదమునొంది నమస్కారపురస్సరంబుగ నా వాచంయమునిం గాంచి "దేవా! నోరులేని యీ పసరము నయితము మీ యట్టి పరమపురుషుల నెఱింగి సేవించి యెన్న రాని పున్నెముల గడించుచున్నది. పశుతుల్య మగుగొల్లజాతి

పిల్లఁడనయిన నన్నుఁగూడఁ గృపఁజేసి తాము రక్షింపవలెను. మీ శిష్యగణములో నన్నొకనిఁగ నెంచి నన్ను ధన్యుంజేయఁ బ్రార్థించుచున్నాఁడను. నీచజాతి గొల్లపిల్లవాఁడనని నన్ను నిర్దయుం జూడకుఁడు" అని యప్పుఁడు సిద్ధునకు సాష్టాంగనమస్కారమొనరించి దూరమున నిలువఁబడెను. అంత నా సిద్ధుఁడతనిం జేరఁదీసికొని వెన్నుఁ జఱచి "నాయనా! నీ వెక్కడి గొల్లపిల్లవాఁడవోయి? నీ వనుకొనినయట్లు నీ వాలగాపరి బాలుఁడవు గావుసుమా? లోకమునందు మిక్కిలి గొప్ప కార్యములఁ జేయ నవతరించిన మహాపురుషుఁడవు. బాల్యమునందు దేవతల శాపకారణమునంజేసి తనశక్తిఁ దా నెఱుంగక మొదల కపియోజకునిభంగిం గానుపించుచుండిన యా యాంజనేయుని చాడ్పున నిగుఱుగప్పిన నిప్పుచందమునుండి నిన్ను నీ వెఱుంగఁజాలకున్నాఁడవు. నీ వొక యుత్తమరాజకుల సంభూతుఁడవు. తనపరాక్రమముఁ దా నెఱుంగలేక తుదకుఁ గపులవలనం దెలుపంబడిన యంజనీసూనుని యట్లు నీవును నీ చరిత్ర మితరులవలన గ్రహింపఁగలవు. నిన్ను శిష్యుంగా గ్రహించిన నా తపంబు సిద్ధిఁబొంది నా కీ సిద్ధనామము సార్థకమయ్యెడును. నేఁటినుండి నిత్యమును నీ యాశ్రమముపొంత వచ్చుచుండుము" అని హెచ్చరించి శత్రుహస్తిమస్తక విదారణప్రశస్తం బగునొకనిస్త్రింశం బప్పని కొసంగి సిద్ధుండంతర్హితుఁ డయ్యెను.

అప్పుఁడు సిద్ధవాక్యముల కద్భుతానందములనొంది తనది యుత్తమరాజవంశమని యోగి వచించినందునకుఁ గారణం

బేమయియుండవచ్చునని యాలోచించుచుఁ బలుతెఱంగు లగు తలంపులతోఁ దిన్నఁగఁ దనయింటివయిపునకు నడచెను.

—o—

# ౯ వ భాగము

'అప్పా! నేఁడు నీ మోమొక విధముగఁ గనుపడుచున్నదేల? ఇప్పు డేయాలోచన నీ మనంబు నావరించియున్నది? మనల కిప్పు డెద్దియైన సహింపఁగూడని బెడద మరలఁ దటస్థించి యుండలేదుగద? ఇదివఱకే లెక్కలేని యిక్కట్టులనుభవించి యున్నాము. నాయనా! చెప్పుము. నీ వేదానినిగుఱించి విచారించుచుంటివి? పుట్టినది మొదలు నీకుఁ గష్టములే యయ్యెం గదా! నావంటి నిర్భాగ్యురాలి కడుపున నేలపుట్టితివి?' అని తల్లి కుంతీబాయి కన్నుల నీరువెట్టుకొనుచు నప్పని నడిగెను.

అప్ప - 'అమ్మా! మన కిప్పుడేమియుఁ గష్టములు రాలేదు. ఇఁకను రానూరావు. నీవు నెమ్మదిగ నుండుము. అనుభవింపవలసిన కష్టములన్నియు నిదివఱకే యనుభవించితిమి. భయపడకుము. నేఁడొక శుభవార్త విని యున్నాను. ఆ వార్తలోని సత్యాసత్యములను గ్రహింపఁజాలక విచారించుచున్నాను.

కుంతీ - అదేమివార్త నాయనా?

అప్ప - నే నాజన్మము బోయబెస్తమొదలగు నీచజాతి బాలురంగలసి వారిలో నొకనిగఁ బ్రవర్తించుచుంటిని. సేవక

వృత్తి నవలంబించి పశువులఁగాచికొనుచుఁ బరులకవం
చలంబడి కాలము పుచ్చుకొనుచుంటిని. నాతోటి
పాటు నిన్నును నీనీచస్థితియందఁ జూచుచున్నాను.
నిజముగ మన మీ నీచజాతిలోని వారమేనా? నాకు
బుద్ధి తెలిసినది మొదలు నిన్నే చూచుచున్నానుగాని
నాతండ్రి యెవరో నాకుఁ దెలియదు. నా జనకుం
డెవరు? ఆతం డిప్పు డెచ్చో నున్నవాఁడు? మనల ని
ట్లొంటిగ విడిచి పోఁ గారణ మేమి? ఈ ప్రశ్నముల
కుత్తరంబు లూహింపఁజాలక యాలోచనంబు సేయు
చున్నాను. ఇంతియకాని మఱేమియు లేదు.

కుంతి - అప్పా! ఇది యేమి వింత! నీకిప్పటికిఁ బదియారు వత్సర
ములు వచ్చినవి. ఇంతకాలమునుండి నీకీయాలోచనలు
కలుగలేదు. ఇన్నిదినములనుండి లేని యీ విచారమిప్పు
డేల నీమనంబు నావరింపవలెను? నాయనా! నన్ని
ప్పుడీవడిగిన యీప్రశ్నవలన నాకిదివఱకు మఱపునకు
వచ్చుచున్న దురంతచింతాభరంబు నామనంబునకు
మరల వచ్చుచున్నదోయి!

అప్ప - అమ్మా! నేఁడు నేను మహాతపస్సంపన్నుఁడగు సిద్ధు
నొకని దర్శింపఁబోయితిని. ఆమహాత్ముఁడు నాయెడ
మిగుల దయాంతరంగుఁడయి నాతోడ ముచ్చటిం
చుచు 'నాయనా! నీవందఱనుకొనినయట్లల్పకులుండవు
గావనియు, నీవొక యుత్తమక్షత్రియవంశ సంభూ
తుఁడవనియును నుడివెను. ఇంతియగాక నీవెన్ని యో

మహాకార్యములఁ జేయనున్నావనియును వాక్రుచ్చి విపక్షనిర్దళనాతిదక్షంబగు నీకౌక్షేయకముం గొనుము; నీకాపత్కాలమం దది గరంబు నుపయోగించునని వచించి వాఁడు దానిం బ్రసాదించి యంతర్ధానమయ్యెను. తపోబలలబ్ధవిజ్ఞానులగు సిద్ధులవాక్యంబు లెప్పుడును మృషలు గానేరవుగదా! వా రాగతానాగతంబులఁ జక్కఁగఁ నెఱింగినవారు. వారియుపదేశంబువలన నాకెన్నఁడును లేనియుత్సాహమొకటి జనించి ప్రతాపాసవము నారక్తనాళంబులం జేరి నన్నుత్తమకార్యంబులకుం బ్రేరేచుచున్నది. మనపూర్వచారిత్ర మించుక నీవలనం దెలియఁగోరి యిచ్చటి కరుదెంచితిని.'

అని యప్పుఁడనెను. తల్లి కనులనీరు దెచ్చికొనుచు "నాయనా! సిద్ధులమాటలేల యబద్ధములగును? నీవు నిశ్చయముగ నుత్తమక్షత్రియవంశజాతుఁడవ. అందునకు సందియములేదు. పూర్వజన్మమున మన మేరి కేమి యుపకారంబు సల్పియుంటిమో యిప్పు డీదుస్థితికి వచ్చితిమి. లేకున్న నీవును నీపూర్వులవలె నఖండరాజ్యలక్ష్మీవిభాసితుండవయి యుండియుందువుగదా!' యని యప్పుని నూరడించెను.

'అమ్మా! గడచినదానికిఁ జింతించిన నేమిప్రయోజనము? వెనుకటి సంగతులను వదలివేయుము. మనవృత్తాంతము సాంతముగ నాకెఱింగింపు' మని యాతురతతో నడుగుచున్న తన ప్రాణప్రదమగు కొమరునిం గాంచి కుంతీబాయి యిట్లనియెను :—

'అప్పా! జీర్ణాంబరధారియయి పశుపాలక బాలకలక్షణముల నొప్పుచున్న యీనాసుతుం డొకప్పు డొక మండలాధీశ్వరునకు నౌరసపుత్త్రుండయి వేలకొలంది దాసదాసీజనంబులచే నుపలాలింపఁబడుచుఁ దల్లిదండ్రులకు నేత్రోత్సవంబు సేయుచుండెడివాఁడుసుమా! అప్పటి నీమహోన్నత స్థితిం జూచిన యీకన్నులన యీచింపిగుడ్డలు నీయేవఁ బుట్టించు నవతారమునుం గాంచవలసివచ్చినది. నాయనా! నాకడుపు తఱిఁగికొనిపోవుచున్నదోయీ? అట్టి రాజోపచారము లందఁదగు నీవిప్పు డీ నీచసేవకవృత్తిం గాలంబు గడపుట కాదైవమునకు మనమేమపచారము చేసియుంటిమో! నీజనకుం డీదూరు భిల్ల రాజ్యమున కీశ్వరుండయి యీశ్వరనామధేయంబునఁ బ్రజాపరిపాలనంబు సేయుచుండెను. ఆమహాభాగుఁ డత్యంత ప్రతాపశాలియయి రిపువర్గమునకుం దేఱిచూడఁగాని తేజంబున రాజ్యపాలనంబుఁ జేయుచుండెను. ఇట్లుదగ్రపరాక్రమక్రమణచేఁ దన యశశ్చంద్రికలు సకల దిక్తమసంబు నడంపఁ గొలఁదికాల మీయీదూరు పత్తనము పాలించినపిదప మన దురదృష్టవశమున మన ప్రభుత్వోన్నత్యము దైవంబునకుం గనుకుట్టయ్యెంగాఁబోలును. మన ప్రజలగు భిల్లులకందఱకేకకాలమున నకారణముగఁ దమరాజుపయి నసూయజనించి వారు నీజనకున కపాయంబు ఘటియింప నదను వెదకుచుండిరి. ఈసంగతిం గ్రహించి నీజనకుఁ డతిజాగరూకుఁడయి మెలంగుచుండెను. గాని యాతనికిం గీడుసేయ తలంపున నప్రమత్తులయి శతవిధముల వేచియున్న భిల్లులకుఁ దమపగను దీర్చికొనుటకు సమయము దొరకకపోలేదు.

ఒకనాఁడు నీ జనకుండు వేఁటతమకమున సమీపారణ్యమందు కతిపయపరివారుండయి సంచరించుటంగాంచి యొక్కపరి వారందఱాయనపయింబడి తమఖడ్గముల కాయనను బలియిడిరి. అప్పుడు రెండేండ్ల పసికందువవైన నిన్నుంగొని చని నేనెందయినం దలదాఁచికొనవలసినదాన నైతిని. శత్రువుల చేతంబడిన నేమికీడుమూఁడునో యను భయంబునఁ గాననిక్రింతలంబడి యెట్టకేల కీపురిం బ్రవేశించితిని. నాశరీరరక్షణకయి యేనిట్లు చేయలేదు. వంశము నిల్పుట కీవయినం బ్రతికినఁ జాలునని యింతపాటుపడితిని. నాయనా! మన సంరక్షణ విషయమయి యీ విష్ణుశర్మ యెంతశ్రమ వహించెనో నేను నీకు నుడువఁజాలను. నీప్రాణదాత యాతండయని చెప్పఁగలను. చూచితివా! మనమొక గొప్ప రాజవంశజులము సుమా! ఉదీర్ణప్రతాపులగు గిహాలోటువంశములోఁ జేరిన వారము. మనసంగతి యొరుల చెవింబడెనేని మనకెక్కుడ నపాయము వాటిల్లునోయను భయంబున మనచరిత్ర మొరులకుం దెలియకుండ గుప్తముచేసితిని. నీకయినను జెప్పిన దానను గాను.

" అమ్మా నీకు నేనడ్డము వచ్చెదను. మనపూర్వులకుం గిహాలోటులను నామ మెట్లుగలిగినదో తెలియునా ?"

నాయనా! బహుకాలముక్రింద హిందూదేశమున వల్లభియను పురంబొకటి యుండెను. శిలాదిత్యుఁడను మహాప్రతాపశాలి యొకఁడాపట్టణమందుఁ బ్రజానురంజకముగ రాజ్యము సేయుచుండెను. శిలాదిత్యుఁ డాదిత్యపుత్రుఁడ

నియు, సూర్యుఁ డతనినిం గంటికి ఱెప్పచందమునం గాచుచుం డెననియు నొక ప్రతీతి గలదు. ఆతండు శత్రుదుర్నిరీక్ష్యుండై పరిపాలించుచుండ నతని యప్రతిహతపరాక్రమమునకు జంకి వైరివర్గ మెల్లఁ బర్వతకందరాంతరాళంబులనుఁ జొరరాని యరణ్యంబులను, మడఁగి యుండిరి. లోఁబడిన మహీశులాతని కనారత మప్పనా ల్గట్టి సేవించుచుండిరి. కాని వీరలమనంబు నంగల యమర్షాగ్నిమాత్రము చల్లారలేదు. వారాతని నేమియుం జేయఁజాలక మనంబునం గృశించుచుండిరి. ఈర్ష్యాగ్ని యెప్పుడునుఁ దాఁబ్రవేశించుచోటునే దహించునుగదా !

వారుకొంతకాల మిప్పగిది యొదిగియుండిరి. బహుకాలము నుండి శిలాదిత్యునియెడ నీర్ష్యవహించియున్న యాతనిమంత్రులలో నొకఁడు పగసాధించికొన నెంచి శత్రువులకడ కేకతంబచని తనప్రభువుగుట్టంతయు వారల కెఱింగించి వల్లభిపురంబుపయి దండువెడలిరా వారిం బ్రేరేపించెను. ఆ దుర్మార్గుని సహాయమును నమ్మి యసంఖ్యాకంబు లగుబలంబులం గూర్చికొని శత్రువులు వల్లభిపురమును ముట్టడించిరి. రాజు తొల్లిఁటివలెనే నిర్భయముగ శత్రువుల నెదిర్చి కొంతవఱకు జయముగాంచెను. కాని దుర్మార్గుఁడగు మంత్రి యొనరించిన మోసమువలన రాజుయొక్క లోఁతుపాఁతు లెఱింగియున్న వారౌటచే శత్రువులు మఱుఁగుమార్గమునఁ గోటం బ్రవేశించి శిలాదిత్యునింబట్టుకొని వధించి కోటను స్వాధీనపరిచికొనిరి.

తమభర్త సంగర రంగమందు నిహతుఁడయ్యెననియుఁ గోట శత్రురాజుల వశమయినదనియు విని వీరరసాధిదేవతలనం

దగుశిలాదిత్యుని పత్నులందఱగ్నిహోత్రమునం దుమికి వీర స్వర్గమునకు భర్తలతోడ సహగమనముం జేసిరి. ఈ సతీమణులలో నొక్కర్తుమాత్ర మా సమయమున నచ్చటలేదు. పుట్టినింటి కేగియుండెను. కొంతకాలమున కా యువతీలలామ తనపుట్టినింటినుండి మరల మగనియింటికిం బోవుచుఁ ద్రోవం దనకునచ్చిన యొకభటునివలనఁ దనభర్తమరణమును వల్లభి నగరము సర్వస్వముతోడ శత్రువులచేతం జిక్కుటయు విని ముందుబోవుటకును వెనుకకు మరలుటకుందోఁచక సమీపముముననున్న యొక కొండగుహయందు డాఁగియుండెను. ఆమె యప్పుడు గర్భవతియయి నవమాసములు నిండియుండెను. ఆమె యాగుహయందు గొన్ని దినముల కొక తనయునిం గనియెను.

రాజసదనంబునఁ బూర్వమునుండి పురోహితులుగను మిత్రులుగ నున్నయొక బ్రాహ్మణునిం బిలిపించి యా శిశువు నాతనిచేత నునిచి తండ్రి యీ యర్భకుని బ్రాహ్మణబాలకుని వలెఁ బెనుచుచు నెటులనయిన యుక్తవయసు వచ్చువఱకు శత్రువులనుండి రక్షించి యొకక్షత్రియకన్యనిచ్చి వివాహము నర్పుఁడు. ఇంతమాత్రము పుణ్యంబుగట్టికొనుఁడు ? అని యొప్పజెప్పి భర్తృమరణమున నవయుచున్న తనశరీర మగ్నిదేవున కర్పించి స్వర్గస్థుఁడయి యున్న తన పెనిమిటిం గలసికొనెను.

" ఆ విప్రుఁడు గన్నుల నీరు వెట్టుకొనుచు నా శిశువుం గొని చని తనకూఁతున కొప్పఁజెప్పెను. ఆకెయు నా నిసువును బెంపుడు తలిదండ్రులెంత ప్రేమమునఁ జూతురో యంత ప్రేముడిం బెనిచి పెద్దవానింజేసెను. శిశువుం గొనివెంచిన వి

పుళిందు మనవిష్ణుశర్మ పూర్వికులలో నొకఁడే. కనుకనే పారంపర్యము వచ్చుచున్నవారల సౌహార్ద్రము మనలనుఁగూడఁగా పాడినది.

ఆ విప్రుఁడు బాలునకుఁ దరుణమునఁ జౌలోపనయనాది కృత్యముల నెఱపి గుహాయందు జననమొందుటంజేసి యాతఁనికి గొహుఁడను నామధేయమిడెను. గొహునిసంతతివారు గిహాలోటులయిరి. గొహుఁడా విప్రగృహామునఁ బదునాఱు వత్సరములవఱకుఁ బెఱిగి కడునల్లరిబాలుఁడయి సంచరించుచుండెను. అందువలన నాతని వారియింట నునిచి పెనుచుట విప్రునకుం గష్టమనితోఁచి తుదకాతనిని స్వేచ్ఛగావదలి వైచెను.

“ గొహుఁడంత విప్రగృహము విడిచి దేశాటనంబు సేయుచు నీదూరను భిల్లులపట్టణము చేరెను. అచ్చట బహుకాలము భిల్లబాలురతో నాడుచుఁ బాడుచు నుండెను. భిల్లులు వానియెడ స్నేహముగల వారయి భిల్లరాజ్యమున కాతనిఁ బ్రభువుగ నియమించికొనిరి. అప్పటినుండి గొహుఁడా యీదూరురాజ్యమును బాలించుచుండెను. ఆయన యనంతర మెనిమిది తరములవఱకు గిహాలోటులే యీదూరురాజ్యము నేలుచు వచ్చిరి. వారిలో నీజనకుఁడు కడపటి ప్రభువు. ఆయనచరిత్ర మిదివఱకె నీకుఁ జెప్పియుంటినిగదా! ఇదియ మన పూర్వోదంతము. లంకణములలో మనువుగుడుపులు జ్ఞప్తికి వచ్చెనన్నట్లు ప్రతాపోద్దీపితులగు మనవారి స్థితులిట్టి యవస్థయందు మనసునకుఁ దెచ్చికొంటిమి.”

" సిద్ధుని కృపావిశేషమునను భగవంతుని నిర్హేతుక జాయమాన కటాక్షమువలనను మన కర్మ పరిపాకమునను మరల మనకుఁ దొల్లిటిస్థితి రానున్నది. నిస్సంశయము. నీ చింతఁ దొలంగి యుండుము. తల్లి యూరడుము." అని తల్లియుం గొమరుఁడును సంభాషించుచుండ నింతలో నరుణోదయ మయ్యెను.

# ౧౦ వ భాగము

" ఔర! అప్పఁడెంత బుద్ధిశాలి! శత్రుమండలిపన్నిన దుర్భరము లయిన నిర్బంధముల నెల్ల గీటునం బుచ్చి యెవరికిం జిక్కక యెందే నరిగినవాఁడు! నాన్నగారూ! అతనిజాడ యేమయినఁ దెలిసినదా?"

" అమ్మాయీ? వానికీబానిసీండ్రొక లెక్కయా? వీరిం బోలునసదలు మఱికొంబదుగురే తెంచిన నతని కేమిభయము? వంశానుగతమనస్థైర్య మతనిముఖాదర్శమం దతిస్ఫుటంబుగఁ బ్రతిఫలించుచున్నదే! సింగంబుకడుపున మేకపిల్ల యుదయించునా!

"మీారనినయ ట్లీతనికి తాతతండ్రుల పరాక్రమ మబ్బినది గాఁబోలు? కాకున్న కుటిలబుద్ధులగు నీపురవాసుల నాతం డెట్లు మట్టుపెట్టఁగలఁడు? ఇచ్చటి జను లాతఁడు సామాన్య పసులకాపరిబిడ్డఁడని యనుకొందురు కాఁబోలును!

"వానిజాతి జన్మంబు లోరులకుం దెలియవు. చిన్నతన మునుండి యాతండు మనయింటం బెరుగుచుండుటం బట్టియుఁ బశుపాలకవృత్తి నవలంబించుటం బట్టియు జనుల కతనిపుట్టువు పూర్వకథ లిట్టివని తెలియవు"

"తెలియకపోయినను వాఁడొనర్చిన యద్భుతచర్యల వలననైననతం డుత్తమవంశజుఁడని తెలియజాలకపోయిరిగదా?"

"వేసమే జనులను మోసబుచ్చునది. హీనకులమందుఁ బుట్టినవాఁడయినను మంచివస్త్రములధరించి కొన్ని యెక్కువయో పూసపోగుల నొడలికిందగిలించికొనెనేని వానిని గొప్పవానిఁగ జను లాదరింతురు. మలినశరీరము చినిగినగుడ్డలుగల యున్నత కులసంభవుఁడును మన్ననఁ నొందఁజాలఁడుగదా;"

"తా నుత్తమకులమున జనించితినని యప్పనికయినం దెలియదు గాఁబోలు ?"

ఇంతదనుక నీ గోడవయతనికిఁ దెలియదు. కాని మొన్న నాతం డేకలింగస్వామిదేవళములోని సాధుపురుషునిం గలిసి కొని యతనితోడ ముచ్చటించినపిదపఁ దనజాతి తన కెఱుకపడి నట్లున్నది. ఆ యోగిపుంగవుం డతని నిజజన్మము నెఱింగించిన వాఁడు. మఱెవరునుం దీని నెఱుంగరు"

"అతనిమాతయయిన నతని కీసంగతి నిదివఱ కెన్నఁడునుఁ జెప్పియుండలేదు కాఁబోలు."

"లేదు ఆమె తమచారిత్ర మిదివఱ కెప్పుడును వెల్లాటకము సేయలేదు. అట్లు చేసియున్న వల్లడికాఁడ్రగు భిల్లుల వలనం దమకు దొసంగులు పొసంగునని యామె యెఱుం దెలియును."

"ఔనౌను. కష్టకాలమందుఁ బ్రతిమ్మలకయి పెనఁగులాడి తమ్ముఁడాము వెలిపుచ్చుకొని యాపదలకుం గురియౌట కే రియ్యకొందురు ? "

" అందువలనఁగదా తల్లియుం గొమరుఁడు నీయూర విర టుపురంబునఁ బాండుసుతు లజ్ఞాతవాసము సలిపినటుల గుప్త చరితులయి సంచరించుచున్నవారు? అదియు నీ వెఱుంగుదువు? "

" నాయనా ! వారి నిరువుర వైన మెప్పుగాపాడునో గదా !

" అమ్మా ! అందున కీవు సందియపడకుము. వారీ యూరు నిదివఱకే విడిచి దూరముగాఁ జనియున్నవారు. ఇఁక వారల కెద్దియు భయము గలుగదు. "

" చిన్నతనమునుండియు మనయింటఁ బెరిగిన వాఁడు గనుక వానియందు నాకిప్పటికిని మమత పోలేదు. కన్న మోహముకన్నఁ బెంచినమోహ మెక్కుడుగదా ! "

" కనుకనే వానికొఱ కిన్నిపాట్లు పడుచున్నాను. ఇప్పటికైన వానిఁ గాపాడుభారము నాకుఁదప్పినది గాదు. ' స్వాశ్రితావనసమో నహి ధర్మ ' అని వినలేదా ! "

ఇట్లు విష్ణుశర్మయుఁ గూఁతురును ముచ్చటించుచుఁ దమయింటిలో నొక్కచోఁ గూరుచుండియుండిరి. విష్ణుశర్మ యప్పుడు తమగృహంబును విడిచి పోవుటం జేసి తనకూఁతున కుం గలిగిన మనోవిచారముం దొలఁగిపోవున ట్లామె నూరా ర్చుచుండెను. అప్పు డొకమనుజుఁడు ప్రవేశించి విష్ణుశర్మకు నమస్కరించెను. " ఓహో జగత్సింగుగారా ! దయచేయుఁడు "

అనివిష్ణుశర్మ యాతని బహూకరింపఁగా జగత్సింగు చిఱునగవు నవ్వుచు నచ్చటవేయఁబడియున్న కురిచీపీఁటపయిం గూరు చుండెను.

విష్ణు - ఏమిట్లు దయచేసితిరి.

జగ - ఏమియు లేదు. తమతోడ నొక విషయము ముచ్చటింపవలసియున్నది. అప్పుడొనర్చిన ఘనకార్యంబు వింటిరిగద ? ఎట్టిదుండగీని మీ యింటఁ బెనిచితిరండి? వాని నీచత్వమెటుండనిందు, పెనిచిన మీయట్టిసత్పురుషులకుఁగూడ నెంతయపకీర్తిఁ దెచ్చిపెట్టినవాఁడు!

విష్ణు - దిక్కులేనివాఁడని నేనింతదగ్గఱఁదీసితిని. కాని వాఁడు మనబోంట్లవద్ద నుండఁ దగినవాఁడుమాత్రము గాఁడు సుమండి. జాతికిఁదగిన బుద్ధిగదా ? మనమేమి చేయఁ గలము ?

జగ - తమకీర్తికి సయితము కొంతకొఱఁతఁ దెచ్చినవాఁడు.

విష్ణు - ఈ కారణముచేతనే వాని మా యింటినుండి తరిమినాము. ఇనుమును గుఱించి యగ్నికి సమ్మెటపెట్లు గదా ?

జగ - ఇప్పుడు వాఁ డెచ్చటనుఁ గనుపించఁడేమి ? ఈ గ్రామమున నున్నాఁడా లేక యూరువిడిచి వెళ్ళినాఁడా ?

విష్ణు - అదేమో నాకుఁ దెలియదు. వాని జాడయే నాకిపుడు దెలియుట లేదు.

జగ - వాని యాచూకిఁ గొంచెము కనుఁగొనవలెనే !

విష్ణు - ఏల ? కావలెనన్న విచారింతము.

జగ - ఇంతవంచనఁజేసిన యీ దుర్మార్గుని దండనజేయవలయు నని మా యందఱి యభిప్రాయము. "ముద్దులు గుడువర ముదిపెండ్లికొడుకాయెనినఁ బెండ్లికి వచ్చినవా రందఱు నా పెండ్లాలే" అనిన సామెత యైనది. నేఁ డీ యూరిపడుచులం గోరినవాఁడు. రే పిల్లాండ్రకే మొస గిడఁగలఁడు.

విష్ణు - అవును. నీవు చెప్పినది నిజము. ఇట్టి పాములతోఁ జెలిమి పాములతో మాలిమి. ఎటులనయిన వానికి శిక్షజరుగ వలసినదే. దుష్టబుద్ధులకుఁ గష్టములు రాకమానునా? అయిన మీ రిపు డేమి చేయఁదలఁచితిరి?

జగ - వాని నేమిచేసిన నేమిపాపము? వాఁ డీయూరనుండఁ దగఁడు. ఏల? భూమియందే యుండఁగూడదు. వాఁ డెచటఁ గనుపడును!

విష్ణు - నేను నా విషయమె యాలోచించుచున్నాను.

జగ - వాఁడు రేపో మాపో చిత్తూరు వెళ్ళఁదలఁచినట్టు విన్నాను. అప్పుడయిననుఁ ద్రోవఁ గనుపడఁడా?

విష్ణు - ఔను; వాఁడు చిత్తూరునకుఁ బోవునని నేనును విన్నాను. నేఁడో రేపో తెలియునులె.

జగ - ఇది నిశ్చయమా?

విష్ణు - మున్ప్రాతిక మువ్వీసము నిశ్చయమే యగును.

జగ - ఈలాగు మీతోడ నేను ముచ్చటించిన సంగతి గోప్యముగా నుంచుఁడు.

అని పలుకుచు విష్ణుశర్మవద్ద సెలవుగైకొని, జగత్సింగు లేచి పోవుచుండెను. విష్ణుశర్మయు, జగత్సింగును గొంతవఱకు వెంబడించిపోయి, తిరిగి గృహముచేరెను. వీరిరువురి సంభాషణము నొక రహస్యస్థలమునందుండి విని, కుమారిత, జగత్సింగు వెళ్ళిన పిదప వెలుపలికివచ్చి తండ్రినిఁ గలిసికొనెను. జగత్సింగు మాటలవలన జనుల కప్పనియందుఁగలయీర్ష్య తండ్రియుఁ గూఁతురును గ్రహించి, విచారించుచుండిరి. అప్పు డొక కొత్తమనుజుఁ డేతెంచి యెదుట నిలువఁబడెను. తండ్రియు నా కొత్తమనుజుఁడును, నెద్దియో రహస్య సంభాషణముఁ జేయఁగోరిన ట్లగుపడఁగాఁ, గుమారిత లోనికిం జనెను.

విష్ణు - అప్పుఁడే యాపదం బొరయక యూరుదాఁటి పోయెను గదా ?

మను - పోవ కేమి ? ఎవరికిం జిక్కక నిర్భయుఁడయి గమ్యస్థానముం జేరి యున్నవాఁడు. నేనును శత్రుసాంకేతికస్థానము దాఁటువఱ కాతని వెంబడించి మరల నేతెంచితిని.

విష్ణు - అపకారబద్ధస్పృహు లగునీ పురవాసుల నెట్లు దప్పించుకొనఁగలిగెను ?

మను - ఆదుర్మార్గులవలనఁ దనకు దొసఁగుపొసఁగునను వార్త యీ యూరఁ బ్రచారించినతోడన యప్పుఁ డీ యూరు విడిచి యొందేఁబోవ నిశ్చయించుకొని, దానికిం దగు నుపాయముల న్వెదకికొనుచుండెను. నే నది గ్రహించి మీతోడ నా సంగతి మనవి చేసియుంటినిగదా ? అ

ప్పుడు తాము చెప్పిన యాలోచనప్రకార మొనరిచి, వానిం దప్పింపc గలిగితిని.

విష్ణు - వానియదృష్ట మిప్పటికి బాగున్నది. అప్పుడు మున్పు నకుc దప్పినవాcడు. వాcడు నా కేమయిన వర్తమాన మంపెనా ?

మోను - తమకు నమస్కారశతంబు నొనరించి, యీ జాబునుc దమ కంపెను - అని యొక యుత్తరమును విష్ణుశర్మ కందీయ, నాతండు దాని నిటులc జదివికొనెను.

బ్రహ్మశ్రీ పితృసదృశు లగువిష్ణుశర్మగారి సన్నిధికి ప్రియశిష్యుcడప్పుడు నమస్కరించి వ్రాయున దేమన :—

దైవకృపవలననుc దమ యాశీర్వచన బలమునను నాకుc దటస్థింపనున్న విపత్తులన్నియు సూర్యకిరణ ప్రసార మున మంచువలెc దొలcగి చెల్లాచెదరయి పోయెను. ఇప్ప టికి నేను సురక్షితస్థానమున నెలవుకొనc గలిగితిని. ఎవ్వరయినc దోవ నడ్డగింతురని యెంచితినిగాని, యట్టిపను లెవ్వియును జరుగలేదు. ఇద్దియు భగవంతుని కృపావిశేషము ! ఒకవేళ నేరయిన నన్నడ్డగించి యున్నయెడ, శౌర్యానలంబున వారల నందఱ దగ్ధులcజేయుc బ్రయత్నించి యుందును. అప్పుడేమి జరిగియుండునో ! కాని యట్టి సాహసకృత్యమున కవసరమే లేకపోయెను. గండము గడచి చనియెను. ఇందునకు మీ బుద్ధిబలమే నిదానము. కాకున్న నా సాహసమెట్లు పరిణమించి యుండునో ! మీ యుపదేశమున నన్నియుం జక్కపడెను. చెక్కు చెదరక యొక్క దిక్కున సురక్షితుcడ నయి

యున్నాఁడను. ఈవార్త మాతృసమానయగు మీతనయ కుంగూడఁ దెలియఁజేయుఁడు. శైశవమునందు నాశత్రువుల నుండి నన్నుఁ గాపాడితిరి. బాల్యమునందింత యన్నవస్త్రము లకుం గొఱంతపడనీయక పోషించితిరి. తుదకీ యాపత్సమయ మున నయితము మీర తోడుపడితిరి. ఇఁక మీఋణమే నెట్లుతీర్చికొనఁగలనో కదా! మీయుపకారంబున కేమియుఁ బ్రత్యుపకారము సేయఁజాలను. పదివేల వందనముల నొన రించుచున్నాఁడ. వానిం గైకొని నన్ను మన్నించి యాశీర్వ దింతురని నమ్మి,

ఇంతట విరమించు

భవచ్ఛిష్యుఁడు, అప్పఁడు.

ఆ యుత్తరమునుఁ జదివికొని విష్ణుశర్మ దానింగూఁతు చేతి కిచ్చెను. ఇరువురును సంతసించి యతనికి దీవన లొసంగిరి.

-:o:

## ౧౦వ భాగము.

ఉత్తర హిందూస్థానమున రాజపుత్రస్థానమను నొక దేశము కలదు. అది వైశాల్యమునఁ గాకపోయినను జనసంఖ్య యందు మిక్కిలి చిన్నది. దీనికిఁగారణ మందలి యసంఖ్యాత ములయి యనుపయోగములగు నిసుకమెడారులె. ఈ దేశ మున గొప్పనదులును నంతగలేవు. ఈ రాజపుత్రస్థానమున పెక్కు చిన్న చిన్న సంస్థానములు గలవు. వీనిలో చంబలు నది

కుపనదియయిన విలోకానది సమీపమునఁగడుఁ బ్రసిద్ధిగాంచిన మీవారను గొప్ప రాజ్యము గలదు. మీవారు రాజ్యమున కిప్పటి రాజధాని చిత్తూరు. ఇది మేరుశృంగంబులఁ జీరికింగొనని గొప్పయుంతరువులుగల యుప్పరిగలతోడను, నందనవనంబునయిన నిందలపాలుసేయఁజాలి నగనులకు విందుసేయునుపవనంబులతోడను, మిగుల రమణీయంబయి, హిందూదేశంబునం బ్రసిద్ధిగాంచిన పత్తనంబులలో నొక్కటియయి యుండెను. అండలిజను లతిప్రతాపశాలురనియు, సుగుణఖనులనియుం బేరొందినవారు. దుష్టసంహారణ శిష్టప్రతిపాలనార్థ మవనినవతరించిన రవివంశాబ్ధిచంద్రులగు రామచంద్రు రెండవ కొమారుఁడు కుశుఁడు దమకు మూలపురుషుఁడని వీరు చెప్పుకొందురు.

ఈ మీవారు రాజ్యమునఁ జిత్తూరున కనతి దూరంబున నాగేంద్రి మను నొక చిన్న సంస్థానము గలదు. దీనికి రాజధాని నాగేంద్రిపట్టణము. ఇది చిత్తూరున కయిదు క్రోసుల దూరము. విలోక యీ నాగేంద్రమున కించుమించుఁ జుట్టును ఘననాగమువలెఁ బరివర్తించి యాపట్టణమున కా నామమును సార్థకపరిచెను. ఎండకాలమున నాయేటి యిసుకతిన్నియలపయి సాయంసమయమున విలాసార్థము కొందఱు జను లుపవసించియుందురు. నీరు తగ్గినపు డాయేటి యిసుకబయళ్ళం గొందఱు తోఁటలు పెట్టుకొనుచుందరు. పెట్టినతోఁటలలోఁ గొందఱు పనిచేయుచుందురు. కొందఱే బరికాపులు దినుట కేమియు లేక యాలుబిడ్డలు మలమల మాడుచున్నను నూర్లకొలఁది ద్రవ్యము నాగ్రామ వార్థిషి

కులయొద్ద నూటికి రూపాయిచొప్పున వడ్డికిఁ దెచ్చి ముందె న్నఁడో తమ తప్పి తాపత్రయము దీరునను దుర్భ్రాంతిం జేసి, యీ తోఁటలకుం బెట్టుదురు. ఈ యప్పుదెచ్చిన ద్రవ్యమునఁ గొంత, తోఁట ప్రారంభింపకమునుపు కొంచెము కొంచెము గాఁ బడఖానా బొక్కసమునకుం జేరుచుండును. మిగిలిన సొమ్మునుఁ దోఁటలకు వ్యయముచేసి పగలంతయు నందు శరీర కష్టముచేసి రాత్రులయందు నయితము పైరు సృగాలముల వాతం బడకుండఁ దమపొలములం గాపుకొనుచుందురు. ఒక్కొకపరి వేసినపయి రనుభవములోనికి రాకపూర్వమే ప్రవాహమువచ్చి సొంతగాండ్రదురదృష్టమును మాత్రము ఫలియింపం జేయుచుండుటయుంగల్లదు. కాని నదీమతల్లి దయచేసి చల్లగఁ జూచినయెడఁ దోఁటలు గొంతకాలము ఫలించి యజమానులకుం గన్నులపండువు సేయవచ్చును. అప్పుడును వారు వ్యయముచేసిన సొమ్ము మఱలినఁ గృతార్థులే. మనకథాసందర్భకాలమున నది గాల్నడయయి యున్నందున జనులు నిరాఘాటముగ నదిని దాఁటుచుండిరి.

## ౧౧వ భాగము.

——(o)——

ఈ నాగేంద్రపురోపవనాంతరతరుసంతతి తమకొమ్మమొనలం దెల్లఁ గ్రొంజివురు నిసువులం దాల్చి కనుల కెంత సొంపు నింపుచున్నది! తియ్యమావులు మవ్వమెక్కి చక్కఁ

గాఁ జిగిర్చి తమకమ్మతావుల కెలంకులఁ గ్రుమ్మరించుచున్నవి. తియ్యని పువ్వుబువ్వములారగించి తేఁటిదంపతులు కొండొక వింతపాటలు పాడుచున్నయవి. ఇతర సమయములందెన్నఁడు నుం గానుపింపని కోయిలలపిం డీయెడ నెక్కుడఁ జూచినఁ దా మరమై మాకందంబుల లేఁజివుళ్ళుమెక్కుచు, నెట్లు మధురముగాఁ గూయుచున్నవి! ఎచ్చటఁ జూచినను నిండారఁబూచిన పొదరింట్లు మెండుగఁ గాన్పించుచున్నవి. ఆహా! ఇవియన్నియు వసంతసమయ లక్షణంబులుగదా! ఈమధుమాసము పుడమియందెల్లయెడ నెట్టిమార్పులు గలుగఁజేయుచున్నది? ఈ ఋతువు ప్రతివస్తువునకుఁ గ్రొత్తవింతగుణంబుల హత్తించుచున్నదిగదా!

సంతసము గూర్చు నీ వసంతకాలమున నొక దినాంతమున నించుమించు రెండుగడియల ప్రొద్దుకడ నొక తెరువరి తత్సమీపోపవనంబున మెల్లమెల్లఁ బ్రవహించు విలోలాపగాతటంబున, బహుశాఖాసమన్వితంబగు నొక మహీరుహమూలంబునం గూరుచుండి యుండెను. ఆపురుషుని మోమునం దాతని పయసంపుటలయికల పొలకువలు తెలియుచున్నవి. ఎత్తరపు నొస లాతని విద్యాబాహుళ్యంబును, విశాలోప కంఠం బాతని బుద్ధివిశేషంబునుం దెలుపుచున్నవి. కడువిశాలమయి, యతికఠినంబయి పెనుతిరుగలికంటికవ ననుకరించు నాతని వక్షస్థలంబును నెడతెగని శరీరసాధనమువలన నుబికి పెడఁదిరిగియున్న ప్రవేష్టంబులుగలిగిన దీర్ఘబాహువులును నాతని యువకవిక్రమంబుఁ దేటతెల్లముగఁ దెలుపుచున్నయవి.

అతని శరీరసౌష్ఠవంబునుఁ గ్రొత్తక్రొత్తగ వెడలు నూనూగు మీసంబులు నాతండు పదునెనిమిది వత్సరంబుల పిన్నప్రాయమువాఁడని చెప్పక చెప్పుచున్నది.

అప్పు డాతఁడు నల్లని చారలుగల తెల్ల చల్లాడమొకటి కాళ్ళం దొడిగికొనియుండెను. కొఱమాపురంగు మందసరి చొక్కా యొకటి వేసికొనియుండెను. నల్లకుచ్చొకటి పయినుండి వ్రేలాడు కిరీటాకారమగు నెఱ్ఱదాళుటోపీ శిరంబునలంకరించి యుండెను. నడుమున కొకజల్తారుకాశకొక దృఢముగఁ జుట్టబడియున్నది. పాదములకుం గటలఱములేని ముద్దుగుల్కు నుద్దాలు ధరించియుండెను. కేల ఖడ్గగర్భదండంబొకటి వహించెను. పచ్చనిశరీరము పదారువన్నె జాళువాపసిఁడి. నిగన్నిగ మెఱయునతనికపోలయుగళము మెఱుఁగుటద్దముఃలజంట. ముఖము కళంకరహితమగు చంద్రబింబము. అతని యాకర్ణాంతమగు నేత్రయుగము వికసితకమలద్వయము! వేయేల కనఁగొనిన వార లాతండు మేనుఁగైకొనిన మీనాంకుఁడో, విహారార్థ మవని కరుదెంచిన శశాంకుఁడో, లీలామానుషత్వము నొంది భూలోకమునం దిమ్మరుభక్తపాలనకళాధౌరేయుఁ డగు వృషాంకుఁడో యని సందియపడకమానరు. ఈతని పే రరిభీమ నుఁడు. అతఁడు తనలోఁ దా నిట్లు వితర్కించుకొనుచుండెను.

" ఇన్ని దినంబులనుండి నే నెంతప్రయత్నించినను, సఫలీకృతమనోరథుండను గానైతిని. ఎన్ని పాట్లుపడియు, నీ ఘోరకృత్యములకుం గారణ మారయఁజాలనైతిని. ఈ విషయమై యీ మీవారు రాజ్యంబున నా చూడనిగ్రామంబులు, పరి

కింపని ఖట్వారంబులు, మెట్టనిక్షేటములు, చొరనియరణ్యాంత గర్భాగములు లేవుగదా ! ఎంతయోజించినను, నేతద్విషయ కాల్పచిహ్నములయినం గనుపట్టవు. ఇదేమయి యుండవచ్చును ? ఇంతటికూ్రరకృత్యము లింతకాలమునుండి నడచుచుండినను నొక్కరును వీనిగుట్టుమట్టారయఁజాలరైరి. ఇట్టి పను లింతరహస్యముగ సల్పువార లెట్టిశక్తిమంతులుగ నుండవలయును ? వీనిగుట్టుఁదెలిసికొనుట కష్టసాధ్యమ ! అయినం దీనినెట్టయినం గనుంగొనవలయుననియే నా నిశ్చయము. పూనినకార్యము గొనసాగించుకొనుటయగద ప్రజ్ఞానిధులధర్మము. ప్రారబ్ధకార్యమును సమర్థించుకొననేరని వానిజన్మమేల?"

అని దృఢనిశ్చయుండయి, యాతండిటుల నాలోచించుచుండ నిద్దఱు బాటసారులా నాగేంద్రమను పట్టణమార్గమున నడచుచుండిరి. అం దొకఁడు షుమారు నలువదేండ్ల ప్రాయమువాఁడు. రెండవవాఁ డిరువదియై దిరువదియాఱు వత్సరంబుల యీడుగలవాఁడు. వా రిద్ద ఱీ విధముగ మాటలాడుచుఁ బయనము సేయుచుండిరి.

పెద్ద - నాయనా ! మీ దే దేశము ?

చిన్న - అయ్యా ? నాది కర్ణాటకదేశము, కృష్ణానదీతీరము.

పెద్ద - నీకుఁ దల్లిదండ్రు లున్నారా ?

చిన్న - తండ్రి చిన్నతనములోనే గతించెను. తల్లి మాత్రమున్నది.

పెద్ద - నీకు వివాహ మయినదా ? సంతాన మేమాత్రము ?

చిన్న - నా కింకను వివాహము కాలేదు. అందునిమిత్తమే యిట్లు సంచారము వెడలితిని.

పెద్ద - ఏమయినఁ గొంచెము లాభించెనా?

చిన్న - ప్రయత్నము కొంచెము ఫలించినట్లె.

పెద్ద - బహుశః, మీకిచటఁగూడఁ గొంచెము ఫలము గలుగ వచ్చును. కొంచెమేమి! బాగుగనే లాభించవచ్చును.

చిన్న - మహారాజులు. మీవంటిపుణ్యాత్ములు సాయపడినచో లాభించ కేలపోవును లెండి?

పెద్ద - ఇచ్చోట పనిదైనపిదప దేశమునకు మరలుదురా? లేక యింకనుఁ బైకి వెళ్ళుదురా?

చిన్న - ఇచ్చటఁ బనిఁజూచుకొని కాశీక్షేత్రముంజేరి విశ్వేశ్వరుని దర్శించి రావలయునని యున్నది.

పెద్ద - అయిన మఱియు మంచిదయ్యె. నేనునుఁ గాశీక్షేత్ర దర్శనమునకుఁ బోవలయునని ప్రయాణము వెట్టికొని యున్నాను. రేపో మాపో బయలుదేరెదను.

చిన్న - మంచిసహవాసము లభించినది పొండి!

పెద్ద - మీరుబ్రాహ్మణులని మీముఖవర్చస్సుచెప్పుచున్నది?

చిన్న - అవును. తెలహాణ్యులము.

పెద్ద - సరి! ఇంక కావలయునదేమి? మీనామధేయము?

చిన్న - నాపేరు కామయ్య యని పెద్దలందురు. తమ యభిధానము?

పెద్ద - నన్ను జాలావధానులని జనులు పిలుతురు.

ఇటుల వారు సంభాషించుచు విలోకానదీ సమీప మున నడచుచుండిరి. వీరిసంభాషణమునం దేటికో యొక విధ మగు నభిరుచిని సూచించుమోముతో, నాకొత్తమనుజుఁడు వారలకుం దెలియకుండ వారిని వెంబడించి పోవుచుండెను. ఈలాగున ముందు వారిరువురును వెనుక నీమహాపురుషుఁడును నాగేంద్రప త్తనమున కు త్తరమున నున్న విలోకానది కావలిగట్టు రేవునం దిగిరి. అది వేసవియగుటచే నదిలో నీరుసగ్గి యాయూరి సమీపతీరమందుమాత్ర మొకింత నీటిజాలు కానంబడు చున్నది.

-:O:-

# ౧౨ వ భాగము.

మీవారు రాజ్యమున బహుకాలమునుండి యీకాల మువఱకు నెన్నియో భయంకరములగు హత్యలు జరుగుచుం డెను. ఈకూరహత్యలను గుఱించి తెలిసికొనవలయునని జను లప్పుడప్పుడు ప్రయత్నించుచుండిరి. గాని కారణముమాత్ర మారయఁజాలరైరి. బహిరంగముగ నెంతలేసి ఘోరకృత్య ములు జరుగుచున్నను జనులంతగ భయపడుటలేదు. కాని గూఢముగా నడచువిషయ మెంతయల్పమైనను నది వారల హృదయములయందలి భయమును శతగుణితముగఁ జేయుట సహజముగద ? బహుకాలమునుండి ప్రవర్తించు నీదుర్మరణ వార్తలు మనసునం బ్రవేశించినపుడెల్ల జను లపరిమిత పరి తాపమునొందుచుండిరి. ఈ నాగేంద్రమునందేమి తక్కుంగల

మీవారు రాజ్యములోని గ్రామములయందేమి ప్రతియిం టను నీకూరహత్యల వార్తయకాని మఱియొకటి జనుల మనమునం బ్రవేశించుటలేదు. తెల్లవారిన నెవ్వరికేమియుపద్రవము సంభవించునో, యెవ్వరింట నెవ్వరికై వనటఁ బొందవల సియుండునో యని దిగులొందుచుండిరి. ప్రాద్దుప్రొద్దున లేచి విలాసార్థమిలువెడలి పొద్దుగ్రుంకినను తిరిగి యిలుసేరని పతు లను గుఱించి విలపించు సతులును, కడుపునిండఁ జలిది గు డిచి పాఠశాలకుంజని మఱలి గృహంబునకు రాని పిల్లల కై తల్లడిల్లు తల్లులును వాణిజ్యమునకై దూరదేశములకుం జని యిదె వత్తు రదెవత్తు రను పేరాస నెదురుచూచియు, వారిజాడయే తెలియక గోడుఁజెందు తోడి వర్తకులును నెచ టఁజూచినఁ గనుపట్టుచుండిరి. ఇంతయేల! ఆ మీవారు రాజ్య ము మూర్తీభవించిన పలుతెఱఁగులగు సిలుగుల గుమిరో యనఁ జూపట్టుచుండెను.

ఒకనాఁడు సాయంసమయమున విలోకానదిరేవుదిగినాగేం ద్రమునకు నడుచుచు, జాలావధానులును గామయ్యయు, నేరు దాఁటి కొంచెము పూర్వోత్తరముగ నొకసందునఁ గొంతదూ రమేగి యచ్చటినుండి పశ్చిమోత్తరముగఁ దిరిగి, మఱియొక సందులోఁ గొద్దిదూరముపోయిన పిమ్మట,దక్షిణంపువాకిలిగల యొకగృహమునం బ్రవేశించిరి. వారికిం గనుపడకుండ నాయరి భీమణుఁడును వారివెంటంజనుచు, వారు సొచ్చిన సదనమును గుఱుతిడుకొని, తటస్థునివలెఁ దానొక చాయనడచుచుఁ "జం పఁబడు నరకళేబరములన్నియు నొక్కవిధముగఁ గనుపట్టుచు

న్నవి. అన్నియు శిరోవిహీనములె? ప్రతియుత్తమాం
గము గుర్తించుటకు వలనుపడకుండ వికారముగఁ జేయఁబడి
నది. తలలును మొండెములును నేకవారంబుగఁ గాకపోయి
నను, నీనదీప్రవాహమందె కొట్టుకొనివచ్చుచున్నయవి. ఒక
యాయుధముచేతనె కంఠనాళములన్నియుఁ దుంపఁబడుచు
న్నట్టు కనుపట్టుచున్నవి. ఈయంశములంబట్టి విచారించిన నీ
హత్యలన్నియు నేకస్థలమందే జరుగుచున్నవనియు, నొకనివల
నన జరుపఁబడుచున్నవనియుఁ బ్రదేశంబును నిచ్చటికి సమీప
మున నుండవచ్చుననియుం దోఁచుచున్నది. ఇప్పుడు నే గాం
చిన యీగృహమునకును నీజరుగువిషయమునకును నెద్దియైన
సంబంధముండవచ్చునేమో! ఆయింటం బ్రవేశించిన వారి సం
భాషణము దీనికిఁ గొంచె మనువిద్ధముగఁ గనుపట్టుచున్నది.
నిజము నిలకడమీఁదఁ దెలియఁగలదు. చూచెదంగాక" అని
యనుకొనుచుం బోయెను.

—0*0—

## ౧౩ వ భాగము.

ఒకనాఁడుదయము బహుదూరప్రయాణమున నలసి, ధూళిధూసరితమగు పదములతోడను, చంకకు దిగువ వ్రేలాడుచున్న యొకచిన్నమూటతోడను, నడుగడుగునకుఁ గిఱ్ఱుకిఱ్ఱుమను చప్పుడులిడు చెప్పులతోడను, నొకమనుజుఁడు, పదునెనిమిది వత్సరముల వడుచువానితో, నాగేంద్రమువయిపునకు నడచుచుండెను. వారిలోఁ జిన్నవాఁడేటికో యుత్సాహ

సూచకమగు మోముదమ్మియందమునఁ జూపఱులయుల్లములఁ బల్లవింపఁజేయుచుండెను. కూడనడచువానికిఁ దన సంతసమం తగఁ గనుపడకుండునట్లు ప్రయత్నించుచుండెను. ఈచిఱుత వాఁ డరిభీమణుఁడు, పెద్దవాఁడు జాలావధానులె. వారిరువు రీలాగున మాటలాడఁగడగిరి.

జాలా—నాయనా మీ దే గ్రామము ?

అరి— మాది కోలాహలపురము.

జాలా—ఎచ్చటి కేగుచున్నావు ?

అరి— నే నొక పనిమీఁద నిలువెడలితిని. దేశము చూడ వలెననియుం గుతూహలము గలదు.

జాలా—ఈ నాగేంద్రమున నీ కేరయిన బంధుగు లున్నారా ?

అరి— నా కిచట బంధువు లెవరును లేరు. మిత్రుఁ డొకఁడు గలఁడు.

జాలా—వాని నామధేయ మేమి ?

అరి— ఇదివఱ కెన్నఁడు నే నాతని గాని నన్నాతఁడుగాని యీస్థితిలోఁ జూచి యెఱుఁగము. ఉత్తర ప్రత్యుత్తర ములు జరుగుటవలన మాయిరువుర మనంబున స్నే హాబీజము విత్తఁబడినది. ప్రత్యక్షము చూచికొన్న యెడల నాబీజ మంకురమయి చిగురించి తుద కది మహావృక్షముగఁ బరిణమింపవచ్చునుగద !

జాలా—మీస్నేహితుఁడు మీ కెప్పటికినిఁ గలండు. మిముబో టివారు మా కెపుడు లభింపఁగలరు ? ఇప్పటికే ప్రొద్దె క్కినది. నేఁడింద నిలచి, రేపుదయమున నచ్చటికిం

బోవచ్చును. దూరదేశమునందుండియు, మొగమెఱుఁగనినేస్తము సేయఁగలిగితిరి. మనమింత దనుక కలసి పయనం బొనర్చితిమి. ప్రత్యక్షముఁ జూచికొంటిమి. ఇష్టగోష్ఠిం బ్రవర్తించితిమి. మన చెలిమియేల వృద్ధిగాఁగూడదు. ఏడడుగులు కూడనడచిననే, చెలిమి యలవడు నందురు. ఇంతకాలము గలసియున్న మన కదేల యొదవఁగూడదు ?

అరి - ఆమాటయు నిజమే. మిమ్ము వదలి వెళ్ళుటయుం గష్టమని తోఁచుచున్నది. కాని నే వచ్చినపని వేఱు. అందున కే యాలోచన.

జాలా - మీపను లెక్కడికిఁ బోవును లెండి. రేపు చూచికొన వచ్చును. నేఁడు నాయింట నింతయాతిథ్యముం బుచ్చికొని మఱిపొండు. నావేఁడుకో లంగీకరింపుఁడు.

జాలావధాను లిట్లీ కుఱ్ఱవానిం బ్రార్థింప నరిభీమఁడుఁడు నాఁ డాతని యింట నిలుచుట కియ్యకొనెను. వా రిరువు రేఱు దాఁటి నాగేంద్రముచేరి సందుగొందులంబడి తుదకొక యింటం బ్రవేశించిరి. తొల్లి కామయ్యయు జాలావధానులునుం బ్రవేశించిన దీ గృహమే. అదియు గొప్పయుద్యోగస్థుఁడయిన యొకరసపుత్రుని మందిరము. ఈ భవనము నేల మట్టమునకు రెండుగజముల యెత్తు పునాదిపయిఁ గట్టఁబడి యుండెను. దానికి ముం దొక పంచగలదు. ఈ పంచ కిరుగెలల నొక్కొక వేదియు నీవేదుల నడుమ సింహద్వారము వఱకునుఁగల పల్లమునఁ జక్కని సోపానములునుఁ గలవు.

ఒక్కొక్కయఱుఁగునకును బ్రక్కగదులు గలవు. ఈగదులకు దక్షిణదిశకుం దెఱువఁబడు గవాక్షమొకటి గలదు. ఈయింటి యానాహ ముత్తర దక్షిణములు రమారమి మూఁడు ఫర్లాంగులును బూర్వ పడమర పరిణాహము రెండు ఫర్లాంగులును గలదు. ఈయింటి కుత్తరపువైపున విలోకానది పూర్వోత్తరదిగ్భాగమునుండి పశ్చిమదక్షిణముగఁ బ్రవహించుచుండును. ఈనదీమతల్లికిని బైఁజెప్పఁబడిన సదనమునకును నడుమ కొంచె మించు మించు నాలుగుచదరపు ఫర్లాంగులబయలుగలదు. ఇది యంతయు నిర్జనప్రదేశము. నది పయిపుననాయింటికోరడికి నింటికి మధ్యప్రదేశమున పలువిధములగు ఫలవృక్షముల తోడను, కుసుమగుచ్ఛానుషంగిమండితలతాగృహములతోడను నిబిడీకృతమయి యుండెను.

ఈ యింటి సింహద్వారము దాఁటినవెంటనే విశాలమగు బయలుప్రదేశము గలదు. ఆ బయలులోనికి వారిరువురుఁ బ్రవేశించిన తడవుగ, నొక వృద్ధ స్త్రీ, కవాటము మూసి ప్రక్కనున్న యఱలోనికిం జనెను. మఱియొక బ్రాహ్మణవటువు లోననుండి రెండు పాత్రముల నుదకముం గొనిరా జాలావధాను లందొక పాత్రి మరిభీషణున కొసఁగ నాతండు పాదప్రక్షాళనముఁ జేసికొనెను. పిమ్మటఁ దానునుఁ గాళ్ళు కడిగికొని యాక్రొత్తమిత్రునితో బయలునుండి యెదురుగనున్న మఱియొకద్వారమునకు నడచుచుండెను.

అరిభీషణుఁడు జాలావధానులతో నిట్లు విస్రంభసంభాషణము సేయుచుం బోవుచుండినను దాను చూచెడు ప్రతి

స్థలమును బరిశీలింపక పోలేదు. కనుపడు ప్రతివస్తువును బరికింపక వదలలేదు. కూడనడుచు నవధానుల ప్రతిచర్యయుం గనిపెట్టక మానలేదు. ఈయాలోచనలలోఁ బరిక్రమించు మనం బులో నొకపరి తనమొగ మాతఁ డెదుటనున్న సౌధోపరి భాగమువంకకుఁ ద్రిప్పెను. ఇటులాతఁడు సూచినపుడ యాతని హృదయాంతరాళ మద్భుతానందపర్యాకుల మయ్యెను. అపూర్వమయిన సుందరపదార్థంబు కన్నులకుఁ గాన్పించు నపుడును మనోహరంబయి శ్రవణానందకరం బగుసంగీతాది ధ్వనులు చెవిసోకినపుడు సంతసింపనివాఁ డెవఁడు.

అరిభీమఁ డప్పుడు గాంచినది పదునెనిమిదేండ్ల ప్రాయముగల యొకవనితారత్నము. రాకానిశాకరబింబమునకు వంకలు దిద్దఁజాలు మోముఁదమ్మియుఁ జూపఱుల నేత్రకుముదంబులకు ముదంబొదవించు మందహాసచంద్రికలును, సమములగు తెలిముత్తియపుఁజాలు ననుకరించుచక్కని పలువరుసయు నించువిలుకాఁడు యువయువతీ జనంబులపయిఁ బరపి పరపి మొక్కవోయి బెండువడిన తనపువ్వుటమ్ముల నావలనైచి కార్యసాధనయోగ్యంబులని చేకొనెనోయనునట్లు తోఁపించుచూపుటంపఱయును, చంద్రికాపాండురచ్ఛాయచే మిసిమిదేలుమేఁదీగెయుఁ గలిగి చతురాననుసృష్టిచతురత రూపముంగైకొని యిట్లవతరించినదోయన నొప్పెడు నవ మోహనాంగి యొక్క రుకయా మెకటిమేడపయిం బచేరము సేయుచుఁ గన్నులపండువుగ నరిభీమఁడుని నేత్రకథంబునం బడియెను.

అప్పు డామె యొక విలువగల సరిగంచు డక్కా మల్లు చీరెయు, నీలంపువన్నె మేల్పట్టు అవికయు ధరించి యుండెను. చెవుల నొక రవల కమ్మల జతయు, కరకంజముల నీవ లావల నీలంపుఁ దళుకుగాజుల మధ్య మెఱయు బంగరు మురుగు లునుఁ, దక్క నాకె మఱియేనగలునుం బెట్టుకొనియుండ లేదు. స్వాభావికముగ శరీరసౌష్ఠవమును సౌందర్యంబునుం గల దేహంబున కిం కేయలంకారములు గావలయు ? ఇట్టి మైందీవి యలకు నగలు పెట్టుటకంటెఁ బెట్టకుండుటయ మిక్కిలి యలం కారముగదా ? మెఱుపుఁ దీవియలకు వన్నియ నెచ్చిరిలఁ జేయు పదార్థ మెచ్చటనయినం గలదా ? సహజముగ కాంతి మంతమయిన శచీకాంతు కోదండమున కెక్కడు శృంగార మే వస్తువు కూర్పఁగలదు ?

అరిభీమణుఁ డక్కన్నియం గాంచినతోడన, నతనికన్నుల కనిమిషత్వము వాటిల్లెను. అయోమయమయిన యతనికన్నుల కా వనిత సౌందర్య మొక యయస్కాంతమయి యెంతమర ల్పెద మన్నను నవి యతనికి సాధ్యములు కావయ్యె. ఆవనితా లలామ వృత్తాంతము వినుట కాతని కర్ణము లుత్సహించు చుండెను. అప్పుడు గా దిప్పు డా యువతీలలామ సమీప మున నిలువవలెనని యతని మనం బువ్విళ్ళూరు చుండెను. కాని యది యసమయ మగుటచే నేమిచేయుటకు వీలులేమి నరిభీమణుఁ డా జాలావధానుల బడి నెదుటి ద్వారమున నొక విశాలమగు చావడిలోనికిం జనెను. కాని యాతని హృద యముమాత్ర మాయువతీరత్నము చెంతన నిలిచిపోయెను.

ఆలలనయుఁ దన మేలిముసుంగు గొంత యావలకుం ద్రోచి తానున్న మేడమీఁది గవాక్షమునుండి యరిభీమఁనునిం గాంచుచుండెను. చూచినవెంటనే లజ్జామోదము లాసుదతీ మణి హృదయ గహ్వరంబున నేకకాలమంద జనించి వాని కం దవకాశము చాలమి సంతోషబాష్పరూపమునఁ గనుగొలు కుల వెలికిఁ జిప్పిల్లఁజొచ్చెను. అప్పటివారి రిపుపురయునికిఁ బ్రత్య క్షముగఁ జూచినవారలకేగాని యితరులకెట్లు తెలియఁగలదు? ఏల! వారి పరస్పరాలోకన మొందారుల డెందములనెడు మొకములం జిక్కించుకొనుటకై చక్కరవింటివానిచేఁ జక్కఁ గఁ బన్నఁబడిన చిక్కనివలయోయనున ట్లుండెను. ఇట్టి యను రాగపేశలమగు మనంబుతో నెద్దియో యోజించుచు నా యు వతి యొక గదిం బ్రవేశించెను.

ఈ రెండవద్వారము దాఁటినతోడన యొక చావడి గలదు. ఆచావడికిరుపక్కియలం బెద్దగదులు రెండుగలవు. అందుఁ దూర్పుగదిలోనికి జాలావధానులు నరిభీమఁనుఁడునుం బ్రవేశిం చిరి. ఈయయుయందంతటనుఁ బలుతెఱంగు రంగులుగల రత్న కంబళములు పఱుపఁబడియున్నవి. గోడలకుఁగొంచెమెడముగఁ జుట్టు నానుదుదిం డ్లమర్పఁబడియుండెను. పయినఁజక్కని మేలు కట్టుకట్టంబడియుండెను. ఈగదికిం జేరి యుత్తరముగ నొక సజ్జక మయిన సజ్జగలదు. ఈవానగృహమునకును నాగదికిని మధ్య నొక చిన్న వాకిలి గలదు. ఈవాకిలి రెక్కతలుపులు తెఱువంబడి యున్నను దానికడ్డముగ నొక యవనిక యమర్పఁబడియుండు టచే నందలి వస్తువులెవ్వియుఁ గనుపడుట లేదు. కాని యీవడ

కటింటియందుఁ బైఁజెప్పిన గది యందువలెఁ దుదను సరిగపోగులు వేయఁబడిన యెఱుపుజాలరు గల యుల్లడలును నీయుల్లడలయంచుల నుండి కుడ్యంబుల మఱుఁగుపఱచునట్లు నలువ్రక్కలను సొగసుగఁ గట్టఁబడిన తెరలును గలవు.

మొదటిగదియం దరిభీషణ జాలావధాను లుపధానములపయిం జేరగిలఁబడి సుఖోపవిష్టులయి సరససల్లాపములఁ బ్రొద్దుఁబుచ్చుచుండిరి. కొలఁది కాలమిట్లు వీరు సంభాషించుచుండ నొకవిప్రబాలకుం డేతెంచి 'ఇఁక స్నానమునకు లేవవచ్చును' అనినొడివెను ఆపిలుపువచ్చినవెంటన, జాలావధానులు ప్రసంగము చాలించి "మనము వెళ్ళుదమా ? తామభ్యంజనము సేయవలెను, లోనికిందయ సేయుఁడు" అని యరిభీషణుని వెంటఁబెట్టుకొని తామిదివఱకుఁ బ్రవేశించిన ద్వారముననే చావడినుండి యుత్తరపు వాకిలిని మఱియొక బయలునకుం జనెను. అచ్చట నూనె, సీకాయ, నలుగుపిండి మొదలగు నభ్యంజనపదార్థములునుపఁబడియుండెను. కూరుచుండుట కొకకుఱిచీపీఁట వేయఁబడియుండెను. ఒకవైపున గొప్పతామ్రపాత్రమందు నీరు కాఁగుచుండెను. లక్ష్మణుఁడను విప్రబాలుం డరిభీషణుశిర మంటుటకై, తైలపాత్ర మరచేతియం దునిచికొని సిద్ధముగనుండెను. అచ్చటికి వెళ్ళి "ఇఁకఁ దాము స్నానము సేయుఁడు. నేముందుఁబోయి దేవతార్చనము ముగించి సిద్ధముగ నుందును" అని చెప్పి యరిభీషణు నందునిచి జాలావధానులు మహానసము లోనికరిగెను.

అంతనా బాలుఁడు నరిభీమణునకు సవిమర్శం దలయంటి యభ్యంజనంబు సేయించి మంచివస్త్రమునఁ దడియద్దెను. స్నానమయినపిదప జాలావధానులు స్వయముగ నొకవలిప మందీయ, నాతఁ డది ధరించి, భోజనశాల కాతనితోడం బ్రవేశించెను. గోష్పపీఁటలు రెండు దమర్పఁబడి యుండెను. అందొకదానికయి నరిభీమణుఁడును రెండవదానిమీఁద నవ ధానులవారును గూరుచుండిరి. అంతట బలముగ విభూతి పెండెకట్లువెట్టి వెనుకకచ్ఛమును జెక్కినదోవతితో నొక బాహ్మణబ్రుఁ డరుదెంచి సువర్ణపాత్రములయందు భక్ష్య భోజ్యములతోడ నన్నంబు వడ్డింప, నుభయులుఁ దుష్టిగభోజ నము సలిపిరి. భోజనానంతరము వారిరువురును వెనుక వివరిం పఁబడిన గదికి మరలం జని యందుండిన యువధానములకుం జేరగిలఁబడి విశ్రమించియుండ సన్మానపురస్సరముగ జాలా వధాను లరిభీమణునితో నిట్లు పలికెను.

జాలా- మిత్రమా! రాకరాక మాగృహంబునకు విచ్చేసినందుకుఁ దమకుఁ దగినసరామర్శ జరిగినదని నాకుఁ దోఁచదు. ఇంత చారు నన్నముగాని మఱియేవియు శాకపాక ములు లేక పోయెను. మనముకలసి భోజనము సేయవలయునని కోరికయొక్కటి యుండుటచేత మీకిట్టిశ్రమ నొసంగవలసి వచ్చినది. క్షమింపవలెను.

అరి - అట్లనెద రేల? ఆదరణము ముఖ్యముగాని పెట్టు పోఁతలు నిలుచునా? ఏమికొదవ? షడ్రసోపేతమగు నీభోజ నమునం దృప్తుఁడనైతిని. మీ రన్యథా యోజింపకుఁడు.

ఇట్లు ప్రియోక్తుల నుపచరించుచు, నవధానులవారు రసాభ్యుచిత తాంబూలముతోడి పళ్ళెరంబు ముందు పెట్టిన దాని నాతండు సంతసమునం గొనియెను. జాలావధానులు తాను దాంబూలచర్వణంబొనర్చి "కొంచెము విశ్రమించి భుక్తాయాస ముందీర్చికొనుండు; నేనునుం బ్రయాణంపుబడలిక లీఁగునట్లల్ప కాలము విశ్రమించెదను" అనివచించి, యరిభీషణుని మున్నుఁ బేర్కొనఁబడిన పడకటిగదికిం గొంపోయి యచ్చటి తల్పముం జూపి మరలిపోయెను. అరిభీషణుఁ డాహంసతూలికాతల్పమున మెల్లన మేనుసాచి పరుండెను.

---

## ౧౪ వ భాగము.

---

అప్పటికిఁ బవలు పదునొకండు గంటలయినది. మింటి తెరువరి తనపయనంబున సాముగడపి లోకములోని జనుల రహస్యాలోచనలను గృత్యములను గనిపెట్టుచు నీమహాపురుషుఁ డరిభీషణుండు పూనినకార్య మెంతవఱకుఁ గొనసాగింపఁగలఁడో విచారింతమని కాఁబోలు నతండు పన్నుండిన శిరోగృహము పైభాగమున నిల్చి యింటికప్పున సన్న సన్న రంధ్రములనుండి యాతనినిఁజూచి యతనికి హెచ్చరిక కలుగఁ జేసెను. ఆనాఁ డరిభీషణున కెందునకో నిదురపట్ట లేదు. బహుదూరము పయనంబు సేయుటవలనఁ గలిగిన మార్గాయాసముగాని, పంచభక్ష్యపరమాన్నములతోడ భుజించిన భుక్తాయాసముగాని యతనికిఁ గొంచెము కూనుకు

పాటయినం దేఁజాలవయ్యెను. మనమున నెద్దియే నొక యాలోచనగాని భయముగాని ప్రవేశించినపు డెవనికి నిదుర వచ్చును? తాఁబూనిన దుష్కరకార్య మెట్లు కొనసాగునా యను నాలోచనయొకటియు, నిచటిగోప్యంబు లెత్తెఱంగున బయలు పడఁగలవను చింత యొకటియు నేఁడుదయమునఁ దా నేత్రపర్వముగఁ గాంచిన యువతీమణియుదంత మేవిధంబునఁ దెలియఁగలనా యను విచారము మఱియొకటియు, నరభీమణుని మనంబునం బాదుకొని యెడతెగక యాతని హృదయకందరంబున నందడించుచుండెను. ఇఁక నతనికనులకు నిదుర రాలేదనిన వింతయేమున్నది? హేమసమతనూవిలాసయగు నాలేమనుగూర్చి మనంబునకు రా నాతండిటుల విచారించ నారంభించెను:—

ఆహా! ఏమి యీమగువసొబ గెంత వర్ణించినను తనివి తీరదుగదా! ఆకన్నులబెళుకేమి! ఆకపోలయుగళంపుఁ దళుకేమి! ఆకనుబొమలతీరేమి! కొదమతుమ్మెదగుమి నదలింపఁజాలు నాక్రొవ్వదసోరేమి! నేఁ గనుంగొనిన దంగనయా, మేలిమిబంగరుబొమ్మయా? అవి విలోలసితనేత్రములా? వికసితకమలపత్రములా? ఆవనిత కనుబొమలు చేఁపవింటివాని చాపములు. ఆముద్దియ లేనగవు రేయెండ బిగువు. నేనెందఱెందఱినో మందయానలం గాంచితిం గాని యీ సౌందర్యం బెందయినం గంటినే! ఈతెఱవ కేలువట్టఁగలవాని భాగ్యమే భాగ్యము. ఈమగువ ముద్దుపలుకులు విననోఁచిన వానిజన్మమే జన్మము. వానిదే పుణ్యము. ఈజవ్వని, యెవ్వ

తమై యుండనోపు ? ఈగృహములోనివారిలో నొక్క ర్తయి యుండునా? అట్లే యుండినను నుండవచ్చును కాని నాకు మాత్రి మా చెలి యీగృహవాసులలోఁ జేరిన దానా కాదా యని సందియము కలుగుచున్నది. ఈయాలయము తనది యని జాలావధానులు వక్కాణించియున్నవాఁడు. తాను పాఱుఁడననియు వచించియుండెను. ఆమగువ మొగమున రాచ పొలకువలు గానంబడుచున్నవి. ఇందుచే నాచెలంత యీని కాంతమున కెంతమాత్రము సంబంధించియుండదని నిశ్చయింప వలసి యున్నది. అట్లు కాకపోయినయెడ నామె యీ గృహం బున నివసించుటయు నసంభవము ! ఆమె మోముఁదమ్మి యేటికో దురంతచింతచే మేఘావృత చంద్రమండలము వలెఁ గానుపించెడును. దీనింబట్టిచూడ నాసుందరి యిందు వసించుట తనయిష్టమునఁ గాదనియుం దోఁచుచున్నది. కారణం బారయఁ జాలకున్న వాఁడ."

"శృతిహితముగ నయ్యువతివకత వినుటకెంతయు నామ నం బుత్సహించుచున్నది. నాహృదయానందమునకు మూల కందంబయి యావనసామ్రాజ్యలక్ష్మి యనందగు నా చంద్ర వదన యీ సౌధో పరిభాగంబునన గదా గానుపించినది? అప్రి దేశమునకుఁ దోవయెచ్చటనో" అని యీవలావలఁ బరికించి దిగ్గనలేచి చావడిలోనికిం జనెను. ఎచటనుఁ బైయంతస్థునకుఁ బోవుమార్గము గానరాదయ్యెను. వెలుపలి బయలునుండి యొంటివలె యక్కోమలినిఁ జూడవలనుపడునేమో చూత మని తలుపుఁ దెఱవ యత్నించెనుగాని యది యెందునకో

రాలేదు. ఈవల సభ్యాంజనమందిర బహిఃప్రదేశమునకు వెళ్ళుద
మన్నను, దానిలోనికింబోవు ద్వారముగూడ వెలుపలబంధించి
యుండెను. ఈ రెండు మార్గములు తప్ప నింక నెందును
వేఱుమార్గముఁగానక మరలఁ బడకటిగదికి వచ్చి యిట్లు విచా
రించెను.

"ఎందు వెదకినను నయ్యిందువదన వసించుతావునకుం
జేరుత్రోవగానుపించదయ్యో! అడిగి తెలిసికొందమన్నను నిచ్చట
నేరును లేరే! ఈమందిర మిట్లిప్పుడు నిర్జనమయి యుండం గా
రణ, మేమయి యుండును? ఆ రెండు కవాటములేల మూయఁ
బడియున్నవి. ఆవృద్ధవనితయు విప్రబాలుఁడును నిందుఁగను
పడరు. మేమిందుఁ బ్రవేశించుతఱి నెవ్వరాపాయముచేయక
పోయినను వీరందఱిట్లుపచరించిరి గద! వారందఱిప్పుడెం దరి
గినవారలో? జాలావధానులింకను మరలి రాలేదు. ఏమి
చేయనగు. బహుశః యిది యెండవేళ యగుటచేఁ బరులింటం
బ్రవేశింపకుండ ద్వారముల బంధించి వీరు నిదురించుచుండ
నోపు! అని యనుకొనుచు నాశయనగృహమం దిటునటుఁ
బచేరము సేయుచుండ నకస్మాత్తుగ నుత్తరపుగోడకును దెర
కును మధ్యనుండు నొకచోటఁ గాలిడెను. తోడన నచట
నదివఱ, కెంత పరిశీలించినను గనుపడని యొకతలుపుపలక
గుబ్బయొత్తఁబడి బెట్టుసడలి నిశ్శబ్దముగ నొక ప్రక్కకు జరి
గెను. అపుడతని కచట నేల సొరంగ మొకటి గానంబడియెను.

ఆసొరంగము మొదలు దిగువ కేక స్తంభమును, దాని
చుట్టునుఁ గట్టడపు మెట్లుం గానఁబడియెను. ఆమెట్ల వెంబడి యరిదీ

షణుఁడు లోనికిందిగ నాలుగుగజముల యెత్తు, రెండు గజముల వెడల్పునుఁ గలిగిన చక్కని ఱాతికట్టునేలసురంగపుఁదోవ యొకటి యాతనికిఁ గానఁబడియెను. ఆత్రోవను కొన్ని గజములు నడువఁగా, నది నాలుగువయిపులఁ జిన్నచిన్న వాకిళ్ళు గల యొకమంటపమునకుఁ గొంపోయెను. ఆమంటపమునట్ట నడుమ దీర్ఘకాయము, దట్టముగ వ్యాపించిన మిట్టపన్నులతో నిండిననోరును, దివాంధముంబోని మిడిగుడ్లును గలసిన కనుబొమలు, నుంగరములవలెఁ జుట్టలుచుట్టుకొనిన వెండ్రుకలును గలిగి, చూపఱులహృదయమునకు భయంబాపాదించు ఘోరాకారుండొక్కండు, పన్నుండి నిదురించుచుండెను. నాలుకలు గోరియుఁ బెనుదారిచువలె గండగొడ్డలి యొకటి యాతని చెంత నుండెను. అతని నరిభీషణుఁడు రెప్పవాల్పక రెప్పముగఁ గొంతతడవుఁ బరికించి, యావికృతరూపమున కొకింత లోన నసహ్యపడుచు, నందలిరహస్యముల నెల్లఁ బరిశీలింప వలెనను బుద్ధి తన్నుఁ బ్రేరేపింపఁ, జప్పుడుగాకుండ నడుగులిడుచు, నావలఁజనెను.

కొలఁది దూరమరిగి, నలుదెసలఁ గలయఁజూడ, వెనుకఁ జూచిన వానివంటివి, నాలుగుసొరంగపుఁ దోవలందుఁ గానఁబడియెను. అందొకటి సరిగ నుత్తరమునకు, నొకటి దక్షిణమునకుంబోవుచుండెను. ఈదక్షిణమార్గమున కీవలావల పశ్చిమోత్తరముగ నొక్కటియుఁ, బూర్వోత్తరముగ నొకటియుఁ బోయి, యామందిరమునకుఁ దూర్పుపడమరగోడలవెంబడి వ్యాపించియుండెను.

మొదట, నాతఁ డుత్తరమునకుం బోవుమార్గమున నడువనారంభించెను. అతఁ డ్రివం బోవంబోవ, నచ్చట నొకదే వాలయము గానుపించెను. అది యొకరిద్దఱు మనుజులు మా త్రము నిలువఁదగిన చిన్న దేవళము. ద్వారము తెఱువఁబడి యుండెను. అరిభీషణుఁ డాద్వారమున దేవళములోనికిం బ్రవే శించెను. అందుఁబశ్చిమమునఁ దూర్పుముఖమయి, పశుప్రాణ భక్షణాతురతచేఁ దెఱువఁబడిన యమవక్త్రముంబోని కరా ళంబును, నగ్నికీలివలె వెలికింజాఁపఁబడిన నాలుక తోడను బ్రళయకాలావసరమున లోకముల నెల్ల భస్మీభూతము సేయుట కయి విప్పఁబడిన పశుపత్యుపనేత్రంబు ద్విధావిధమైన భీతి భయానకరసోత్పాదకము లగులోచనములతోడను లోకభ యంకర మగుకాళికావిగ్రహ మొకటి కానంబడియెను. ధైర్యసా హసావతారుఁ డననొప్పు నరిభీషణునకు నయిత మా ఘోరరూ పుఁ జూచినపుడు మనంబు కొంచెము చలించినదన మఱి పెఱ వారలవిషయమై యడుగ నేల ?

ఆ గుడినుండి యుత్తరపువైపునఁ బైకిఁబోవు మెట్ల వరుస కనఁబడెను. ఆసోపానములం బైకెగిచక్కఁగఁబరిశోధించి చూడ, నచ్చట నదివఱకుఁ గనుపడని గూఢద్వారంబు గానుపించెను. ఆ ద్వారపుగుబ్బ యొత్తఁ దలుపుపలక శబ్ద రహితముగ నావలికిం జరిగెను. అకంతలోనుండి మీఁదికిం జనఁ గొంచెముదూరమున నొక ద్వార మింటి నేలభాగమునఁ గనుపడెను.

ఆ ద్వార ముత్తరభాగముననున్న దొడ్డిలోని తోఁటకుఁ బోవునది. దానిఁ దెఱచి, మెట్లు దిగి తోఁటలోఁ బ్రవేశించెను. ఆ తోఁటనుండి, నదివయిపుననుండు ప్రహరి గోడలో మఱియొక ద్వారముండెను. దానింగూడఁ దెఱచి, యా ప్రదేశమంతయుఁ జక్కఁగఁ బరిశీలించిన సందొక నల్లని మేనిచాయగల మనుజుఁడు రెండు గొఱ్ఱెలనుఁ గాయుచుఁ గూరుచుండి యుండెను. అరిభీముఁ డామనుజుని గుర్తించి, యతనికి సైగఁజేయ నతఁడు వడివడిం బఱతెంచి, ముందు నిలిచెను. అరిభీముఁ డతనితో, రహస్యముగ నెవ్వియో కొన్ని చెప్పవలసిన మాటలం జెప్పి,యొకచీటి యా మనుజున కిచ్చెను. దాని నాతఁడు గొనిపోయి, యచటికిఁ గొంతదూరమున నున్న మఱియొకని కిచ్చి, యేమియు నెఱుఁగనివాఁడుంబోలెఁ దిరిగి తనగొఱ్ఱెలనుఁ గాచుకొనుచుండెను.

ఆవల నరిభీముఁ డందుఁ జేయఁదగు నేర్పాటులన్నియుం జేసి, యచ్చటినుండి మరలి, గుడిలోని కేతెంచెను. అచట రక్తబిందువులచే మలీమసమయియుండుఁ గరవాల మొకటి యమ్మవారియెదుటనున్న గోడకు వ్రేలాడఁగట్టఁబడి యుండెను. ఆ కరవాలముం గొని మరల నందందుఁ జూచుచుండ, నేలపయి నొకగుప్తద్వారము గనుపడెను. దానిం దెఱువ, నొక యేటిప్రవాహము కానఁబడెను. ఆ ప్రవాహము కనుబడిన బిలమున నొకయినుపపిడి యుండెను. దానిం గొంచెము త్రిప్పఁగా నా ప్రవాహములో విపరీత మగునురువడియొకటి బయలుదేరి,నదివయిపునకు నీరు ప్రవహించున ట్లగుపడెను.

అంత, నరిభీమణుఁ డా స్థలమువదలి, మున్నుఁ దా నే తెంచిన నేల సొరంగపుమార్గమున మంటపసమీపమునకు రాఁగా నచ్చటి మనుజుఁ డింకను నిదురించుచునే యుండెను. నిదురకుఁ దోడు నల్లమందుమ త్తాతనిని నొడలెఱుంగకుండ జీవచ్ఛవముఁగఁ జేసెను.

అచ్చోటు వదలి, యీ తోవను దిన్నఁగ మరల మంటపముద్వారా పశ్చిమో త్తరపు నేలమార్గమునం బోయి యచటఁ దా నిదివఱకుఁ గాంచినవాని వంటి గదులురెండు దాఁటి యెదురుగనున్న మెట్లెక్కి పయికింబోయి, మూడవగది, వెలుపల నిలువఁబడెను.

---

# ౧౬ వ భాగము

మన మీ యరిభీమణుఁడు పశ్చిమో త్తరపు నేలసొరంగపుమార్గమున మూడవగదిగుమ్మమున నిలువఁబడియుండుట చదివియున్నాముగదా? అప్పటికి రమారమి పగలు పండ్రెండుగంట లయినది. పొద్దుగడచుచున్నది. ఆనెలంతజాడ యీతని కింకను తెలియలేదు. అతని కేమియుఁ దోఁచలేదు. ఆతండిటుల నాలోచించ నారంభించెను.

"ఆకళ్యాణలక్షణను జూచిన దీచాయనగదా? ఆచెలి యుండెందో యుండనోపు. ఈయఱలోనికి మార్గ మెచట నుండును" అని యిందందువెదకిన నొకగుప్తమార్గ మచ్చటఁ గానుపించెను. దానిచీల యొత్తి లోనికేగ నం దొక స్త్రీరత్న

మగుపడెను. ఆయువిదయు యాయుదయమున నరిభీమణుఁడు గాంచినది ఆవనితాతిలకమును గాంచినతోడన యరిభీమణునకుఁ గలిగిన యానంద మింతయని వచింపనలవిగాదు. మేనం బులకలెత్త గొబ్బునం జని యాచిలుకలకొలికి కెలఁకున నిలువనుంకించెను. కాని యన్నెలంత యెద్దియో చెప్పనుంకించుటం గని గోడలకు సరసనఁ జుట్టునుఁ గట్టఁబడిన తెరచాటునఁ దానొకప్రక్క నిలువఁబడి యిట్లు యోజించెను.

'నే నే సుందరవస్తుసందర్శనమునకు మనసుపడియుంటినో యావస్తువే కాకతాళీయముగ నా కన్నులయెదుటం జూపట్టెడు. ఈలలనామణి నెబ్భంగిఁ గాంతునాయని విచారించుచుండ దైవమనుకూలుఁడయి, యీలోకోత్తరరూపచెంతకే నన్నిట్లో తెచ్చివిడిచెను. ఇఁక నీతరుణీచరిత్రము చెవులార విని సంతసింపఁగలభాగ్య మబ్బును గాక! ఈమె యేమివచించునో చూచెద' నని చెవియొగ్గివినుచు నందు నిలువఁబడెను. ఆయెలనాగ యాగదియం దొకపర్యంకముపయి నొంటరిగఁ గూరుచుండి యెద్దియో యోజించుచు, నితని రాక యెఱుఁగక యిట్లనుకొనుచుండెను.

"ఆహా! నేఁడుగదా సుదినము! నేనిందువచ్చి యింత కాలమయినది. వచ్చినదిమొదలు మనస్సునకు వ్యథయకాని, యొకనాఁడును స్థైర్యము లేకపోయెను. ఇచట నన్నోదార్చువారెవరు? నాదుఃఖమును నాలోనన దిగమ్రింగుకొనవలయును. నామనంబున కెద్దియు రుచించుటలేదు. 'అనాశ్వాసితదుఃఖతే మనసి సర్వ మసహ్యా'మనునుడి యబద్ధమగునా? కాని

నేఁడు నాకులభించిన యానంద మెన్నఁడయినం గలిగెనా! దీని కంతకు నాజవ్వనుని రాకయ కారణముగదా! భగవంతునిచేఁ బెకలింపఁబడిన మనశ్శల్యమువలె నామనోదుఃఖమంతయు నిప్పు డీభూలోక జయంతునిదర్శనమువలన నున్మూలింపఁబడియెను. ప్రభాకరోదయమయినచో నంధకారమున కెక్కడియునికి? లోకలోచనోత్సవసంధాయక మగునారూప మెంత చూచినను తనివితీరదు గదా! శరచ్చంద్రచంద్రికా విలాసమును దిరస్కరించెడు నతని చిఱునగవుసొగసెంత! వీనుల కమృతధారాపాతతుల్యమగు నాసూక్తివైచిత్రి యెంత! ఆలావణ్యమోహితునిఁ జెట్టఁబట్టుట కేలోలాక్షి నోఁచియున్నదో! నాయట్టి దురదృష్టురాలి కిట్టిమహాశయుఁ డెట్టులభింపఁగలఁడు. ఇది యందనిమ్రానిపండ్ల కఱ్ఱులుసాచుటయ! అట్లననేల? దైవ మనుకూలమయినయెడ నసాధ్యమేమున్నది? ఎందువలననోగాని నాకు శుభమే గానవచ్చుచున్నది. అతని యప్పటి వాలుచూపు లాయనకు నాయందుఁగల యనురాగమును వెల్లడించియున్నవి. ఇది యొకభ్రమ కావచ్చును. కాముకులు, దాము గోరినప్రియు లేకను లొనర్చిన, నవియన్నియు స్వపరముగ నన్వయించుకొని, సంతసించుచుందురు. వారి మనోవృత్తుల నెట్లు తెలియనగు? ఆతనివరింపఁగలిగినఁగాని నాహృదయము కుదుటంబడదు. సౌందర్యరాశియయిన యా మహాభుజుఁ డెట్లును నయనమార్గమునం బ్రవేశించి నాహృదయమును హరించినవాఁడు.”

కాని వాని కిందేయాపదయుఁ గలుగకయుండవలయుం గదా? ఏలకలుగును? అతని గంభీరాలోకన మతని ధైర్య సాహసములం బయలుచేయుచున్నది. ముఖలక్షణంబులు సూచినను, జాలావధానులపయి నొకకన్ను పెట్టియున్నట్లు తోఁ చెడును. వానిమాయావాగురం జిక్కునా? ఆమహాపురుషుఁ డతిసమర్థుఁడు. సమర్థుల కసాధ్యమునుఁ బ్రియవాదికి శాత్రవమునుం గలదా?" అని యనుకొనుచు మరల నెద్దియో యోజించుచుండ లబ్ధావకాశుఁడై యరిభీషణుఁ డయ్యింతి యంతికమున కేఁగఁ గొంచెము సాగఁజూచెను.

ఇంతలో నొకమానిసికంఠధ్వని యరిభీషణు చెవింబడెను. దానికారణ మారయం దలంచి యాలకించుచు నాతెఱ మఱుఁగుననె నిలువంబడెను. అచ్చెలియు, నాధ్వని విని తోడన స్పృహతప్పి మంచముపయిం జదికిలఁబడెను. అప్పుడు రమారమి యేఁబదేను యేఁబదాఱు వత్సరములబడుగుమేని నడిమునలివాఁ డొకఁడు లోనంబ్రవేశించి యా చెలియయొద్ద నెదురుగనున్న కురిచీమీఁదఁ గూర్చుండెను. అమ్మగువయుం గొంతవడికిఁ దెప్పిఱిలి మెల్లనలేచి పర్యంకముపయిం గూరుచుండినను నా ముసలివానిం గాంచినతోడన పద్మినిని హేమంతుని దర్శనమువలె నాతనిదర్శన మచ్చెలిమోముదమ్మిని శోచ్యముగ నొనర్చెను.

" సఖీ! ఏలభయంపడెదు? ఇచ్చట నీకుఁ బరులెవరు? నేను నీ పాదైక భక్తుఁడనుగదా! నా వలన భయమేమియు శంకింపకుము. కామినిరూపుగైకొనిన కామునివాలుటమ్మొకో

యననొప్పు నీ కోమలశరీరము నామానసంబు సొచ్చి యేమఱక నన్నున్మత్తుం జేయుచున్నది. తామసింపక నను నీదయాదృష్టిం జూడుము. నన్నుం దోలివైవక సాదరంబున నేలికొనుము. నాసకల భాగ్యంబులు నీయవియ. ఈశరీరము నీయదియ! అన్యథా యోజింపకుము” అని యావృద్ధు డేమేమో వదరుట కారంభించెను. హితాహితము మనస్సే చెప్పును గాన వాపలుకులకు లోన నసహ్యపడినను, మానము బంగారని మాఱుపలుకక యచ్చెలి యూరకుండెను. ఊరకొన్నకొలఁది నామె మానమునంగీకారముగఁ గైకొని యావాచాలుం డెంతయు మదాంధుఁడై పలుకఁజొచ్చెను. ప్రతికూలవచనముల రోగి వైద్యునకు లోఁగఁడుగాన సాంత్వన వచనముల నక్కాంత తనకార్యము చక్కఁబెట్టికొనం దలంచెను. ఆముప్పుదప్పించుకొనుట కామె యిట్లనియెను.

“స్వామీ మీరీలాగు నన్నింత పొగడందగునే? ఈమందభాగ్యురాలి నింత వేఁడవలయునా? మీరు మన్నింతురేని నేనొక విన్నపము చేసికొనియెదను.

వృద్ధు - చెలీ! నీవు విన్నపము సేయవలయునా? ఆజ్ఞ సేయనగు. నీమనంబునం గలకోరిక నిర్భయముగ వచింపుము. దాని నేను సేవకునివలెఁ బరమభక్తిని నెరవేర్పఁజూచెదను.

చెలియ:- నేనొకవ్రతంబుఁ బూనితిని. ఆవ్రతము సాంగముగ నెఱవేరినపిదప మీరు కోరినభంగి చేయుదానను. ఆవ్రతసమాప్తి కొకవత్సరము గడుపేయ ననుగ్రహింపుఁడు. పిమ్మట నే మీదాన నయ్యెదను.

వృద్ధు - "ఇంతపని కింత వేఁడవలయునా? నీవ్రతము నిరాటంకముగ నెఱవేర్చికొనుము. వీరు నీసేవకులయి నీకుఁ గావలసిన పనులను సమకూర్చుచుందురు" అని యొక ముసలిదాని, నొక కుఱ్ఱవానిం జూపి యాయిరువురితో నాతం డెందేనిం జనెను.

ఆముసలివానిపోక, యావనిత హృదయభారమును దగ్గించి కొంత యూరటఁ గలిగించెను. అదియు తగిన యదనని యెంచి యరిభీమణుఁ డచ్చెలియకడకుఁ జని యెదుట నిలువంబడెను. అప్పు డాజవ్వని నివ్వెఱపాటున నతని వీక్షించి, చిత్రిత ప్రతిమవలెఁ గూరుచున్నది, కూరుచున్నట్లయుండెను. అప్పారవశ్యమునుండి తుదకామె కొంత తెప్పఱిలి యతని మోమునఁ జూడ్కి నిలిపెను.

అంత నామె, పెన్నిధింగన్న పేదవలె, మరుభూమియం దమృతప్రవాహమునుఁ గాంచిన పిపాసార్తుని విధంబున, నమృతకిరణునిఁ గనిన చకోరితెఱంగున, మేఘజాలమును వీక్షించిన మయూరిభంగి సంతసంబునొంది, మదనుఁడను నైంద్రజాలకుని దండపుఁదాకుడుచేతనుంబలె చివాలునలేచి, మేలిముసుంగు సవరించుకొనుచు "నేనప్పు డనుకొనినమాట లీజవ్వనుండు వినియుండఁడుగదా! వినిననేమాయె! నామానసము యతని కర్పింపఁ దలఁచియున్నదానను. నాపలుకు లాతం డాలించినమాత్ర మేమితప్పు? నామనం బెట్లో యాతని యందుఁ దగులంబడియె. నన్నది వెలిపుచ్చక మానునా?

ఆపని ముందే జరిగెను. చల్లకువచ్చి ముంతను దాచవనగునా" అని తలంచుచు సిగ్గున నిలువఁబడి యుండెను.

అంత నరిభీమణుఁడు నక్కన్నియయు నిట్లు సంభాషించిరి.

అరి- చెలీ! నేనొక ప్రశ్న నిన్నడుగఁ దలంచితిని. నీవంగీకరింతువని నమ్మెదను. చుక్కలనడుమఁ జక్కఁగఁ బ్రకాశింపఁదగిన చంద్రబింబ మిట్లేకతం బిచ్చట వసింపఁ గారణమేమి? నీవీగృహదేవతవో! భూమిం గల విశేషంబు లరయ ముచ్చటపడి వచ్చిన వేలుపు మచ్చకంటివో గావలయును. కాని యెడల మనుజాంగనల కీ తనూవిలాసం బెక్కడిది. నీపేరుగానోఁచిన యక్కరంబు లెవ్వి?

చెలి- నానేత్రోత్సవమున కకారణ కారణంబయిన యీ మహాపురుషు లెవరో తెలియఁజాలనైతిని. మీరిందు విచ్చేయుటం జేసి నామనంబునాక్రమించిన దురంతచింత కొంత తొలంగినది. మీ భాషణములు నాకు దుఃఖశోషణములయ్యెను. ఇఁక నాకష్టాబ్ధిం గడచు సమయ మేతెంచినది కాఁబోలును. నాపేరు విద్యుత్ప్రభ యందురు." ఆమెమాట కడ్డమువచ్చి "కష్టములని యనుచున్నావు. భువనమోహనమగు నీముఖాబ్జ మిట్లేల వాడిమిచెడి యున్నది? ఇపుడు నీతోడ మాటలాడి చనినయాతం డెవండు? నే విన నర్హుఁడనని తోఁచిన యెడ నీయుదంతము సాంతముగ నా కెఱిఁగింపవలయును" అని యరిభీమణుఁ డనెను.

విద్యు - మహాపురుషా! నావృత్తాంతము కడునిర్భా

గ్యము. విచారకరమగు నీమంద భాగ్యురాలి చారిత్రము మీయట్టి మృదుహృదయుల కెఱింగించి, మిమ్ముంగూడ దుఃఖభాగులనుగఁ జేయ నామనం బిష్టపడకున్నది. చిన్న నాఁడు నాల్గువత్సరంబు లేమిసుఖ మనుభవించితినో గాని నాజీవమంతయు దుఃఖజలధినిమగ్నమయి యున్నది. నాక్షోభ నాలించువారయిన లేక, యూరక లోలోనం గృశించుచున్న దానను. మీ మొగము చూచినతోడన, నాహృదయమునకుఁ గొంచెము శాంతికలిగినది. ఇంతవఱకు నాకడుపులోని మాటను జెప్పుకొనుట కిందెవ్వరును లేరైరి. కొత్తలయి నను మీరిందు వచ్చినదిమొద లదేమోగాని నాకాప్తవర్గ ములో నున్నట్ల యున్నది.

అరి - తనకష్టముల నొరులకుఁ దెల్పిన తనదుఃఖము కొంత యుపశమించు నందురు. అందును నాయట్టివానికిం దెలిపినమాట, పేటికయం దిడినమాట యని తెలియుము.

విద్యు - "శుభాంగా! అట్లయిన నీదురదృష్టురాలి వృత్తాంత మామూలాగ్రముగఁ దెలిపెదను. కరుణాయత్త చిత్తులరయి విన నవధరింపుఁడు. వెనుక మాపూర్వులు చిత్తూరు సంస్థానమునందు వసించుచుండువారు. నాతండ్రిపేరు ధీరసింగు. అతఁడు చిత్తూరురాజ్యమున నొకయుద్యోగస్థుఁడు. మాపూర్వు లనేకసంవత్సరములవఱకుఁ జిత్తూరురాజ్యమునందు మంత్రివర్గ ములోఁ బ్రముఖులుగ నుండిరి. నాలుగుతరములనుండి, మావం శమునకుఁ జెడ్డదశ సంభవించినది. కొన్నిసంవత్సరములక్రింద జరిగిన రాజ్యాంతఃకల్లోలములలో మావారి కెంతయోదవ్య

నష్టము కలిగెను. ఆస్త్రీయును జిందఱవందఱ యగుటయకాక పిదప రాజ్యమును స్వాధీనముచేసికొనిన ప్రభువులుగూడఁ బూర్వరాజులకును మాకును గలబాంధవ్యమైత్రులఁబట్టి మమ్ములచేతనయినప్పుడెల్ల నవమానము చేయుచుండువారు. ఇంతియకాక మాబిరుదులను మహామాన్యములనుగూడఁ గ్రమక్రమముగఁ దగ్గించుచువచ్చిరి.

ప్రభువులకును మాకునుగల పరస్పరమనఃకల్లోలము లిట్లుండ, దుర్మార్గుఁడగు భూతివర్మయనుమంత్రి మాదురదృష్టమున మాపాలిటికిఁ దటస్థమయ్యెను. రాజాతనిచేతిలోనిబొమ్మవలె నాడుచుండెను. ఈరాజ్యమున జరుగు ఘోరకృత్యములకన్నిటికి నీతఁడ ముఖ్యకారకుఁడందురు. ఈభూతివర్మ నన్ను వివాహమాడవలయునని నాసవతితల్లితోఁ గుట్రలు పన్నుచుండెను. నాసవతితల్లియు నన్నెట్లయిన నాతని కంటఁ గట్టవలయునని గట్టిపట్టుపట్టెను. ఈసంగతి నాకుఁ దెలిసినపుడు నాహృదయమున నొకపెద్దరాయి పడినట్లయ్యెను.

నాతండ్రికి నావివాహవిషయమయి నాసవతితల్లి వలనఁ గలిగెడు దుస్సహమయిన మనోవ్యధను జూచుచుండుట చేతను, మనమున కిష్టముగానివరుం జేకొనవలసి వచ్చునేమో యనుభీతిచేతను హృదయము నిలువలేక ప్రాణత్యాగము చేసికొనుటయ సర్వోత్తమమని నాకుఁదోఁచెను. తుదకట్లే చేయ నిశ్చయించుకొని యొకనాఁటిరేయి జాముప్రొద్దెగిన పిమ్మట నదనువేచి యింట నాతల్లిదండ్రులు నిదురించుచుండఁ, బెరటితలుపు చప్పుడుగాకుండ మెల్లనఁ దెఱచికొని,యీయూ

రివెలుఁ పలిగ్రామదేవతగుడి సమీపమునన్న పాడుబావింబడి ప్రాణంబులువీడ నిశ్చయించుకొని యిల్లు బయలుదేరి, యొరుల కంటఁబడకుండ నడచిపోయి, యాయమ్మవారిదేవాలయమును చేరితిని. దాగఁబోయినచోటదయ్యమెదురయ్యెనన్నట్లింటనిల్వఁ జాలకయచ్చటికింబోయిననచ్చటికిని నాదురదృష్టమునన్నుతఱుముకొనియే వచ్చెను. నాబ్రతుకు ముల్లుదీసి కొఱ్ఱడఁచికొనిన విధమాయెను. గుడిసింహద్వారము దగ్గఱకుఁబోవ, నాద్వార పుదేహళివయి నెవరో యమదూతలంబోలు భయంకరాకారు లిరువురు గూరుచుండియుండి నేఁబ్రవేశింపఁగనే ధ్వజస్తంభ ములవలె నిలువఁబడిరి.

అయినను "జావఁదలఁచినవానికి సముద్రము మోకా లిబంటి"అనున ట్లీదుష్టులదర్శన మెంతమాత్రము నాకుఁ గష్ట ముగఁ దోఁచలేదు. వారల నచటఁ జూచియుఁ జూడనటుల వెనుకకు మరలి బావిని సమీపించుచుంటిని. ఇంతలో వారి ద్దరు విచ్చుఁగత్తులతో నాకడ్డముగ నిలువంబడిరి. ఆఘోరా కారుల యప్పటియునికి, చావనిశ్చయించుకొనుటచేఁ గాఠిన్య మువహించిన నాగుండియ సయితము చెదరునట్లొనర్చెను. అంతట నోడలు ఝల్లురన, కెవ్వురని కేకవేసి తెలివిదప్పి నేలంబడితిని. పడుటమాత్రము తెలియునుగాని పిదప నేమి యయ్యెనో నేనెఱుంగను. కనులువిచ్చి చూచువఱకు నే నీ స్థలమున నుంటిని" అని మఱియేమో నుడువ నుంకించెను. కాని, చింతాభరంబున నోట మాట రాక కనుల నీ రిడుచు నూరకుండెను.

# ౧౬ వ భాగము.

:o:-

అనుభవించినకష్టము లెప్పుడయిన జ్ఞప్తికివచ్చినప్పు డల మట నొందనివా రెవరు? విద్యుత్ప్రభ మొదటినుండియుఁ గష్టములే యనుభవించెను. తనయుదంతము సాంతముగ నరిభీషణున కెఱిఁగింప నెంచెనుగాని, శోకవిహ్వలయౌటచే తనో, తనకష్టచరిత్ర మతనికుత్సాహభంగము కలుగఁజేయు ననియో, తన్ను రక్షించుటయను మహత్కార్యముం బూని యున్న తనమనోహరున కిచట కాలవిలంబన మౌననియో, విద్యుత్ప్రభ తనకథను సంగ్రహముగ నుడివెను. కాన నామె చరిత మిక్కడ కొంచెము విస్తరించుట మంచిది.

మీవారు రాజ్యమునఁ జిత్తూరున కనతిదూరమందు నాగేంద్రపురమను నొక గ్రామము గలదు. ఆగ్రామమందు ధీరసింగను నామముగల రసపుత్రుఁ డొకఁడుండెను. ఆతనికిఁ బైతృకమయిన యాస్తి కొంచెము గలదు. ఆ యాస్తి యంతయు నాతఁడు నిష్ప్రయోజనమయి, భ్రామికమయిన, వ్యవహారములయందుఁ బ్రవేశించి క్రమక్రమముగఁ బోఁగొట్టుకొన్నను, ధనికుఁ డనువాదుకమాత్రము పోలేదు. భూస్థితి, కొంచెము నిలిచినది. దీనియందు ముఖ్యమైనది యొకచిన్న తోఁట. ఆ ధీరసింగు, జగత్సింగను రాజపుత్రవీరుని కూఁతు సుశీల యనుదానిని వ్యాకోచపద్మపత్రనేత్రను వివాహమై యనుకూలదాంపత్య మన నిట్టిదిగదా యని జనులనుకొనునట్లు కాలంబు పుచ్చుచుండెను. కొంతకాలమునకుఁ బార్వతీపరమే

శ్వరులం బోలు నా యిరువురు దంపతులకు విద్యుత్ప్రభ యు ద్భవించెను. ఆ చిన్నది, వారలకుం దొలిచూలగుటం జేసి, వా రామెం గడుగారాబమునం బెంచుచుండిరి. అందునుం దల్లి యత్యంత ప్రేమాంధయయి యామెతోడిద లోకముగ భావించుచు, నామెను నేలపైం గాలిడనీయక, సకలవిధముల నాశ్వాసించుచుండెను.

ఈ రీతి నాచిన్నదానికిం బండ్రెండువత్సరములు వచ్చు వఱకు నొక్కవిధముగం దలిదండ్రులముద్దులకు గుఱియై, యామె నిరంతరాయ మగుసౌఖ్యమునం బెఱుఁగుచుండెను. కొంతకాల మిట్లు గడచిన పిదప, నా వడుచు దురదృష్టమున నాగ్రామములో మారియుపద్రవము సంభవించి, యాజాడ్య మా విద్యుత్ప్రభాజననిం దొలిముద్దం జేసికొనియెను. మరణా వస్థయందుండియు, నా సుశీల పెనిమిటినింగాంచి, కనులనీరురల విద్యుత్ప్రభ చెయ్యి యాయనచేతిలో నునిచి యా చిన్నదాని పోషణభార మిఁక నీ యదియ యని చెప్పునదివోలె, నొటి మాటచేఁగాక, కన్నీటితోడం దెలిపి, ప్రాణముల విడిచెను. నాటఁగోలెం దల్లిలేని పిల్లయాటను దండ్రి యామె నెంతయు ననురాగభరంబునం బోషించుచుండెను. ధీరసిం గప్పటికి ముప్పదిముప్పదిరెండు వత్సరములప్రాయపువాఁడు. కాన, భార్య చనిపోయిన మఱుదినమునుండియే నీకు మాపిల్ల నిత్తుము మా పిల్ల నిత్తుమని పలుగురు రాజపుత్రులొకరివెనుక నొక రరుదెంచి, యాయనను దొందరపెట్టం దొడఁగిరి. జాయ గతించి యింకను రెండుదినములయినం గాకపోవుటచేతను, భార్యా

భర్తల కదివఱకున్న యన్యోన్యానురాగబలము తగ్గుట కింకనుఁ దగిన వ్యవధి లేకపోవుటచేతను, విద్యుత్ప్రభయందలి ప్రేమానుబంధ మింకను వదలకుండుటచేతను, ధీరసింగు దుఃఖముపశమింపక తాను వివాహమొల్లనని చెప్పుచు, వచ్చినవారల వేఁడికోలు నంగీకరించక, వారల నంపివేయుచుండెను. దగ్గఱ బందుగులందఱతనియందలి ప్రేమచేఁ గాకపోయినను, గన్యనొసఁగ నేతెంచినవారల కిచ్ఛకమున కయినను వివాహము చేసికొనుమని ధీరసింగును బలవంతపెట్టసాగిరి.

బంధువుల ప్రోత్సాహమువలన నయిననేమి భార్యా దుఃఖము క్రమక్రమముగ నాయనను విడుచుటవలన నయిననేమి, ఇంటనిలుదీర్పువా రుండని హేతువుననైననేమి, తుదకుఁ గొంతకాలమునకుఁ దిరిగి వివాహమాడుట కాతఁడియ్యకొనెను. అందుమీఁద, సుశీల పరలోకగతురాలయిన యాఱవనెలలో నొకరసపుత్రుని కొమరిత యగు తారావతి యను పదియాఱువత్సరముల పడుచును నాతండు పరిణయమాయెను.

ఈక్రొత్తడి యింటం బ్రవేశించినది మొదలు ధీరసింగునకుఁ గ్రమేణ యామెపయి ననురాగ మెచ్చుటయు, విద్యుత్ప్రభయందుఁ దగ్గుటయుఁ, బ్రారంభించెను. సమయము చిక్కినపుడెల్ల సవతితల్లియు నాపడుచుపయి నెవ్వియో యున్నవికొన్నియు లేనివికొన్నియు నేరములం దండ్రితోడం జెప్పుచుండెను. విన్నమాట కంటెం జెప్పెడుమాట లెంతయుం జేటును దెచ్చునుగదా ? ఆమె మగనితోఁ గొండె

ముల నటించినపుడెల్ల నాతం డాపడుచును జీటికిమాటికి దండింపఁ జొచ్చెను. ఇంతమాత్రమున నాతనికిఁ గూఁతుపయిఁ బ్రేమ లేదని చెప్పుటకు వలనుపడదు. సవతితల్లి యాపిన్నదానిమీఁద నేరములు చెప్పినపుడు గూఁతుం దండింపనియెడల నామె మనసు నొచ్చునను నుద్దేశ్యమున నామె మోమోటమికయిన నక్కన్యను మందలించువాఁడు గానికూఁతుపయిఁ గ్రోధముచేతఁగాదు. ఒక్కొకవేళ నాపడుచు నందు నేరములేదని నాయప్పుడుఁ దెలిసియున్నను భార్యను సంతోషపెట్టుటకైనఁ గొంచె మాగ్రహముఁ జూపెడువాఁడు. కొన్నియెడల నాలిమాటలం బాటింపకపోవుటయుఁ బడుచు నాదరించుటయుం గలదు. కూఁతు నాదరించు సమయముల యం దాదుష్టస్వభావురాలు మగనింగూడ లక్ష్యముసేయక నోటికివచ్చినయట్లాయనను దుర్భాషలాడుచుండునది. అప్పు డాతఁ డామెనేమియు ననలేక మనమున మిక్కిలిపరితపించుచుం డెడివాఁడు. చేసికొనిన పెనిమిటినే లక్ష్యముసేయని యాసతి తనసవతికూఁతు మన్నించునా? గాలిచే రేఁగిన కార్చిచ్చునకు గడ్డిపోఁచయేమి మహారణ్యమేమి? ఇందున కొక దృష్టాంతము చెప్పినం జాలును.

ధీరసింగుని యాస్త్రియందుఁ దోఁట యొకటి యున్నదని యిదివఱకుఁ జెప్పఁబడెనుగదా ? ఆయాటతోఁటఁ జూడ వలయునని యొకనాఁడు కుతూహలపడి విద్యుత్ప్రభ తన యప్ప నడిగి యనుజ్ఞఁగొని తోడిచేడియలంగూడి యచ్చటి కరిగెను. అందు నారికేళము లనంట్లు జామలు మొదలగు

సకలఫలవృక్షములును వివిధవిధములగు కుసుమవిసరములఁ బసగుల్కు తీవియలు, ననేక లతాంతసంతానదంతురంబులగు పూవుఁటీరములునుం గలిగి యావనం బెంతయు నేత్రోత్సవంబు సేయుచుండెను. మందసమీరుఁ డచటిక్రొక్కాఱు మెఱుంగుఁ దీవియలనుండి విదర్చిన పూవుప్రోవుల సెజ్జలఁబఱచి కమ్మని సువాసనల వెదఁజల్లుచుండెను. వికసితసుమరసాస్వాదనంబునఁ గసిమసఁగి తేఁటియిల్లాండ్రు మిండుతుమ్మెద పదువులం గలసి విలాసముగఁ బాటలుపాడుచుండెను. వీని నన్నిటిం గాంచి యచ్చటఁ గొంతతడవు నిలువవలెనని యాముద్దియలకు బుద్ధిపొడమి చెలిమికత్తియలను విద్యుత్ప్రభయుంగూడి పూవులఁగోసికొనుచుఁ గొంతసేపు, పూవుసెజ్జల విశ్రమించుచుఁ గొంతతడవును కమ్మతావులం జిమ్మెడు క్రొమ్మావిగున్నలచాటున దావులమూఁతలాడికొనుచుఁ గొంతప్రొద్దునుఁ బుచ్చుచుఁ గోరయుందిడి కాచఁబడిన క్షీరములవలెఁ దమలోఁదా మిముడనేరక సంతసంబున నోలలాడుచుండిరి. ఈయుత్సాహపరవశమున వారింటిమాటయు మఱచిరి.

కొంతకాలమున కాటలు సాలించి గృహమునకేగిరి. అప్పుడేమి చెప్పవలె నాసవతితల్లి యాగ్రహము! ఆమెకన్నులెఱ్ఱజేయుచు నేత్రాంచలముల నగ్నికణములురల నాఁడుసింగము భాతి విద్యుత్ప్రభపయి కుఱుకుచు 'ఏలయింతతడసితివి? ఇప్పుడే నీకింతకండకావరమా?'యని యనేక విధముల నాపడుచును బెదరింపసాగెను. ఒడలెఱుఁగనియాగ్రహమున నాచిన్నదానిని దండించుటయగాక తనమగఁడింటికి రాగానే

యీసంగతిని గోరంతను గొండంతగఁ బెంచి యాయనతోడ నంటించెను. క్రూరురాలయిన సవతితల్లిచేతనున్న బిడ్డస్థితి కష్టముగదా! ఆపడుచు తడయుటకుఁ గారణమెఱిఁగినవాఁడౌటఁ గూఁతుపయి నాయన కోపపడక భార్యనే కొంచెము మందలించెను. అందుమీఁదఁ బెనిమిటియనియైన నెంచక మగని నెన్నియో యనరాని పలుకులుపలికి మగనిఁగొట్టి మొగసాలకెక్కెనన్నట్లు మూతిముడుచుకొని గదిలోఁ దలుపుబిగించుకొని పరుండియుండెను. తిరిగి యామెకోపముబాపి శాంతచిత్తనుచేయుటకు ధీరసింగునకుఁ గృత్యాద్యవస్థయయ్యెను.

ఆపడుచు దురదృష్టదేవత యామెకు మఱియొకయాపదఁ దెచ్చిపెట్ట సిద్ధమయ్యెను. చిత్తూరునగరమున రాణాకుబహిఃప్రాణమగు మిత్రుఁడొకండు గలఁడు. అతనిపేరు భూతివర్మ. అతండదివఱకు రెండువివాహములు చేసికొనియున్నను దైవయోగమున నా రెండును నిరర్థకములయ్యెను. ఆయన కేబది సంవత్సరములు దాఁటి యఱువదిబడిలోపడెను. అంతవయసు చెల్లినవాఁడయినను తిరిగి వివాహమాడవలయుననుబుద్ధి యాతనికుదయించెను. ధనమదాంధులు యుక్తాయుక్తవివేచనము సేయఁజాలరుగదా ?

మనుజులకు ధనబలము, అధికారబలము, శరీరబలమని మూఁడువిధములగు శక్తులుగలవు. దీనిలో నేదియైన నొకటి యుండినను వారలనుబట్టఁ బగ్గములుండవు. ఈమూఁడు నొకచోటన యుండిన నిఁకఁ జెప్పవలయునదేమి ? ఈగుణములుగలవాఁడు దుర్మార్గుఁడుకూడనయ్యెనేని లోకము భరించునా ?

అయినను వారల ననవలసినదేమున్నది ? వయసుచెల్లిన పురుషులు వివాహమాడుటయె మొదటితప్పు. అంతవయసుమీఱిన వారలకుఁ జిఱుతప్రాయంపుఁగన్నెలనిచ్చి వివాహముసేయు తల్లిదండ్రులది రెండవతప్పు. వీరును ధనాపేక్షచేతనో, అధికారులదయను సంపాదించుకొనవలయుననియో, తమపిల్లల ముసలివారల కొసఁగఁజూతురు. ముందుఁ దమనందనలు పడుపాట్ల నెంతమాత్రమును విచారింపరు. కొందఱు తాము వివాహమాడఁదలఁచినపుడు తమపసియాఁడుబిడ్డలను నయితము ముదుసలివారలకొసఁగి బదులునకు బదులు వారి పిల్లనుఁ దాము గ్రహించుట లోకమునఁ జూచుచున్నాము. లోకముతోఁటి బాటు నీభూతివర్మయుఁ గన్యాన్వేషణమునకయి కొందఱు విప్రుల ననేకస్థలముల కనిపెను. అందొక బ్రాహ్మణుఁడు ధీరసింగు గృహంబునకు విచ్చేసెను. వచ్చిన యాభూదేవుని నాతఁడు బహువిధముల సన్మానించెను. సాయంతనము భోజనమయినపిదప బయలి యఱుగులకయి నుభయులుఁ గూర్చుండి పాఱుఁడునుఁ దాను నిట్లు మాటలాడఁ దొడఁగిరి.

ధీర-స్వామీ! తమ దే దేశము? ఏమిపనిమీఁద నిందు విచ్చేసితిరి ?

బ్రాహ్మ - మాది చిత్తూరు. నేను భూతివర్మ యాశ్రితుఁడను. భూతివర్మగారినిఁ దమ రెఱిఁగియేయుందురు. వారు చిత్తూరురాణాకు ముఖ్యుఁడును నాంతరంగికుఁడగు చెలిమికాఁడు. వారు పంప నే నిందు విచ్చేసితిని.

ధీర - అటులయిన నేఁ గృతార్థుఁడను. భూతివర్మగారు నాకు శ్రుతపరిచయులు కాని ముఖాముఖి నెన్నఁడును వారిం దర్శించుట దటస్థించలేదు. వారు బహుయోగ్యులు మహోపకారులని మాత్రము విని యున్నాను.

బ్రాహ్మ - వారికీ నడుమ గొప్ప దురవస్థ సంభవించినది. ద్వితీయ భార్యావియోగము గలిగినది. ఈవ్యసనముచేత వారికి లోకవ్యవహారములయందు విరక్తి పొడమెను. వారి స్నేహితులందఱు వారి మనోవ్యథనుఁ దొలఁగింప నెంచి, యందునకుఁ దగినయుపాయము వెదకి 'భార్యామూలమిదం గృహ' మను న్యాయమున వారిం దిరుగఁ బాణిగ్రహణము చేసికొనుఁడని ప్రోత్సహించుటతప్ప మఱి యొక యుపాయము లేదని నిశ్చయించుకొనిరి. సమయముచిక్కినపుడెల్ల వా రాలాగున వారికి బోధింపసాగిరి. ఆయన నిట్లు ప్రేరేపించువారలలోఁ బ్రభువు ముఖ్యుఁడు. ఇందఱేకకంఠ్యముగ బోధింప వారెట్టకేలకుఁ బెండిలిచేసికొనుట కియ్యకొనిరి. కన్యార్థము, నేనిట్లు బయలుదేరితిని. ఎందఱెందఱో కన్నియల నిచ్చెదమని వచ్చుచున్నను, తమ తావున బాలిక యున్నదని విని మీతోడ సంబంధము సేయఁగోరి నన్నిటకుఁ బుత్తెంచిరి. ఈ సంబంధము లెస్సయని నే ననుకొనియెద. మీ యభిప్రాయ మేమి?

ధీర - భూతివర్మగారి బాంధవ్యము కోరఁదగినదియ ; ఇందు నేను స్వతంత్రించి బదులుచెప్ప శక్తుఁడను గాను గదా? నా కొమరిత యభిప్రాయమెఱింగినం గాని నేనేమాట

చెప్పుటయు ధర్మముగాదు. ఆపడుచును బుద్ధిమతి, పసిది గాదు. తాము మఱియొక పరి దయచేసినయెడ నన్ని సంగ తులు మనవిచేసెదను.

బ్రాహ్మ - రెండువివాహము లీవఱకె యయినవని చెప్పుటచే భూతివర్మ ప్రాయముమీఱినవాఁ డని యొకవేళ మీరు సంశయ పడవచ్చును. ఆయన కిప్పు డేబది సంవత్స రము లుండియు నుండక ; అంతియ ; సంపదగలవాఁడు. రా నాకు ముఖ్యముగఁ గావలసినవాఁడు. బంధువత్సలత మెండుగఁ గలవాఁడు. ఇవన్నియు మీరాలోచింపవలయును. తమ కింకొక రహస్యము చెప్పెదను. మీరు పెద్దలనాఁటనుండియుఁ గలవారని వాడుక కలదు. ఇటీవలఁ దామొనర్చిన వ్యాపారపుఁ బెగువలలోఁ దమకుఁ గలసిరాక ఋణబాధ కొంత గలిగిన దని విని తమకుఁ జేతనయినంతవఱకు సాయపడుటకు సిద్ధముగ నున్నాఁడు. తామీ సంగతులన్నియుఁ జక్కఁగ యోజించి మీకొమార్తెకును జెప్పవలసిన మాటలం జెప్పి యామె యభిప్రాయముకూడఁ గనుగొనుఁడు. నేను మఱియొక పర్యా య మేతెంచి మిముం గలిసికొనియెదను.

అని ధీరసింగును పేడ్కొని యా విప్రుఁడు చిత్తూరు నకుం జనియెను. బ్రాహ్మణ ధీరసింగు లిట్లు ప్రసంగించు చుండ విద్యుత్ప్రభ ప్రక్కగదిలోనుండి వారి సంభాషణ మామూలాగ్రముగ వినుచుండెను. తండ్రివలనఁ దానన్ని సంగతులు విననగలుగుదునని యాకన్నియ తన పనిమీఁదఁ దానుండెను. ఆయనయు నీవిషయమయి యప్పుడామెతో

నేమియుఁ బ్రస్తావము చేయలేదు. ఆనాఁడు రాత్రి భోజన మయిన పిదప ధీరసింగు కూఁతు నొంటరిగఁ బిలిచి యిట్లు పలికెను.

అమ్మా నేఁడుదయమున నీతో నొక సంగతి మాట లాడవలెనని యుంటిని. నీ వప్పు డేదో పనిమీఁదనుండుట చూచి యావల మాటలాడవచ్చునని యనుకొంటిని ; కాని, నా పనితొందరవలన సందర్భపడలేదు.

విద్యు - నాయనా ! ఏవిషయమయి ?

ధీర - నేఁ డుదయమున మనయింటికి విచ్చేసియున్న బ్రాహ్మణునిఁ జూచితివిగదా ?

విద్యు - చూచితిని. ఆయనయెవరు? మనగృహంబున కేల వచ్చియున్నవాఁడు. నే నప్పు డీ సంగతి మిమ్మడుగఁ దలఁచితిని గాని యిరువురు మాటలాడునపు డొరు లచ్చటికిఁ బోఁగూడదు గనుక నే నట్లు చేయలేదు. అటుల నొన ర్చుట మిమ్ముఁ దొందరపెట్టుటయ కదా ? ఎవ రాయన ?

ధీర - అమ్మా ! మనదేశపు రాణా కాప్తుండగు భూతి వర్మవద్దనుండి వచ్చినవాఁడు. భూతివర్మ నిన్నుఁ దన కిచ్చి పరి ణయము సేయుమని వర్తమానము పంపినాఁడు. ఈతండు నిన్నడుగవచ్చినాఁడు.

విద్యు - అందునకా యీ విప్రోత్తముఁ డిందు విచ్చేసి నది ! భూతివర్మ కిది ప్రథమ వివాహమా ?

ధీర - ప్రియసుతా ! ఆయన కిప్పు డగునెడల మూఁడవ వివాహము. దురదృష్టమున నిద్ద ఱాండ్రు నిదివఱకే కోలు

పోయి యున్నవాఁడు. ధనముకలవాఁడుమాత్రమే మాను. నే నది యెఱుంగుదును.

విద్యు - ఇదివఱకే రెండు వివాహములయి యిద్దఱు భార్యలను మింగికొనినవాఁడని వచించితిరి. ఆయన కెంత వయ సుండవచ్చును ?

ధీర - కొంచెము పెద్దవాఁడే ! ఏబదేడు లుండవచ్చునని తోఁచుచున్నది. బ్రాహ్మణుఁడు నల్లె వచించినాఁడు.

విద్యు - నాయనా ! ఇంక నాతనికి వివాహ మెందులకు ? భూతివర్మ కాప్తుఁడయిన యీబ్రాహ్మణుఁడే యాతని కేబదేడు లున్నవని పలికెను గదా ? ఆయన కంతకంటె నెక్కువ వయసుండుట నిక్కువము. మీ రేమి బదులు చెప్పితిరి ?

ధీర - నిన్నాలోచించనిదే నేనేమి చెప్పుదును? అందును నిది పరిణయవిషయము, నూరేండ్లవంట వేయేండ్ల సంగ్రహమన్నారు. సుఖమయినను గష్టమయినను ననుభవింపవలసినదానవు నీవు. స్వతంత్రించి నే నేమియు నాతనికి బదులు చెప్పలేదు. ఆలోచించి చెప్పెదనని తెలిపి యా విప్రునిం బంపివేసితిని. నీకును యుక్తవయసు వచ్చినది. వివాహము సేయవలసిన సమయమే యిది. తల్లిలేని పిల్లవుగానఁ దగినస్థలము విచారించి మఱియొకవలయునని నా నిశ్చయము. ఇటువంటిసంబంధమున కొప్పుకొందునటమ్మా ?

విద్యు - ఇట్టికార్యములం జక్కఁగ విచారించక చేయనగునా ? ద్రవ్యమున కాసపడి తెలిసితెలిసి తమబిడ్డలను

వృద్ధులకొసంగు వల్లడికాండ్రగు తల్లిదండ్రులవలెఁగాక దూరమాలోచించి తగినయుత్తర మొసంగితిరి. ధనాశ వినాశహేతువు. ధనము శాశ్వతముగాదు. అది యకాలమేఘము వంటిది. నిముసమున వచ్చును, నిముసమునఁబోవును ఈ ప్రాయమువాని నెవరు వరించెదరు ? మీ కెచ్చోటనయిన నాకుం దగు వరుఁడు లభించిన సరియ. లేనియెడల నేనీ కన్యాత్వముంద నా జీవితకాలమును గడపెదను. ఈ సంబంధమునకు మాత్రము మీ రంగీకరింపఁబోకుఁడు.

ధీర - అట్లేల చేసెదనమ్మా ? ధనమున కాసపడి చూచిచూచి నిన్నసౌఖ్యములపాలు సేతునని యనుకొంటివటమ్మా ? ఇటులఁ దండ్రి, కూఁతు నూరడించి కన్నుల నీరు వెట్టుకొనుచుఁ గూఁతుఁగౌఁగిలించికొని కడుంగడు ప్రేమతో నాశ్వాసించెను. ఈ సంగతి యెట్లో జిత్తులమారి యగుసవతి తల్లి చెవింబడెను. ఈ సంబంధమువలనఁ దనకు ఋణబాధానివృత్తి యవునుగదాయని తలంచి, ద్రవ్యాపేక్ష నా పడుచును భూతివర్మకే యెట్లయిన నిప్పింపవలయునని నిశ్చయించుకొని, యా సవతితల్లి, తనమగనితో సమయము చిక్కినపుడెల్లఁబిల్ల నాతని కిమ్మని చెవి నిల్లుకట్టుకొని పోరాడుచుండెను. లోభికిఁ బ్రాణముకంటె ధనమే యధికముగదా !

కొన్నిదినము లయినపిమ్మట, వెనుకటి బ్రాహ్మణుఁడు మరలఁ జనుదెంచెను. ధీరసింగాయనను సన్మానించి, కుశలంబడిగిన తర్వాత, బ్రాహ్మణుఁడును వీరి యోగక్షేమ మడిగి, మరల వివాహవిషయమయి ప్రస్తావముచేసెను.

మా కన్నియ వివాహము విషయమయి నే నిప్పు డేమియుఁ జెప్పవలనులేదు. 'నీ సుత కిప్పుడేమి యీడు మించెను? కొలఁదికాలము వివాహ మాపఁగూడదా' యని నా బంధుగు లనుచున్నవారు. మేసరికముగూడ నున్నది. గాన వివాహమే ప్రస్తుతము నిలిపితిని. భూతివర్మగారి సంబంధము మాయట్టివారల కబ్బునా? వారివివాహమున కేమి? ఎవ్వరయిన నాతనిఁ గన్నులఁగప్పికొనియెదరు" అని కొన్నికల్లబొల్లి కబురులు చెప్పి ధీరసిం గూరకుండెను.

ధీరసింగుపలుకులకు బ్రాహ్మణుఁడు నిరుత్సాహుఁ డయి మనసు చిన్నబుచ్చికొని చివాలున లేచిపోవుచుండెను. అట్లాతఁ డేగుచుండ నొకబాలుఁ డెచటినుండియో పరుగు పరుగునవచ్చి యీవిప్రునిచేత నొకయుత్తర ముంచెను. ఆ యుత్తరము చదివికొని తలయూచి బ్రాహ్మణుఁ డెద్దియో యోజించుకొనుచుఁ గదలిపోయెను.

ఇదంతయుఁ దనవిషయమయిన నాటకముగనుక నతి శ్రద్ధచే నాపడుచు నడచినదంతయుఁ గనిపెట్టుచుండెను. తొలి దినము బ్రాహ్మణున కుత్తరమిచ్చిన బాలకుఁడు మఱునాఁ డుదయమున నేతెంచి సవతితల్లితో నెద్దియో కొంతరహస్యముగ ముచ్చటించుటకూడ నాచిన్నది కనిపెట్టెను. అందుపయిన నెద్దియోకుట్ర జరుగుచున్నదని విద్యుత్ప్రభ మనంబునకుఁ దట్టెను. అబ్బాలుండు మొదట బ్రాహ్మణున కుత్తరమొసంగుటయు, మఱలఁజనుదెంచి యాతఁడే సవతితల్లితోడ రహస్యములాడుటయు విచారింప, నది తన వివాహవిషయమగు

కుట్రయేయని యాపడుచునకు దృఢమయ్యెను. జాగరూకులయిన నిపుణులు పరిచ్ఛిద్రములను సులభముగఁ గనిపెట్టుదురుగదా! తండ్రి కిష్టములేకపోవుటయు, సవతితల్లి కిష్టమున్నట్లు గానుపించుటయుం గనిపెట్టి బ్రాహ్మణుఁడబ్బాలుని సహాయమున సవతితల్లితోడఁ దగినకట్టుదిట్టములఁ జేసికొనెను. అందువలనఁ దనమనంబునఁ జిచ్చుపెట్టినట్లయి యేమియుం దోఁచక, చింతాపరీతచిత్తయయి విద్యుత్ప్రభ పరితపించుచుండెను. ఆవ్యసనమును భరింపఁజాలకపోయెను. తన్నెట్లో తనసవతితల్లి మోసముచేయకమానదని యెంచెను. ఏమాయోపాయముననో తన్నామసలివాని కంటఁగట్టుట నిశ్చయమని రూఢిచేసికొనెను.

దుష్టచరితలు లోభముచే నేమిచేయఁజాలరు? ఇట్టి చింత తనమనంబు నాక్రమించుటంజేసి మతిచెడి, యామె జీవముపయి నాసకూడ వదలెను. తన కసౌఖ్యముగలిగినందున కాచిన్నది చింతపడలేదు. తగినవరుఁడు లభింపలేదనియువ్యసనపడలేదు. కాని తనవలనఁ దనజనకున కింతకష్టము గలిగెనుగదాయనిమాత్ర మాపడుచునుల్లము తల్లడిల్లఁజొచ్చెను. ఏలయన, సవతితల్లి తన్ను భూతివర్మకే యొసఁగుమని మగనిని సదా నిర్బంధపెట్టుటయుఁ దండ్రి యందున కియ్యకొనకపోవుటయుఁ గలిగెను. దినదినము వారిపోరాట మభివృద్ధిఁ బొందసాగెను. పరులనుఁ దన్నుఁగూడ నిన్నియిడుమలపాలు సేయందగు కన్యాజన్మము నిందనీయముగదా!

ఇన్ని కష్టములకు లోనయి విద్యుత్ప్రభ దుఃఖమును భరింపఁజాలక తుదకుఁ బ్రాణమునకుఁదెగించి యేమిచేసెనో చదువరు లెఱింగియే యున్నారు. వ్యసనము మనుజుల నేమి చేయఁజాలదు ?

---:o:---

# ౧౭వ భాగము.

---(o)---

"ఆహా! ఈకుసుమకోమలి కెన్నెన్నిదొసఁగులుపొసఁగి యున్నవి ! ఈయాపత్సముద్రమునఁబడియు గుండెనిబ్బరము చేసికొని యెట్లో కష్టతరంగములనీఁదుకొనుచుఁ గాలముగడపు చున్నది. అచ్చట సవతితల్లిపోరుపడఁజాలక ప్రాణమునకుం గూడఁ దెంపుఁజేసియుండెను. అట్లెలజగుగును. ఆమె తెంపు ఫలించినయెడ నీకష్టములన్నియు ననుభవించువా రెవరు ? కాదుకాదు! ఈచిన్నదెద్దియో యొకమహాదశ ననుభవింపఁ బుట్టియున్నది. ఇప్పుడిచ్చటికి వచ్చియున్న మాయావియగు స్థవిరుఁ డీపె కెక్కడదాఁపరించెను! ఆతని యరగొడ్డియములఁ దప్పించుకొనుట కొకవత్సరకాలము వ్యవధిపొందియున్నది. ఇదియు నొకసరియయిన యుపాయము! ఎవ్విధముచేతనయిన నీచేడియకుఁ దోడుపడవలయును" అని నిశ్చయించుకొని యరి భీమణుఁడు విద్యుత్ప్రభ కిట్లనియె.

చెలీ! నీవావృద్ధున కొకగడువు నియమించి వాని దురుద్యోగమును భంగపరచితివి. ఇదియ సరియయినమార్గము.

నీ వేర్పరచికొనిన నియమితకాలముననే నీకు భగవంతుఁడు బాధ విమోచనము చేయునుగాక.

విద్యు:- నేనేర్పరచికొనిన వత్సరకాలమంతయు నింక ముందుజరుగవలసియేయున్నది. అనుకూలవిధి మిమ్మిప్పు డిందుఁదెచ్చివిడిచెను. అదృష్టకాల మేతెంచినపుడు ఫలంబు తనంత తాను లభించునుగదా! నాచేసిన వ్రతము ఫలకారి యయినది. ఇఁక నేనాపదలఁ దరింపఁగలను.

అరి:- చెలీ! నీయుదంత మత్యంత విచారకరముగ నున్నది. నీదుస్థితి కేరుజాలిపడక యుండఁగలరు? భగవంతుని కృపాజలమున నీకష్టపంకము శీఘ్రకాలమునఁ గడుగఁబడును గాక! చెలీ! నీకిందలిగోప్యము లెవ్వియయినఁ దెలియునా?

విద్యు:- ఇందలి విషయములు నాకంతవివరముగఁ దెలియవు. కాని నాకొకయనుమానము మాత్రము కలదు. జాలావధానుల నడతఁ జక్కఁగఁ గనిపెట్టుచుంటిని. నేఁడు మిమ్ముం గొనివచ్చినట్లు లప్పుడప్పు డొందఱినో గొనివచ్చి యున్నవాఁడు. ఈ సౌధమునుండి నేఁ బ్రతివిషయమును గనిపెట్టుచుంటిని. ఆయన వెంటఁబెట్టుకొనివచ్చినవా రింటం బ్రవేశించుటమాత్రము చూచుచుంటిమి. కాని తిరుగ వెలికేగుట నేను చూచుటలేదు. అందువలన నిచ్చట నెద్దియో మోసము గలదను నూహపొడముచున్నది. క్రొత్తవారల నిందుఁ దెచ్చిన దినమున వారి నీ జాలావధాను లతిగౌరవమున నాదరించుచుండును. కొందఱినిం బ్రతిమాలియుఁ గొందఱ బెదరించియుఁ గొందఱ నుత్కోచముల నొసంగియు నొకటి రెండు

దినము లిందు నిలుపుచుందును. అతఁడు బహాదుర్గ్సాస్సుఁడని నాకుఁ దోఁచుచున్నది.

అరి - వీ రెవ్వ రిక్కడిందుఁ గానఁబడరు. ఎందేగి యుందురు ?

విద్యు - వీరందఱిప్పుడు నిదురించుచుందురు. తెలచుగ నిది వారలకు నిదురించుసమయము. జాలావధానులు తిరిగి నిదుర లేచు సమయమగుచున్నది. అతండెద్దియైన నుబుసుపోక మీతోడ సంభాషించ వచ్చును. మీ రిందుఁ దడయుట మంచిదిగాదు. మన మిందున్నట్లు వారలకుఁ దెలిసిన మోసం బు వాటిల్లు. మీరిందు నిలువకుఁడు. మీరు సురక్షితముగనున్న నా కంతియచాలును.

అరి - "నన్ను గుఱించి నీవింత భయంపడ నవసరము లేదు. ఎటులయిన నీకుఁ దోడ్పడఁగలిగితినేని యదియ నాకుఁ బదివేలు! అయినను నేఁ జేయవలయున దెంతయో గలదు. అచటికే వెళ్ళెదను. నీవుమాత్రి మెల్లుచేయవలెను" అని యా మగువకు రహస్యముగ నెద్దియో చెప్పి వచ్చినతోవనుఁ బయలుదేరెను.

అప్పటికిఁ బగ లొంటిగంటయయ్యెను. పోవుచుమార్గ మున నరిభీమణుఁ డిట్లు తనలోఁదా వితర్కించుకొనఁజొచ్చెను. "ఇప్పటికి నాయూహయే నిజమయ్యెను. ఆబ్రాహ్మణుఁ డెంతకైన సాహసుఁడు. ఈ జాలావధాను లాంతరికబంధువు వలె మాటలాడి యెందఱ నిట్లుమోసగించెనో ! ఆప్తునివలె మోసములాడిన నెవరు నమ్మరు? ఈతఁడు మున్ను మోసగించి

తోడికొని వచ్చిన కామయ్యగతి యేమయ్యెనో నే నెఱ్ఱు
ఉంగఁగలను.

అని విచారించుచు "జాలావధానులు మొదట నన్నుం
చిన స్థలమునకు మరలఁ జేరెదులోఁగా నేనచట నిలువవలె
ను" అని యానేలమాలెదారిని మంటపముదగ్గఱగా
మొదటఁ దాఁజనుదెంచిన మార్గమునఁ దనపడకటింటికి వచ్చి
చేరి మునుపటివలె మంచముపయి శయనించియుండెను.

ఇంతలో నవధానులవారు కన్నులుఁనలుపుకొనుచు నరి
భీమణుఁడున్న గదిలోని కేతెంచెను. అరిభీమణుఁడును నెదురుగ
రాఁగా వారిరువురు నేలపయిఁ బఱచియున్న రత్నకంబళము
మీఁదఁ గూర్చుండిరి.

అరి - అవధానులవారు పోయి చాలసేపయినది. నిదు
రించుచుంటిరి గాఁబోలు ?

జాలా - అవును మార్గాయాసమునం బడలితిని. ఎండ
వేళగనుక పరుండఁగనే నిదురపట్టెను. మీరు సౌఖ్యముగ నిదు
రించితిరా ?

అరి - నాకును నిచట సౌఖ్యముగనున్నది. నిదుర బా
గుగవచ్చినది. నాకెన్నఁ డింతసుఖనిద్ర గలుగలేదుసుమండీ.
ఇఁక నేఁ బయనమయ్యెదను. నాకు సెలవిండు.

జాలా- ఎండచల్లపడువఱకుండి పోదురులెండి. ఇంకను
చాలపొద్దున్నది. కాకపోయిన నుదయమున వెళ్ళవచ్చును.
మీకుఁ జదరంగ మేమయిన తెలియునా ?

అనుచు జాలావధానులు గోడయలమారలోని పేటికలో నున్న చదరంగపాళియఁ దెచ్చి, యరిభీమణునిముం దిడెను. చదరంగమునం దరిభీమణుఁ డాతితేటినవాఁ డాటచే నాపాళిఁ జూడగనే యభిముఖుఁడయి యాయాటయందలి దనకుఁగల యభిరుచిని వెల్లడిచేసెను. రోగియు, వైద్యుఁడునుఁగూడ క్షీరమునే గోరెననున ట్లుభయు లాయాటయం దెట్లయిన నాదినమును గడుపవలయుననియ కోరిరి. ఇద్దఱునుఁ దాముబూనిన కార్యము నెట్లయిన నెరవేర్చుకొనవలెనని యాశని కుతకౌ్రుంచిరి.

జాలావధానులు తానరిభీమణునిమోసగించఁ గలిగితినిగదా యని యుప్పొంగుచుండెను. అరిభీమణుఁడును సకలజనవంచకుండగు నావంచకుని వంచింప నదను కుదిరినయదిగదాయని ముదమందుచుండెను. ముందు జలావధాను లాట యారంభించి పెదాలను రెంటిని నడపెను. వానికెదురెత్తుగా నరిభీమణుఁడు రెండింటిని దనవైపునుండి ముందుకు నడపెను. పగలు మూఁడుగంటలనుండి నాలుగుగంటలవఱకు నయ్యాటయాడిన పిదప నాట ముగియకపోయినను జాలావధానులయెత్తులకంటె నరిభీమణునియెత్తులు పైయెత్తులాయెను. ఆట ముగించువఱకు నిలువఁగూడదని యిరువురకు నాతురత గలిగెను. కాని జాలావధాను లంతట నాట చాలించి రాత్రిభోజనమయిన పిమ్మట ముగింతము లెండని యనెను. అంతట నాట నిలిపి వారిద్దఱు లోనికిం జనిరి.

# ౧౭ వ భాగము

దివస్పతి పగలంతయుఁ దనవీరరసముం జూపి విక్రమించిన పిదప, నంధకారసీమంతినీపాత్రప్రవేశమునకయి కాలసూత్రధారుఁడు నింగియను రంగస్థలమున సింగారించిన తిరస్కరిణిభంగి నాకసంబున సంజకెంజాయ వ్యాపించియుండెను. సమయమను కాంతారదంతావలంబునుఁ బట్టం దలంచి, మచ్చుఁజల్లుటకయి క్రొమ్మావిచివురుజొంపమునం గల్పించిన కందుకంబుభాతి వేఁడివేల్పపరాద్రిపయిం జూపట్టెను. పెనిమిటి ప్రవాసియయియున్నతఱి వికసింపని పతివ్రతాశిరోమణుల మనఃపద్మములట్ల కమలంబులు ముకుళింపఁ జొచ్చెను.

పవలు, తలసూపవెఱచి, రేల నోరులకంటంబడకుండ దుర్మార్గులొనర్చు దోషకృత్యములం గనుగొని నివారింపఁ బూనిన యరిభీషణునకుఁ దోడుసూపనెంచి కాఁబోలు, ఇనుం డస్తమించెను. రాష్ట్రప్రజనులమది నావరించిన తుందుడుకులయించి, వారలయుల్లములు చల్లఁబడు సమయ మాసన్నమయినదని వెల్లాటకము సేయుటకో యన భూమండలమంతయుఁ దనచండకిరణముల బెండువడఁజేసిన చండభానుం డస్తమించిన పిదప శాంతమగునిశాకాంత ప్రవేశించుచుండెను. మ్రుక్కిడి తెక్కలికాండ్రదాడిని ముక్కొనుదండునాబరగుఁ జిమ్మచీఁకటి దిగంతంబులఁ గ్రమ్ముకొనెను.

రాత్రి భోజనానంతర మరిభీషణ జాలావధానులు శయ్యాగృహంబున కరుదెంచి, కొలదికాలము చదరంగ పాళెయొద్దఁ గూరుచుండి, యాడి, చాలించిరి. అంత జాలావధాను లరిభీషణుని వీడ్కొని తన తోఁవం బోయెను. అరిభీషణుఁడునుఁ దన తల్పమున నేకతంబ కుపవిష్ఠించి, యిట్లు విచారించెను.

"ఇప్పటికిఁ బొద్దు గ్రుంకినది. నేను నేఁజేయఁదలఁచిన దంతయు స్వల్పావశిష్టముగ ముగిసెను. ఆహా! వికచారవిందానన యగు నక్కుసుమకోమలి యుదంతంబు వినినది మొదలు నామనం బెచ్చటను లేనిజాలికిఁ దావలమయినది. శిరీషకుసుమ సుకుమారాంగియగా నాసతి యియ్యెదుముల నెట్లు భరించెనో! ఇన్ని విధివైపరీత్యముల సహించి ప్రాణత్యాగము సేయఁ బూనియు నట్లు చేయక ధైర్య మవలంబించి, తన యుద్యమంబు నుజ్జగించుట నాయదృష్టమహిమయ కాని మఱియొకటి కాదు. అచ్చెలి నెట్లీబంధమునుండి తప్పింపనగు.

అరిభీషణుఁ డిట్లంగి నాలోచనా నిమగ్నమానసుండయి యుండ, నెచటినుండియో పాము బుసనుం బోలు నుచ్ఛ్వాసనిశ్వాసారావ మతనికి వినవచ్చెను. అది యేమి యని యాతఁడు నలుదెసలం బరికించుచుండఁ, గారుమొగులులవలె నల్లని శరీరము నేడడుగుల పొడవును, బొడవునకుం దగిన యొడ్డునుం గల వికృతాకారుఁ డొకఁ డాగది గోడప్రక్కనుండి యరిభీషణుని ప్రక్కకు వచ్చుచుండెను.

మినుకు మినుకుమను నల్పకాంతిగల దీపపు వెలుతురున నీమనుజుని వికృతరూపము మఱింత భయమును గొల్పు చుండెను. వాని కుడిచేత నొక గండ గొడ్డలియు నెడమచేత నొక నిడుపాటి ఖడ్గమును గలవు. అయ్యుదయమున నేల మాలె మంటపమందు నిదురించుచుండ నరిభీమణుడుగాంచి వచ్చిన దీమొక్కలీనినె !

అరిభీమణుఁ డా దుష్టుం గాంచినతోడనే యొఱనుండి సరగునఁ దన కరవాలంబు వెలికి "ఎవఁడవు నీవు"? అని భూసంతాపకరంబయి, యంత్యకాలమేఘగర్జాతుల్యంబగు గంభీరనిస్వనమున నడిగెను. అందున కాతఁ డేమియు బదులు పలుకక చెక్కిన శిలాస్తంభమువలె నిలువఁబడెను. "చెప్పు వేమి ? చెప్పెదవా లేదా ? చెప్పకున్న నీశిరం బీ భూమికిం బలియైనదని తెలిసికొనుము" అని గద్దించుచుఁ గరవాలంబుఁ బయికెత్తెను. పిన్నవాఁడయినను, నరిభీమణుని గంభీర వాక్ప టిమ మాతనికి దిగులొదవంజేసి వాని నిశ్చేష్టితుం గావిం చెను. క్షుద్రు లెంతబలవంతులయినను ధైర్యసాహస మన స్థైర్యములు గలవారియెడ వారిబల మేమి పనికివచ్చును? సింహకిశోరము పసిది యని మదగజ మెదురింపఁ గలుగునా ? కొంతతడవున కాతఁడు స్మృతి తెచ్చికొని గద్గదస్వరమున నీవు నాతోడ రావలయునని యనియెను.

అరి - నీతోడరావలయునా ? పోదము నడు.

మను - నీవు ముందు పద.

అరి - మాయమాటాటక నోరుమూసికొని నీవు ముందు నడువుము.

మను - చిత్తము. అలాగుననే ముందుపోయెదను.

అని, ప్రాణభీతిచే నరిభీషణుం డెట్లు చెప్పిన నట్లు తాం త్రికుని చేతిబొమ్మవలె నాడుచు, నేలసొరంగపు మార్గమున ముందునడువఁ జొచ్చెను. వెలికిదూసినఖడ్గ మొఱలో వేయక వానివెంటన యరిభీషణుఁడు వెంబడించి యేగుచుండెను. ఇటుల వా రిరువురును నడచి వెనుకఁజెప్పఁబడిన మంటప మును సమీపించుచుండిరి. ఆ మంటపము నాలుగువయిపు లను ద్వారములుగలదియగుటచే, దానిదాఁటునపుడు ముందు వాఁడు వెనుక, వెనుకవాఁడుముందుఁ గావచ్చును. ఆమనుజున కీ సంగతి తెలియును. అరిభీషణుఁడు తన్ను ముందు నడువు మనినపుడు వల్లెయని వాఁడొప్పుకొనెను. మోసగించ వలయునని యే యిట్లు వచించియుండును. అరిభీషణుఁడును దీనిని ముందే యెఱింగియున్నవాఁడు గాన నా ప్రదేశము నకు రాఁగానే తా నామనుజున కవకాశ మొదవకుండ నాతని నావలకుం దరిమి వాని దురుద్దేశమునకు భంగమునొందించెను.

దేవళముసమీపించి యరిభీషణుఁ డాతని యాయుధము దిగువనుంచుమని ఖండితముగ వచించెను. ఆయననోట నీ వచనము వెడలఁగనే యామనుజునిధైర్యముతో, నతనిచేతి పరశ్వధమునుం జారిపోయెను. రహస్యవర్తనమును, దోష బుద్ధియుఁ గలనీచులు భయమువలనఁ దమంతఁదాము బయలు పడుదురుగదా ? పిదప “ నీ వెవరవు ? నీవృత్తాంతము సాకల్య

ముగ నొందువుము " అని యరిభీముఁ డాతని నడిగెను.

మను - నే నీదూరుగ్రామవాసిని. భిల్లుఁడను. నా పేరు రక్తాక్షుఁడందురు. ఈ రాజపుత్రులు క్రమక్రమముగ మా జాతి వారలయెడల నతికాఠిన్యమువహించి వారల గడునిడుములఁ గుడుపసాగిరి. తత్కారణమువలనఁ గొందఱుభిల్లు లచ్చటనిలువ లేక పరదేశములకుఁజని కాలముపుచ్చుచుండిరి. అట్లరుదెంచినవారలలో నే నొకఁడను. నే నీదేశమునకు వచ్చినపుడు క్రొత్తవాఁడనౌట జీవనముజరుగక కష్టపడుచుంటిని. ఆసమయమున నన్నొకరాజపుత్రపిరుఁడు దగ్గఱదీసి నాకన్న వస్త్రములనొసంగెను. ఆతండ నన్నప్పటినుండి సాకుచున్నాఁడు. కొలఁది కాలము క్రిందటివఱకు వారిపోషణలో నే యున్నాను. వారిసంరక్షణయం దుండుటచేత వారు నియమించిన పనులు సేయవలసివచ్చెను. నాయజమానుఁ డీయమ్మను బూజచేయువాఁడు. దేవీప్రీత్యర్థ మప్పుడప్పు డాతండు నరబలుల నిచ్చుచున్నాఁడు. దురదృష్టుఁడగు నరుఁడెవ్వఁడయిన దొఱకునేని వాని నిందుఁగొనివచ్చి యీయింట నుంచుదురు. అట్లీ యింటనుంచినమనుజుని బంధించి యీయమ్మగుడికిఁదెచ్చి యామె సముఖమం దుంచుట నాకేర్పడినవిధి. బంధించి తెచ్చి యునిచిననరుని యా రాజపుత్రుఁడు స్వహస్తమునన శిరఃఖండనంబు సేయుచుండును. ఇంతియకాని నావలన దోషమేమియు లేదండి. నేనొక సేవకుఁడను. యజమానుని యానతినను సరించి పనులు సేయుట సేవకున కొకతప్పు గాదుగద? ఇది కూడనిపనియని నాకుఁ దోఁచినను విధిలేక సేయుచున్నాను. పిదప మీచిత్తము.

అరి- బలిగా నీయఁబడిని మనుజునికళేబర మేమిచేయుదురు? ఈరహస్యము బయలుపడుటలేదా?

రక్త-"ఇదెచూడుఁడు" అని తలుపుదెఱచి భూమియడుగుభాగమున గుప్తముగనుంపఁబడిన నీటికాలువను జూపెను.

అరి- మీయజమానుఁ డిప్పు డెందున్నవాఁడు?

రక్త-ఆతఁడిపుడ విచ్చేసి యమ్మవారిని సేవించును.

అరి- ఈత్రోవ యెచటికిఁ గొంపోవును?

రక్త - 'రండుపోదము' అని యాగుడిలోనుండి వెనుక నరిభీషణుఁడు పెరటిలోనితోఁటం బ్రవేశించినమార్గమున నాతని వెంటఁబెట్టికొని చని తోఁటనుజూపెను. వారిరువు రందుఁబ్రవేశించినతోడన యరిభీషణుఁ డొకసైగఁ జేసెను. ఆసన్న గ్రహించి యాతోఁటలో నదివఱకుఁగాచియున్న యమదూతలవంటి నలువురుభటులు లేతెంచి రక్తాక్షుని బంధించి కొనిపోయి యావల నదివయిపుననున్న మఱినలువురు మనుజుల కొప్పగింప వా రతని నెందేనిఁ గొనిచనిరి. తనతోనున్న నలుగురుసేవకుల నరిభీషణుఁడు లోనికి మరలం గొనిపోయి దేవాలయమున కావలనున్నమంటపమున నిలిపి తా నొక మఱుఁగు ప్రదేశమున నిలువంబడియుండెను.

కొలఁదికాలము గడచినపిదప నమ్మవారిగుడిప్రక్కనున్న యొకగూఢద్వారము తెరువఁబడియెను. దానినుండి యొకవెలుతురు సన్నగా మొదటఁగనపడెను. అది క్రమక్రమముగఁ బెద్దదిగాఁబ్రారంభించెను. అంత నాగుప్తద్వారమున నొకచిన్నకాఁగడాతో నిరువురుపురుషులు వెలువడిరి.

అందొకఁడు పసుపువస్త్రముల ధరించి మేన లోహితమలంది ముక్కునకుఁబయిగఁ గనుబొమలకు మధ్యఁ గుంకుమరేఖ దిద్ది యుండెను. రెండవ మనుజుఁడు పూజాద్రవ్యములుగల తెలె నొకదానిఁ బాణితలంబునం దిడికొని యుండెను. ఈ యిర్వురు గుడిలోనం బ్రవేశించిరి. వా రరిభీమణునిఁగాని, యరిభీమణుని సేవకులనుగాని చూడలేదు. అయినను వీరు మాత్ర మాయిద్దఱిని కాఁగడా వెలుతురునఁ జక్కఁగఁ గాంచఁ గలిగిరి. అరిభీమణుఁ డందొకని జాలావధానియని గుర్తించెను.

ఈకొ్రత్తపురుషులు దేవళముం బ్రవేశించి యం దొంకి యలకుఁ దగిల్చియున్న వ్యాఘ్రాస్తరముల దిగువంబఱచి సుఖాసీనులయిరి. జాలావధానులు రెండవపురుషునితో నిట్లు ప్రసంగించెను.

భూతివర్మగారూ! రక్తాక్షుఁ డింక నాపురుషునిం గొని యరుగుదెంచినవాఁడు కాఁడు.

భూతి - అవును! నేను నదియ యడుగఁదలఁచితిని. ఏల వాఁడింత తడసినవాఁడు.

జాలా - మన మింతలోఁ బూజ సేయుచుందము. వాఁడునుఁ గొనివచ్చును.

అని జాలావధాను లన భూతివర్మ యమ్మవారియర్చనఁ బ్రారంభించి యంబ నిట్లావాహించి స్తుతించెను.—

‘లోకజననీ, జగన్మాతా, అంబా, మహిషాసుర రుధిరవిలిప్తారుణహస్తారవిందద్వయీ ? నీపాదముల కిదె నమస్కారము. ఓమహిషాసురమర్దనీ ? ఈపదునాలుగుభువన

ములును జీవవంతములయి సంచరించుట నీనిర్హేతుకజాయమానకృపావిశేషంబుననగదా? నీచేత లోకములు సృజింపఁబడినవి, రక్షింపఁబడినవి. లయింపఁబడినవి. ఓభక్తవత్సలా? శరణాగతుఁడ నయిననన్నుఁ గాపాడుము. నామనోరథసిద్ధిం జేయుము.

అని స్తోత్రముసల్పి నైవేద్యమర్పింప రక్తాక్షునికొఱ కెదురుచూచుచుండిరి.

భూతి - ఇంకను రాఁడయ్యెనే?

జాలా - నేను స్వయముగ నేగి కొనివచ్చెదను.

రక్తాక్షుఁడు రానిహేతువు దెలియఁజాలక కొంతవడి యాలోచించి యరిభీషణుఁడు కడుగడుసువాఁ డౌటఁదెలిసిన వాఁడుగనుక, రక్తాక్షుఁ డాతనింబట్టితెచ్చునపు డేమయినఁ దిరుగఁబడి యెదిరించియుండనోపునని జాలావధాను లనుకొనుచుఁ దాన యచ్చటికేగి రక్తాక్షునకుం దోడుపడ నుద్యుక్తుఁ డయ్యెను.

యజమానునిసెలవుగైకొని జాలావధాను లచ్చటికేగ దిగ్గనలేచెను. గుడి దాఁటి యరిభీషణు నుంచినపడకటిగది వైపున కాసారంగపుమార్గమునఁ దాను బయలుదేరి నాలు గడుగు లిడెనోలేదో, దాఁగియున్న నలుగురుసేవకు లొకపరి తటాలున నాతనిపయిం దుమికిరి. జాలావధాని యది యెఱిఁగి మోసమునుఁ దెలిసికొని వారికిఁజిక్కకుండ వెనుకకు మరలి, గుడిచేరువకుఁ బరువిడఁదొడఁగెను. ఆనలువు రాతనివెంబడించి పరువిడిరి. గుడియందున్న భూతివర్మ యాయలుకుడు విని,

యులికిపడి లేచి ధ్వని యేతెంచుదిక్కునకుఁ బోవ సమకట్ట "ఎచటికేఁగెదవు? అచటినుండి కదలిన చచ్చితివి" అను మేఘగర్జనమువంటి కేక యొకటి యాతనికి వినఁబడెను. అశనిపాతమునకుముందుఁ దోఁచు మెఱుపువలె నరిభీషణుఁ డునుఁ బిడుగువలె గుడిద్వారమున కడ్డముగ నిలువఁబడెను.

భూతివర్మ తనఖడ్గముకొఱ కిటునటుఁ దొందరపాటున వెదకెను. కాని యతని కది యెచ్చటనుం గానంబడలేదు. వెంటనే యచ్చటియరిభీషణునిభటులు నలువురు భూతివర్మను జుట్టుకొని యతనిని బంధించిరి. ఈ సందడిలో జాలావధాను లెట్లో తప్పించుకొని పాఱిపోయెను. సేవకు లాసంగతి యరిభీషణునకు రహస్యముగా నెఱింగించి, యాతనియాన భూతివర్మ నెందేనిం గొని చనిరి.

కొంతవడికి మొదట రక్తాక్షుం గొనిపోయిన నలువురు సేవకులు మరల నేతెంచి యరిభీషణునిం గలిసికొనిరి. వారి నందునిచి తా నొంటరిగ మరల సారంగపుమార్గమున నేగుచు "ఇంతతఱిగొనియుఁ బ్రధానపురుషుఁడు చిక్కకపోయెంగదా! అతనివలన విద్యుత్ప్రభ కేయపాయమునుఁ గలుగకమునుపే నేను త్వరపడి యామెను గనుగొని రక్షించవలెను" అని యరిభీషణుఁ డామెకొఱ కందు వెదుక నారంభించెను. ఇటుల వెదుకఁగా వెదుకఁగా నొక గదియం దొక విప్రవటువు గానుపించెను. ఆపోఱఁ డప్పుడు నిద్రించుచుండెను. అరిభీషణుఁ డబ్బాలుని లేపి చేయిపట్టుకొని 'బాలకా! నీవెవ్వరివాఁడవు? ఇచటనుండఁ గారణ మేమి? అనృతమాడక

నుడువుము' అని యడిగిన నాబాలుం డదిరిపడి భయమున వడకసాగెను.

అరి - భయపడకుము నిజము చెప్పుము.

బాలు - నేను జాలావధానుల కొమరుఁడను. నాపేరు లక్ష్మణుఁడందురు. మానాయనగారు భూతివర్మగారి యాశ్రితులు. ఆయనకుఁ జేఁదోడుగ నే నిచట నుండుదును.

అరి - భూతివర్మ యెవరు? అతని దేయూరు?

బాలు - ఆయన చిత్తూరు పురవాసి. రాజు ముఖ్యమంత్రులలో నొకఁడు. క్షత్రియుఁడు.

అరి - చాలును. ఈ యింటి తాళముచేతు లెవరికడ నున్నవి?

బాలు-నాయొద్దన యున్నవి. ఇవిగోఁ బుచ్చికొనుఁడు. అని యప్పుడు తనయొద్దనున్న బీగముచేతుల నరిభీమున కొసఁగెను. అరిభీముఁడును వానిఁబుచ్చికొని యాబాలుని వెంటనిడికొని యచటఁ జూడఁదగుస్థలములనన్నిటింజూచి యా బాలు నంతటఁ దనభటులవశము చేసెను. భటులాతనిం గూడ నిర్దిష్టస్థలమునకుం గొంపోయిరి. అరిభీముఁడు ముందుఁ దా నచటఁజూచినవృద్ధసతిని వెదకెను. ఆ ముదుసలి యెందును నతనికిఁ గానరాదయ్యెను.

అటుపిమ్మట నాతఁడు విద్యుత్ప్రభాసౌధమునకుఁ బరువిడెను. అచట నాతని కాయువతీరత్నము గానరాదయ్యెను. అప్పు డరిభీముఁడు విషణ్ణహృదయుఁడయి 'అహా! ఈమృగాక్షిగతి యేమయ్యెనో గదా? నాకోరిక యువతీలలామముప్ప

దప్పింపఁ జాలనయితినే! ఇఁక నాప్రయత్న మేల కాల్పనా? నేఁ జేసినదంతయు బూదియందు వ్రేల్చిన విధంబయ్యెంగదా! ఇఁక నెవరినిఁబట్టిన నేమి? ఆచంద్రాననను గనుఁగొను భాగ్యము నాకబ్బునా? యని విచారించుచు సహింపరాని చింతాభరంబున నామె నింక నందు వెదుకఁజొచ్చెను. ఈలాగు వెదుకుటయం దాతని కిదివరకుఁ గాన్పింపని గూఢద్వార మొకటి గాన్పించెను. అదియ జాలావధాని పాఱిపోయినద్వారము. ఆద్వారమునఁబోయి యతఁడు పరిశీలింప నది విద్యుత్ప్రభయుండు గదినుండి శక్తిదేవాలయమునకుఁ గొనిపోవుటయ కాక యాచిత్రభవనము వెలుపలఁ గొంతదూరమందున్న మఱియొక సదనమునకుం గూడఁ గొనిపోయెను.

ఈయింట నెవరును వాసము చేయుచున్నట్లు కనుపడలేదు. అచటినుండి మరలి విప్రబాలకునిం గొని చనిన సేవకులనుఁ గలసికొనెను. పిదప నాసేవకుల నాచిత్రభవనమునఁ గావలియుంచి తిరిగి విద్యుత్ప్రభ నందు వెదుక నారంభించెను. ఇంతలో సేవకుఁ డొకఁడు పర్వుపర్వున నేతెంచి యిట్లు వచించెను.

సేవ - స్వామీ! మీరు మావశముచేసిన మనుజుని బంధించి, గమ్యస్థానమునకుం గొనియేగుచుండఁ గొంతదూరమరిగిన పిదప నాతం డెట్లో తన బంధంబుల నూడ్చికొని మమ్ముల నలువురిని లెక్కసేయక కాలికి బుద్ధిచెప్పినవాఁడు. నేనేమి మనవి చేయుదును?

అరి - వాఁ డేదిక్కునకుఁ బాఱిపోయెను ? మన భటు లప్పు డూరకుండిరా ?

సేవ - అతఁడు పడమటిదిశకై పోయెను. మన సేవకులు ముప్పురు నాతని వెంటఁ గొంతదూరము పరువిడి యాతండు దృష్టిపథంబుఁ దప్పిపోయినతర్వాత నేమిచేయునదియు లేక వెనుకకు మరలిరి. మీకీ వర్తమానమునుఁ దెలుపుటకే నిందుఁ జనుదెంచితిని.

ఆసేవకుం డీలాగున విన్నవింప నరిభీషణుఁ డతనితోఁ గొన్నిరహస్యములు పలికి యతని నంపివేసెను. పిదపఁ దానును నొక చాయం బోవుచు నింతకాలమునుండి దేశమంతయు వెదకి భగీరథప్రయత్నమున దుష్కరకృత్యముల కెల్లఁ బుట్టినిల్లయిన యీప్రదేశముం గనిపెట్టఁ గలిగితిని. ఈపాపకార్యములకు మూలకారణులయి లోకాకులతకుఁ బ్రళయకాలానిలముం బోలు పురుషులం గనిపెట్టితిని. వారు హస్తగతులయినట్టునుఁ దలంచితిని. కాని వారు చేతఁజిక్కియుఁ జిక్కనివారలయిరి. నేఁ గాంచిన దంతయు స్వప్నలబ్ధఫలం బయ్యెఁగదా ! ఈయుద్ధములో జాలావధానులు ముఖ్యుఁడు. అతఁడు పట్టువడినయెడ నాప్రయత్నములన్నియుఁ గొనసాగి యుండియుండును. అతఁ డిక్కరి మనకెక్కడఁజిక్కును? అతనివలన విద్యుత్ప్రభ కేమియాపద సంభవించునో గదా ! ఇఁక నేమి సేయునగు ? అయిన నేనిప్పు డధైర్యము పడఁగూడదు. అభిజ్ఞులాపదలోను శూరులు యుద్ధమందునుఁ బరీక్షింపఁబడుదు రను సామ్యము నభ్యాసమునకుం దెచ్చుట కిది యొకయదను.

మొదట నామదనతినిఁ బదిలపరుపవలసి యుండెను. ఇది యాత్మకృతదోషము. ఇపుడు చింతించిన నేమిప్రయోజనము? ముందెటులయిన విద్యుత్ప్రభను నాపదనుండి రక్షింపవల యును. తక్కినసంగతు లావలఁజూచికొందము. ఆధూర్తు లెందుఁబోయెదరు ? పిదప వారల పట్టుఁబెట్టవచ్చును. అని వితర్కించుకొనుచుఁ బోయెను.

## ౧౯ వ భాగము

జాలావధానులతో నరిభీమణుఁడు ప్రవేశించిన నాగేం ద్రపట్టణములోని గుప్తమందిరమునందలి విషయములనెల్ల నామూలాగ్రముగ గ్రహించియు నరిభీమణున కొక్కయం శమున మాత్రము మనంబున నరగలి పీడలేదు. తా నాగృ హమునం బ్రవేశించిన కొన్నిదినములకు ముందు నింద్ర మహేంద్రజాలియగు జాలావధాను లాచిత్రాగారమునకుం గొనివచ్చిన కామయ్యగతి యేమయినదియు నాతని కింకనుఁ దెలియలేదు. ఇదియు యాతనిమనంబును గరంబునుఁ గలత పెట్టుచున్న యంశము.

గడచినసోమవారమునాఁడు జాలావధానులు, కొత్తగ నారాష్ట్రమున కరుదెంచిన కామయ్యను మాయమాటలచే మోసగించి నాగేంద్రములోని యాచిత్రగేహమునకుఁ గొని

యేతెంచుట చదువరు లెఱింగి యున్నారు. ఆలాగున వారిరు వురు నామందిరముం బ్రవేశించుట యరిభీషణుఁడును గన్నులారఁ గాంచియుండెను. ఆదురదృష్టుని వర్తమానము నెటులనైనం గ్రహించి తన కెఱుఁగఁజేయుమని యరిభీషణుఁడానాఁడ తనసేవకుని భీముని నియోగించియుండెను. ఆభీముఁడునుఁ బ్రచ్ఛన్నవేషమున నాయింటి కీవలావలఁ దారాడుచుఁ గని పెట్టియుండెను.

ఎట్టకేలకు గురువారము రేయి యెనిమిదిగంటలకు మీఁద సంగతి వానికిఁ దెలిసెను.

సోమవారమునాఁటినుండియు నాయయ్యాజాడ యేమయినఁ దెలియునేమోయని యాయింటిసమీపమున నన్నిదిక్కులను గాచియుండి కాచియుండి యాతండు విసికివేసరెను. తుద కీనైరాశ్యమువలన నాతఁ డాయింటికిఁ గొంచెమెడముగ నెదుటివరుసయిండ్లలో నొకయింటి బయటితిన్నెపయిం జదికిలఁబడెను. అప్పు డొకమనుజుఁ డొంటరిగ బిట్టుబరోజుచు నావీథిం బరువిడుచుండెను. అంతియకాక యాతం డప్పుడప్పుడు వెనుకకుఁ దిరిగితిరిగి చూచుచుండెను. అతనింగాంచి భీముఁడు తిన్నెపయినుండి దిగ్గనలేచి బిరబిర నాతనివెంట నడువసాగెను. ఆమనుజుఁ డీభీముఁ డాలాగు తనవెంబడి పరువిడుటఁగాంచి తననడకవడిని మఱింత హెచ్చించెను.

తనవెంట నరుగుదెంచువాఁడు తన శత్రువో లేక యాతని యనుచరులలో మఱియొకఁడో తన్ను మరలఁ జిక్కించుకొనుటకే చనుదెంచుచున్నాఁడని యతనికిఁదోచెను. భీముఁ

డా మనుజుని భయమును గ్రహించి మెల్లన నతనిం గలసికొని మంచిమాటలవలన నాతని సాధ్వసంబు వోనడచెను.

ఆమనుజుఁడప్పుడు నీలవర్ణ కౌపీనము మాత్రము ధరించి యుండెను. పయిన నుత్తరీయముగాని కట్టువస్త్రముగాని లేదు. శరీర మాపాదమస్తము తైలవిలిప్తమయియున్నది. ఈతైలపుఁ బూఁతకుఁదోఁ డొడలంతయు దిగ చెమటలు పోసి యొరు లతనినిఁ దాకుటకయిన వీలు లేక యుండెను.

ఆమనుజునకు భయము మాన్పి భీముఁ డాతనిఁ జేరువ నున్న తటాకమునకుం గొనిచని మేనిరోత యాఁగున ట్లాతనిని స్నానము చేయించి తన పైవస్త్రము నతని కొసఁగెను. ఆవస్త్రమును వాఁడు ధరించెను. కాని వానికింకను భయము వదలలేదు.

భీము - నాయనా! నీకు వచ్చిన భయములేదు. నేను నీకాప్తుఁడనుగాని శత్రుఁడనుగాను. నేనుండ నిన్నొకరు తాకువారు లేరు. కాని నీవేలయిట్లు పరువిడుచుంటివి. నీ కెద్దియైన నాపదను శంకించుచుంటివా?

మను - చింతాకరంబగు నావృత్తాంతము నీకు సావకాశముగ విన్నవించెదను. మనమిచట నిలువఁగూడదు. శీఘ్రముగ నావలి కేగుదము. లేకున్న మనల కాపద రాక మానదు.

వారిరువు రీలాగున మాటలాడుచు వడివడిగ నడచి పోయి జనసమ్మర్దమగు ఘంటాపథముం జేరిరి. ఆ మనుజుఁ డచట నలుగురు మనుజుల మొగములను జూడఁగనే యతనికి

గుండె నిబ్బరమయ్యెను. తనకు రానున్న యాపదను గడ చితినని యతఁడప్పుడు ధ్రువముచేసికొనెను. అప్పు డాతని మనంబు స్థిరపడెను. అంత వారిద్దరొక్కచోఁ గూరుచుండి యిటుల సంభాషించిరి.

భీము - ఇప్పుడయిన నీమనంబు శాంతించెనా ?

మను - అబ్బా! ఇప్పు డీ జనసముదాయములోఁ బడి తిని గనుక నన్ను ధైర్యము మరల వచ్చిపొందెను. ఇఁక బ్రతికితిని. ఇందునకు నీసహాయము చాల పనిచేసినది. ఈ నీ సహాయము సమయమున నాకబ్బియుండనియెడ నాభయము నన్నప్పు డేమి చేసియుండునో ! భగవంతుఁడు నిన్ను నాకుఁ దోడుసూపెనుగాన వాకును కాలు సాగినది.

భీము - మీ దేయూరు ? దేశ మేది ?

మను - అయ్యా ! నాది కృష్ణాతీరము. అవనిగడ్డ గ్రామవాసుఁడను. నాపేరు కామయ్య యందురు.

భీము - నీ వీ యూరు వచ్చి యెంతకాలమయినది ?

మను - గడచిన సోమవారమే వచ్చితిని.

భీము - సోమవారమునాఁ డొక బ్రాహ్మణుని వెంటఁ జనుచున్నది నీవేనా ?

మను - అవును. ఆబ్రాహ్మణుని తోడ వచ్చినది నేనె. ఆబ్రాహ్మణుఁడే నాప్రాణము దీయఁ దలంచెను.

భీము - ఆలాగా! ఆత డేల నీప్రాణము దీయఁ దలంచెను ?

భీముఁ డీలా గడిగినమీఁద కామయ్య కన్నులనీరు పెట్టు కొని తన యుదంతమంతయు నతనికిఁ జెప్పఁదొడగెను.

" నాయనా ! నాది కృష్ణాతీరము. బందరుతాలూకా లోని యవనిగడ్డయను గ్రామము కాపురము. మాపూర్వు లుంఛవృత్తివలన జీవనము జరుపుకొనుచున్నను సద్వంశము నకుఁ జేరినవారు. వేదాధ్యయనపరులు. శాస్త్రసాహితియం దాఱి తేఱినవారు. నాకుఁ బండ్రెండు వత్సరములు వచ్చు వఱకు మానాయనగారియొద్ద వేదశాస్త్రముల నభ్యసించు చుంటిని.

నా పదుమూడవయేట మా నాయనగారు గతించిరి. అప్పటినుండి నాతల్లియే నాకు తెక్కులు వచ్చువఱకు నెట్లో పెనిచి పెద్దవానిఁ జేసెను. నేను నాతాతతండ్రులనాఁటనుండి వచ్చుచున్న మాయుంఛవృత్తినే యవలంబించి యెట్లో సంసారము సీడ్చికొని వచ్చుచుంటిని.

అవనిగడ్డగ్రామమునకు సమీపమున నున్న కొత్త పేటగ్రామనివాసులయిన సూరి లక్ష్మీనారాయణావధానుల వారియొద్ద సాంగముగ వేదమును, భం. వెంకయ్యశాస్త్రుల వారికడ శాస్త్రమునుఁ జదివి గ్రంథముఁ బూర్తి చేసికొంటిని. అప్పటికి నాకిరువదిమూఁడు వత్సరముల వయసు వచ్చినది. వివాహము చేసికొనవలయునని నాకుఁ గోరిక జనించెను.

కృష్ణానది కీవలిదఱినుండు వెల్లటూరుగ్రామమున కన్య గలదని కబురువచ్చినది. వారును మావలె నుంఛవృత్తివల నన బ్రతికెడువారలే. "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ

శోభ తే” అని నేనాసంబంధమునకు యత్నించుట మంచిదని యెంచితిని. కాని యాకన్యాజనకుఁడు తనకూఁతుమీఁద కన్యాశుల్కముగొన నిశ్చయించుకొని వచ్చినవరులతోనెల్ల నాకత్రీవము తెచ్చుచుండెడువాఁడు. కన్య పదునొకండువత్సరములపడుచు. పదునొకండువందల రూప్యములను దనకూఁతుపై సంపాదింపఁగోరెను. వత్సరమున కొక శతమానమువంతునఁ బదునొకండువందలరూప్యములఁగోరుట న్యాయమేగదా ?

సుత జనించినది మొదలుకొని తండ్రి కన్యనడుగవచ్చిన వారెల్లరతో శుల్కమువిషయము బేరము చేయుచునే వచ్చెను. ఆలాగుననే నాతోడఁగూడ బేరము ప్రారంభించెను. నన్ను మొదట పదునొకండువందల రూపాయల నిచ్చి కన్యంగొనుమని పలికెను. నేను వేయిరూప్యముల నొసంగెదనని యొక్పుకొంటిని. తండ్రి యొప్పుకొనలేదు. దారిద్ర్యదోషముగాన నంతకు నెక్కువ తూఁగలేక బేరము సంక్షేపించుకొని వారియిల్లుదాఁటి బయటివాకిలివఱకు వచ్చితిని. అప్పుడేమని చెప్పుదు ! వివాహము కావలసిన కన్య యాయింటి గుమ్మమువద్ద నాకడ్డముగా నిలువఁబడి ‘ స్వామీ ! మానాయనగా రేమనిరి? నన్నీయ నిశ్చయించిరా ? ’ యని ప్రశ్నించెను. నాకు విభ్రాంతియయ్యెను. తండ్రికిని నాకును జరిగిన సంభాషణ మా చెలియ యందెందోయుండి చెవియొగ్గి వినుచున్నయదివోలెఁ గానుపించెను. ఆపడుచు రూపసియు, గుణవతియు నై యుండెను. పున్నమరేయివెన్నెల ననుకరించు తన చిన్నినగవు, వన్నియలుదేలు నామె ముఖమండలమునఁ

దోఁపం బలికిన యాకన్నియకందువపలుకులు నిస్పృహాకులితమయిన నామనంబున కమృతధారాపాతమై నన్నదు గావలఁ బెట్టనీక పోయెను. కాన నాచిన్నదాని జనకునకును నాకును జరిగిన సంభాషణ మా వదుచునకుఁ బూసగుచ్చిన ట్లెఱింగించితిని.

“స్వామీ ! మీరు పదివందలవఱకు నొప్పుకొంటిరి. ఇంక నొకవందయేకదా మానాయనగారు కోరినది ? నన్నుఁ గూర్చి యావందగూడ నీయఁజాలరా ? ” అని మృదుమధురముగ నాసుదతి నుడివెను. అంత నే గిరుక్కునం దిరిగి లోనికిం బోయితిని. అక్కన్నియయు నాతోడన తండ్రిసముఖమున కేతెంచెను. తండ్రికిఁ గోరినరీతిఁ బదునొకండువందల రూప్యముల నిచ్చెదనని యొప్పుకొంటిని. ఎట్లువోయి యెట్లువచ్చునో యని ద్రవ్యము ఋణముచేసి మఱి యిచ్చోటి కరుదెంచితిని గాన నాద్రవ్యమంతయుఁ దండ్రిచేతిలో లెక్కించి పెట్టితిని.

ఈనాకృత్యమున కక్కన్య కరంబు సంతసించెను. అంతట నాబాల నన్నుఁజూచి ‘స్వామీ ! మీపయి యుత్తరీయము నిటు తెండు’ అని నన్నుఁ బ్రార్థించెను. వెంటనే నే నా చిన్నదానికి నాపయివస్త్రము నొసంగితిని. దానిని ధరించుకొని విడిచిన తనకట్టుచీరెను తనతండ్రి కాపె యొసంగి నన్నుఁగాంచి ‘ఇఁక మనము మనగృహంబున కేగుదము, పదుం’డని యక్కన్నియ నాతోడ బయలుదేర నుద్యమించెను.

‘అమ్మా ! నీపాణిగ్రహణమయినపిదపఁ బోవచ్చును. ఇపుడేల తొందరపడెదు నిలు’మని తండ్రియెంత వేఁడికొనినను

నందునిలువక 'నాయనా! మీకు నాఋణము తీరినదిగదా! చిన్నప్పటినుండి మీరు నన్నెత్తిపెంచి పెద్దదానిఁ జేసితిరి. నాకొఱకు మీ రెంతయో శ్రమపడితిరి. ఎప్పటికయిన నేను మీగృహము వదలవలసినదాననేకదా! ఆపనిని నే నిప్పుడే చేయఁదలఁచితిని. నేఁ బోయివచ్చెద'నని చెప్పుచు నాకోడ నాపడుచు పయనమయి యవనిగడ్డగ్రామము వచ్చిచేరెను. ఇపు డక్కన్నె నాగృహంబునన యున్నది. లగ్నమును నిశ్చయింపఁబడెను.

భీమ - ఆహా! ఆచిన్న దెంతనేర్పరి! ఎంతతెగువరి!

కామ - సందియమేమి? ఇంతకన్న బుద్ధిమతులును జాణలు మఱెందఱులేరు? వెనుక నొక నిఱుపేదయయిన బ్రాహ్మణుఁడు యుక్తవయసువచ్చిన తనకొమార్తె నెచ్చో నయిన నొక తగినస్థలమున నీయవలయునని బహుప్రయత్నములు సల్పుచుండెను. ఎచ్చట విచారించినను బిల్లవానికి వరదక్షిణ లేనిది కన్నెను గ్రహించమని చెప్పుచుండిరి. ఎంత శ్రమపడినను దగినవరుండు లభింపలేదు. ఎచ్చటనయిన నొకమంచిస్థలము గనుపడినను, వారడిగిన కట్నములు గాను కలు నీతని కందుబాటులో నుండలేదు. వరదక్షిణ నొసంగ శక్తిలేకపోయినను దనకూఁతు నొకవెడఁగున కంటఁగట్ట నాతనికిష్టములేదు. తుదకుఁ జేయునదిలేక యొకచిన్నవానికి నతఁడడిగిన వరక్రయమునకొప్పుకొని తనకొమారిత నాచిన్న వానికిచ్చి పరిణయమొనర్చెను. వరదక్షిణ రెండువేల రూప్యములను వివాహమునకుఁ బూర్వము యీయువకుఁడు మామ

గారివద్ద గ్రహించెను. ఇందున కాబ్రాహ్మణుఁడు తనకుఁ గలిగిన సర్వస్వమును విక్రయింపవలసివచ్చెను.

వివాహము ముగించినపిదప వధువును దనయింటికంపుమని వరుఁడు మామనడిగెను. అప్పుడచటన యున్న కన్య పెనిమిటినిఁజూచి తనమోమున లజ్జాసంభ్రమము లలంకరింప 'స్వామీ! నేను తమగృహంబునకు రావలయునా? తామే మాయింట నిలువవలెనా? యోజింపుఁడు' అని ముసిముసి నగవుల నవ్వుచుఁ బలికెను. వరుం డేమి బదులు చెప్పవలెనో తెలియక విభ్రాంతిచే నిలువఁబడెను.

'మానాయనగారు మిమ్ము ద్రవ్యమొసఁగి విలిచిరి గదా' యని కన్య మరలఁబలికెను. అప్పు డాకన్నియయభిప్రాయమెఱింగి లజ్జపడి కొంచెమాలోచించి యామె తన్ను సయ్యాటించుట కాగ్రహముగలుగుటకు మాతాతం డత్యంతానందముం బొందెను. వెంటన తాఁబుచ్చుకొనిన రూప్యములను మరల మామగారికొసంగెను. పిదపఁ గన్యయు మగనికన్న ముందు పయనమయి యతనితోడ నత్తగారింటికేగెను.

చేసినఋణముం దీర్చుకొని ఋణవిముక్తుఁడనని యనిపించుకోవలెననియు, ముందు వివాహమునకుఁ గావలసిన ద్రవ్యము సేకరింపవలెననియుఁ గుతూహలముతోడ నే నిల్లు బయలుదేరితిని. ఎన్నిపాట్లోపడి మాదేశమందే కొంచెము ధనము సంపాదించితిని. ఒక్కొక్కపు డీధనార్జనకయి కొంత చ్యమునకుఁగూడఁ బాల్పడితిని.

చేసినపాపము చెప్పినఁబోవునందురు గాన నేనొనర్చిన

నీచకార్య మిచటఁగొంచెము వివరించెదను. మొదట నే నవని గడ్డ బయలుదేరి యచట నచటఁ దిరిగి రాజమహేంద్రవరము ప్రవేశించితిని. ఆసమయము గోదావరీపుష్కరమయినందున గోదావరినది యొడ్డున ననేకులు జనులు దేశదేశముల నుండివచ్చి మూఁగియుండిరి. కొందఱు నదియందు స్నానము చేయుచుండిరి. కొందఱు బ్రాహ్మణులకు దంపతిపూజలు సల్పుచుండిరి. ఈదంపతిపూజలయందు పురుషులకు దోవతుల చాపులు ముత్తయిదువులకు మంచినరిగంచుచీరె లిచ్చుటయే గాక పుష్కలముగ దక్షిణలనయిత మిచ్చుచుండిరి. వీని నన్నిటిని గాంచి నాకును గొంచెము యాశకలిగెను. అప్పుడచట నొకవేశ్య నాకుఁగనుపడెను. దానితో నేనొక యేర్పాటును జేసికొనుట మంచిదని నాకుఁదోఁచెను.

కాన నావెలవెలందిని నాఁడు నాకు భార్యగా నుండునటులఁబ్రార్థింప నదియు వల్లెయని యొప్పుకొనియెను. చదువుకొన్న బ్రాహ్మణుఁడనని నన్నును జనులు పూజింపఁ బ్రారంభించిరి. సమయమునకు భార్యనుగాఁ జేసికొన్న వేశ్యకును నాకును దంపతిపూజలు విరివిగ జరిగెను. పదిపండ్రెండుచీరెలు దోవతులచాపులు కొంతద్రవ్యమును దొఱకెను. అందులో నొక విలువగలచీరె యొకటియు పదిరూప్యములు నావేశ్య కొసంగి యాయూరు విడిచి కాకినాడఁజేరితిని. ఆయూరిలోను గొంచెము లాభించెను.

అంతట దేశమునకుఁ దిరిగిపోయినను మేలయి యుండియుందును. అప్పటికే వేయిరూపాయీలు సేకరించితిని. కొఱ

వడిన ఋణము నెట్లో యచ్చటనే సర్దియుండఁగలిగి యుం డును. కాని యాశాపాశముచేత నింక గడించవలెనని యొక పిచ్చిభ్రమ కలిగి యీ మీవారు దేశముం బ్రవేశించితిని. ఇచ్చటను నాకుఁ గొంచెము లాభించకపోలేదు. అప్పటికినిఁ దనివితీఱక యీ నాగేంద్రపురము రావలెనని బయలుదేరి వచ్చి యీకడగండ్లకు లోనుగావలసి వచ్చెను.

గడచిన సోమవారమునాఁడు నాప్రారబ్ధవశమున నొక బ్రాహ్మణుఁడు నాకుఁ ద్రోవను దోడయ్యెను. 'బుద్ధిః కర్మానుసారిణీ' అనినట్లు నామనంబును నా బ్రాహ్మణుని యందు తగులంబయ్యెను. అతనిని నే వదలలేక పోతిని. ఆతఁ డెచ్చటికినేగిన నచ్చటికే పోవ బుద్ధి జనియించెను. అతని మాయావాగురులంబడి కదలలేక పోతిని. అతనిపేరు జాలావ ధానులఁట. బొల్లిబొల్లి కబురులతో నాయుల్లంబు గల్లువడు నట్లు చేసి తుద కతఁడు నన్నీగ్రామమున కీడ్చికొనివచ్చి మెల్లన నన్నాగృహంబున సోమవారము ప్రవేశపెట్టెను.

భీమునితో నీలాగు మాటలాడునపుడు కామయ్య కీసంగతి జ్ఞప్తికి వచ్చెనో యతని శరీరము మరలఁ జిత్రముగ వడకసాగెను. అప్రయత్నముగ నతని కన్నులనుండి నీరురులఁ జొచ్చెను. భీముఁ డది గాంచి కామయ్య వెన్ను కొంచెము చఱచి యతని మానసమందలి కలతను బోఁగొట్టెను. ప్రసన్నచిత్తుఁడయి కామయ్య మరలఁ దనకతను మొద లిడెను. అప్పటి నాస్థితి యేమని చెప్పుదును నాయనా? ఆ సంగతినిం దలఁచికొనిన నాగుండె ఝల్లురనుచున్నది సుమీ!

న న్నాలా గాగృహంబులోనికిం గొని చని బాలకస్వభావుం డగుబాలావధాని విశాలమగు నొక చక్కని యఱయందు విడియించెను. మే మిరువుర మందుఁబ్రవేశించినతోడన నొకబాలుఁడును మఱియొక సేవకుఁడును బర్వుపర్వున నేతెంచి సర్వవిధముల నాకుపచారములు సేయఁదొడఁగిరి. బాలుఁడు నా మూఁపుననున్న కరోటకమును దించి, పదిలముగ నొక బల్లపయినుంచెను. రెండవవాఁడు తాళవృంత మొకటి చేతంబూని నా మార్గశ్రమ నపనయించులాగున వీవనారంభించెను. బాలావధానియు సరసనఁ గూరుచుండి నాతో ముచ్చటించుచుండెను.

ఇంచుకవడి మేము విశ్రమించిన పిదప బాలకుఁడు మరల నరుదెంచి యభ్యంజనమునకు లేవవచ్చునని హెచ్చరించి యొక యంగవస్త్రము నాకొసఁగెను. మేమంత నచ్చోటువాసి స్నానగృహోన్ముఖులమయి నడచుచుండ నవధానులు నన్ను వీడ్కొని మఱియొక ప్రక్కగదిలోని కేగెను. నేనుమాత్ర మాచిన్నవాని వెంటం జని యభ్యంజనస్థానముం బ్రవేశించితిని.

తైలము సుగంధద్రవ్యమిళితమగు మైపూఁతపిండి మొదలగు పదార్థములును సిద్ధముగ నునుపఁబడి యున్న యాగృహమున నా బాలుఁడు నాకభ్యంజనాదిక్రియల నెఱపి శుచివస్త్ర మొసఁగి వంటసాలకు నన్ను జేర్చెను. అచట నదివఱకే యవధానులవారు నాకొఱకు భోజనమున కెదురు చూచుచుండిరి. కాన సంధ్యావందనాదిక్రియ లాచరించిన పిదప నపూపాజ్యపూర్వకంబుగ నాహారము దృప్తిగ భుజించి యవధానులును నేనును మరల మొదటవిడిసిన గదికిఁజేరి

యచట నదివఱకే పఱచియున్న రత్నకంబళముపయిం గూరు చుంటిమి. తోడన విప్రబాలకుఁ డొక చీట్లపేకఁ దెచ్చి మాకడ నునిచెను.

చీట్లాటయందు నే నాఁటితేఱిన బంటను గాన నాచీట్ల దర్శనము నాకపరిమితానందమును గలిగించెను. మాయింట నుండు కాలమందుఁగూడ నీచతుర్ముఖపురాణమన్న నాకెంత యుం బ్రాణమే. ఎప్పుడయిన నెద్దియేనిఁ బనిమీఁద సమీప గ్రామముల కేగవలసినయెడ సాధారణముగ నీయాటపయిఁ బ్రీతిచేతఁ బోవకయ తప్పించుకొనువాఁడను. ఒకవేళ తప్పని విధి తటస్థించిన వెళ్ళునుమాత్రము వెళ్ళువాఁడను కాని నామనం బాటమీఁదను దృష్టి యింటిలోపై నుండునది. వెళ్ళినగ్రామమందు నాకుభోజనముసల్పు నవసరముగలిగనేనిఁ ద్వరగ నది ముగించుకొని యెఱ్ఱని యెండలోనైన నెత్తిమాఁడుచుఁ గాళ్ళుగాలుచుండినను గొంతులోని మెతుకు లింకను గొంతులో నుండగనే యింటికిఁ బరువిడువాఁడను. నేను వెళ్ళువఱకే యాట ప్రారంభమయి యుండెడిది. ఆయాట యం దిట్టి యభిరుచిగల నాకీచీట్లచూపు మనోవికాసమును గలిగించె నన్న వింత యేమున్నది? అవధానులవారును నేనును నాట ప్రారంభించితిమి. సాయంతనమువఱకుఁ దనవి సన నాట నాడితిమి. అంతటఁ దిరిగి భుజించితిమి.

అవధానులవారు పరుండ నాకొక యఱఁజూపి తా నెందేనిఁ జనెను. ఆనాఁటి రేయి నేను సుఖముగా నిద్రించితిని. మఱు దినమును నీవిధముగా నే యభ్యంజనాదికృత్యములును నవ

కాయ పిండివంటలతోడి యాహారమును మధ్యాహ్నము చతుర్ముఖపురాణమును జరుపఁబడెను. మూఁడవదినము లీలాగుననే జరిగెను. నాలవనాఁడు, అనగా, గురువార ముదయమున వెనుకటివలె నేను స్నానమున కభ్యంజన గృహంబునకుఁ గొంపోఁబడితిని.

ఆనాఁడు నన్ను స్నానము చేయించినది వెనుకటి బాలుఁడు గాఁడు. ఆనాఁ డాబాలుఁడు నా కగుపడలేదు. బాలునకు బదు లొక వృద్ధనారి నాకు శిర సంటినది. ఆమె నన్నొక యెత్తుపీఁటపయిఁ గూరుచుండఁబెట్టి పరిమళవస్తుమిళిత తైలమున శిరము నంటుచుండెను. ఆమె యీలాగు నా శిర మంటునెడ నొకప్పుడు నా భుజముపయి వెచ్చని నీటిబొట్టు లొకటి రెండు జారెను. ఇదేమని విచారించుచుండ మఱి రెండుబిందువులు పడెను. అంతట నా ముఖము పయి కెత్తి యాముసలిదాని మొగమునం జూడ్కి నిలిపితిని. నా బుజముమీఁద జారిన దామె బాష్పధారాజల మని యపుడు గ్రహించితిని. ఆమె యేటికో దుఃఖపడుచుండెను.

'అమ్మా! యేల వ్యసనపడెదు? నేఁ డెద్దియేని యశుభవార్త నీచెవిం బడెనా?' అని యామె నడిగితిని. కాని యామె కొంతవఱకు నాతోడ నేదియుం జెప్పకపోయెను. నాప్రశ్న యామె వ్యసనమును హెచ్చించెను. తన మనసులోనిమాట నాకెఱింగింప నిష్టముగలదానివలె మాత్రము నాకగుపడెను.

'అమ్మా! చెప్పుము. నిన్నుజూచినది మొదలు నాతల్లిని

గాంచిన ట్లున్నది. నీ యీదుఃఖమునకుఁ గారణ మేమయి యుండును' అని మరల నడిగితిని. నా యీకడపటివేఁడికోలామెమనసంబును గఱఁగించి వేసెను. ఆమె దుఃఖము నాపుకొనఁజాలక పోయెను. తనమనంబునందలిగోప్యము లికదాఁచ లేనని యామె యనుకొనెను.

"నాయనా! నేనొక ఘోరపువర్తమాన మిపుడు నీ చెవి వేయవలెను"అని మెల్లననొడివి,నలుదెసలంబరికించి చూచెను. అచట నేరునులేరని తెలిసికొని మరలనన్నుఁజూచి"ఈగృహంబున కేలవిచ్చేసితివి, నాయనా? ఇది మృత్యుదేవతానిలయమే" అని కన్నుల నీరిడెను.

"అమ్మా! నా కేమిమూడనున్నది? నాతల్లికి నేకపుత్త్రుఁడను. క్రొత్తగ వివాహమాడఁ దలఁచి కన్నె నింటికిం గొనితెచ్చికొంటిని. నాగతి యేమిగానున్నదో సత్వరముగఁ దెలుపవమ్మా" అని దీనముగా వేఁడికొంటిని.

"తేపటితోడ నీయాయువు చెల్లనున్నది. నాయనా! దైవము నీయెడల నెట్లున్నవాఁడో" అని యామె పలవించెను.

ఈవార్త వినినతోడన నాకాలుసేతులు చల్లబడినవి. అప్పుడ నాయయిదుప్రాణములును నాబొందిని వదలినట్టులఁ దోఁచెను. కొంతప్రాణమున నిలచితిననియనుకొంటిని. అమ్మా! ఉన్నసంగతి నాకెఱింగింపు మంటిని.

"నాయనా! ఈయింటి యజమానుఁ డొకరసపుత్త్రిపేరుఁడు. శక్తిపూజాధురంధరుఁడు. అగ్నికి వాయువు తోడనిన ట్లీతనికి నిన్నిచటికిఁగొనివచ్చిన బ్రాహ్మణుఁడు తోడపడిన

వాఁడు. ఈ బ్రాహ్మణుఁ డిచ్చటనయిన నీవలె నదృష్టహీను నొకమనుజునిం గొని తెచ్చి యిందు విడుచును. ఆరాజపుత్త్రిఁ డామనుజుని స్వహస్తమున నంబకు బలియిచ్చుచుండును. ఇక్కార్యము ప్రతిశుక్రవారమును జేలయందు జరుపుదురు. తేపే శుక్రవారముగాన నీప్రాణములు జేపే వారు తీయ యత్నింతురు. ఱేపటితోడ నీకీయుగము క్రింగనున్నదిగదా యని నాహృదయము పరితపించుచున్నది" అని మెల్లన రోదన మాచరించెను.

అంతట నాయావజ్జీవములు నన్ను విడిచెను. నేనచట నొకదారు స్తంభమువలె నేమియుఁ దోఁచక పలుదెఱంగులగు తలంపులచే నాక్రమింపఁబడిన మనంబుతోడఁ గొంతవడి నిల చితిని. ముదుసలియయిన నాతల్లి నాకప్పుడు జ్ఞాపకమునకు వచ్చి యామెకు రానున్నదుర్దశనుగుఱించి చింతించితిని. కావలెనని కోరి ఋణబాధకయిన నొప్పుకొని నాభావిదేహ సౌఖ్యమునకై చేయిపట్టుకొని స్వగృహమందు దిగవిడిచి వచ్చినయయ్యబలను బాణిగ్రహణమొనర్చికొన నోఁచికొనక పోతినని విలపించితిని.

తల్లీ! దీనికెద్దియయిన నుపాయము గలిగినఁ జక్కగ విచారించి యెట్లయిన నన్నీగండమునుండి తప్పింపఁగదమ్మా నాతోడిదలోకముగనెంచి నన్నెప్పుడుగాంతునాయని నారాక కెదురుచూచు నా వృద్ధజననికడకు నన్ను జేర్పవమ్మా!' అని పలువిధముల వేఁడికొనుచు నాపె పదములపయిం బడితిని.

నాయవస్థచూచి జాలిఁగొని యావనిత నన్నులేవనెత్తి

" నాయనా! భయపడకుము. నీ యాపదను దప్పింప దైవమిప్పుడు నాకొక యుపాయమును దోఁపించుచున్నాఁడు. అది నీకుఁ దెలిపెదను. దాని నేరెఱుంగకుండ నెరవేర్చితివేని నీ వీ యాపదకుఁదప్పి బ్రిదుకుదువు " అనెను.

"తల్లీ! అ దెద్దియో యెఱింగించి నన్ను రక్షింపుము " అంటిని. " అబ్బాయీ! నీ వుండు శయనగృహమునకుఁ బ్రక్కనున్న దొడ్డిలో నొకమలవిసర్జనస్థానము గలదు. అది నీ వెఱింగినది గదా ? "

" అమ్మా; దాని నే నెఱుంగుదును. నే నీ నాలుగు దినములనుండియు నా మఱుఁగు పెరటికే వెళ్ళుచున్నాను. "

అచటనుండు మలవిసర్జనరంధ్రమున నొకపలకరాయి మూఁతగా వేయఁబడియున్నది. నేను నీ కొక చిన్నయినుప గడ్డపార నిచ్చెదను. ఆ గడ్డపార సహాయమున నా రాతిని మీఁటవేసి యెత్తివేయును. అది సులభముగా నూడివచ్చును. అప్పు డారంధ్రము మనుజుఁడు దూరగలిగినంత పెద్దదియౌను. దానినుండి దిగి చిన్నతలుపు నీ బీగముతో తెఱవుము. ఆ త్రోవ నిన్ను దలవాకిలియొద్దనున్న వెలిబయలునకుఁ జేర్చును. ఆ బయలున బడినతోడన యందు నిలువక యాసందునఁబడి యుత్తరముగాఁ బరువిడి పెద్దయంగడివీధి చేరుము. అట్లు చేసితివేని నీ ప్రాణములు నీకు దక్కును. ఈ పని నీ వీ రేయి దిశలు చీకురించగనే చేయవలయును. పగ లంతయు నెప్పటివలెనే జరుగుపనులు జరుగనిమ్ము. ఇప్పుడ నీస్నానము ముగించెదను. భోజనశాలకు నిన్నుఁ గొనిపోదురు. అచటికి

దినమువలెనే యేగి భుజించుము. పిదప నీ గదికి నీవు చేరుము. నేఁడా జాలావధానులుగాని యా బాపనపోఱఁడుగాని గృహమున లేరు. నీ కార్యనిర్వాహణమున కిదియొక శుభసూచకము" అని చెప్పి యొక చిన్న మూఁట తాళముచెవియు నొకచిన్నయినుపగడ్డపారయు నా కొసఁగి యామె చనెను. ప్రొద్దుగ్రుంకువఱకు కాలము జరిపి యా ముసలిదాని యాలోచనప్రకార మొనర్చి తప్పించుకొని ఆ గృహము వెలుపలఁ బడితిని" అని భీమునితోడఁ గామయ్య చింతాకరమగు తనవృత్తాంతమంతయు వివరముగఁ దెలిపెను. భీముఁ డాతనిచారిత్రము విని సంతసించెను. పిదప భీముఁడు కామయ్య నూరార్చి యాతని నెందేనిఁ గొని చనెను.

———— :o: ————

## ౨౦ వ భాగము.

"ఇప్పు డెంతప్రొద్దయియుండవచ్చును ? గ్రహస్థానములను బట్టిచూడ నింక జాముప్రొద్దున్నట్లు గనుపడుచున్నది. నేఁ డేటికో నాకుఁ గంటికి నిదురరాలేదు. రాకపోవుట న్యాయము ! ద్యూతాదివ్యసనాసక్తులకును, బ్రియవస్తుసంయోగకాలవిళంబనాసహనసంతప్తచిత్తులకును నిదుర వచ్చు టెట్లు? పూనినకార్యంబు గొనసాగినం గదా మానసంబున కూరట గలుగుట ! మంచికాల మెప్పటికైన రాకయుండునా? నాచేఁ బంపఁబడిన సేవకుఁ డింకను రానిహేతువేమి ? " అని యను

కొనుచు నెవరికొఱకో నిరీక్షించుచున్నవానివలె నొక నడి వయసు బ్రాహ్మణుఁడు నాగేంద్రమున నొక యింటి బయలి వసారాలోఁ గూరుచుండి యుండెను. అప్పు డొక పదునెని మిది వత్సరముల పిన్నవాఁడు సేవకపురస్సరముగ నా గృహ సమీపమున కేతెంచుచుండెను.

బ్రాహ్మ - ఎవ రావచ్చునది ? భీమా ?

భీము - నేనే! భీముఁడను. వారి నిందుఁ దోడి తెచ్చితిని.

బ్రాహ్మ - ఓహో ! మిత్రమా ! అరిభీమణా ? నీకు స్వాగతము.

అరి - స్వామీ ? నమస్కారము.

బ్రాహ్మ - అరిభీమణా ? నీ ప్రయత్నము నిర్విఘ్నముగ నెరవేరెను గద ? జాలావధానులు పట్టుపడియెనా ?

అరి - మీ యూహా పోహణలకుఁ దిరు గేమున్నది ? మీ రెన్నియక్షరములు సెలవిచ్చితిరో యవియన్నియు నిక్క వముగ నందు జరిగెను. జాలావధాని చిక్కలేదు !

బ్రాహ్మ - చిక్కనే లేదా ? భూతివర్మయైన మనకుఁ గైవస మయ్యెనా ?

అరి - ఆతండునుఁ జిక్కియుఁ జిక్కనట్లయ్యె. బంధింపఁ బడి మన సాంకేతికస్థానమునకుం గొంపోవుచుండ నతఁడు పాఱి పోయెను. బ్రాహ్మ-భూతివర్మ సామాన్యుఁడు గాఁడు. అతఁ డతి సమర్థుఁడు. బాహుబలశాలి. ఆ సమయమం దతని చేత నాయు ధము లేదు. అది దైవానుగ్రహము ! ఉన్నయెడల నతనింబట్టు

టయు దుష్కరముగ నుండియుండును. అయిన నిప్పుడు మించి నది లేదు. గుట్టు బయలుపడినది గదా.

వా రిరువు రీలాగు సంభాషించుచుండ నొక భటుఁ డే తెంచి నమస్కరించి వారియెదుట నిలువంబడెను. బ్రాహ్మణుఁడు వానింగాంచి యేమిరా విశేషము ? అని యా సేవకు నడిగెను. "దేవరవారితో నొకచిన్నమనవి గలదు. అని సేవకుఁడు నొడువ బ్రాహ్మణుఁడు దిగ్గనలేచి యా సేవకునితో నావలకుం జనెను. కొంతసేపటికి బ్రాహ్మణుఁడు మరలం జను దెంచి యరిభీమణునిచెంతఁ గూర్చుండి యరగంట కాల మాత నితో నేకాంతముగ నెద్దియో మాటలాడెను. అంతట వా రిద్ద ఱచ్చోటువాసి యెందేనిఁజనిరి.

అప్పటికిఁ దూర్పు రేకలు దెల్లవాఱుచుండెను. దివియల కాంతి తఱుఁగఁజొచ్చెను. అంత రేకంటు చీఁకటిగొంటువయిం గంటుచే శేగురువారిన మోముతోడఁ దూరుపుఁగొండవయిం దోఁచెను. పసులకాఁపరులు చలిదిచిక్కంబుల బుజంబులవయి నిడికొని పచ్చికబయళ్ళం బసినేదఁ బసులఁ దోలికొని పోవు చుండిరి. అప్పటికి నుదయము తొమ్మిదిగంటలయినది. అప్పు డొకబాటసారి నాగేంద్రమునుండి పశ్చిమముగా రాచబా టను పయనమయి పోవుచుండెను. వాని వాలకంబుఁ జూడ వాఁడు కాపువాఁడని నిశ్చయము సేయవచ్చును.

వస్త్రము గొప్పదయినను నాతండు దాని మోకా ళ్లుదిగకుండఁ బయికిఁజెక్కి కట్టుకొని దాని కంగవస్త్రమను నామము సార్థకపరచెను. తలకుమించి మెండుగ్రకతట్టవలెనున్న

పెద్దతలగుడ్డయొకటి తలకుఁజుట్టఁబడియుండెను. కాఁపులు దఱిచుగ ధరించునంగీ వేసికొనియుండెను. పైన నొక కంబళము ముసుగు వెట్టికొని యుండెను. మూఁపుపయిఁ జిన్నమూట యొకటి యుండెను. తోలువారుతోఁ గుడిబుజమునుండి యెడమ ప్రక్కకువచ్చునట్లు తగిలించియున్న తోలుసంచియుఁ గలదు. అతండు దారినడచుచు నిట్లు మాటలాడసాగెను.

"ఆహా! ఏమి ఘోరకలివచ్చినది! భగవంతుని కృత్యములతి విచిత్రములుగదా! ఆయన కాగ్రహముకలిగిన నరపాలునంతటి వాని నిఱుపేదను జేయఁగలఁడు. అనుగ్రహమువొడమిన నిఱుపేదనుసయితము సురనాథుగా మార్పఁగలఁడు. ఓ పాపపు దైవమా! నీచెయ్వు లగమ్యగోచరములుసుమీ? ఎట్టివాని కెట్టి యిక్కట్టుదెచ్చితివి! ఎంతదయగలవాఁడు! ఎంత బాహుబలశాలి! బీదసాదల కెంతయాదరువుగ నుండెడివాఁడు! బీదయైననేమి! యతనికడ కేగినయెడ నాతని యాదరణమునం దృప్తి నొందక మరలఁ జనుదెంచువాఁ డెవఁడు? బాలుఁడనక వృద్ధనక గొప్పకొద్దుల విచారించక యెవ్వరేసమయమం దెం దాతని సమీపించినను, వారల కాంతర్య మిచ్చి చనవిచ్చి మాటలాడు నిగర్వశిరోమణి. అట్టి యుత్తమపురుషున కెట్టిపరిభవము రానున్నది! ఇంతకాలమునుండి జరుగుచున్న యీ మహాశయుని యుద్యోగమునకు నేఁటి కీదశ సంభవించినది గాఁబోలు! ఆక్రొత్తపురుషుఁ డెంతసాహసుఁడో! మహా ప్రతాపరాశి యగు భూతివర్మ శౌర్యమాతనికడ నెందులకుం గొఱగానిదయ్యెను. లోకములనెల్లఁ దన మాయాబల

మున గుటుక్కుమని మ్రింగఁజాలిన జాలావధానుల తెలివి యెం దరిగెనో! పిన్నవయసు వాఁడయినను నాకొత్తమను జూఁడు తన సాహసమేధాబలంబులవలన భూతివర్మ జాలావధానుల నిర్వ్యరను జయించినవాఁడు. జాలావధానులు గుడి మ్రింగువాఁడు. ఆపిన్నవాఁడు గుడిని, గుడిలోని లింగమును మ్రింగువాఁడుగ నున్నాఁడు. అవధానుల నేర్పరితనమును భూతివర్మ దర్పమును వాని సామర్థ్యవాతూలముముందుఁ బేల వమగు తూల మయ్యెంగదా? దైవబలములేనివాఁ డెట్టి వాఁడయినను నాపదలకు గుఱియయి యుండఁడా!

భూతివర్మ యిప్పు డెందున్నవాఁడో! ఆతని నేనెట్లు కనుఁగొనఁ గలను? ఆతని కిప్పు డేపాడిల్లా యేబీడు పొదయో శరణముసఁగి యుండనోపు. ఆ కనుబకునదేగద జీవనమరము? అందేపోయి వెదకెదను. ఈనదీజలంబులఁ గొంత సేదఁదీర్చికొనిమొదను" అని విలోకానదిలో దిగి కడు పునిండ జలములం గ్రోలి యానదీతటంబునగల తరుచ్ఛాయను మూట తలక్రిందఁ దలగడగ నమర్చికొని కొంత విశ్రమించెను. ఇచటనచటఁ దిరుగుటవలనఁ గలిగిన యాయాసముచేతను నెండవేఁడిమివలనఁ గలిగిన బడలికచేతను వానికిఁ గొంచెము కునుకుపట్టెను.

అప్పు డదివఱ కందెందొ రహస్యస్థలమున నిలచి యున్న మఱియొక పురుషుఁ డచ్చటికేతెంచి పరున్న మనుజుని మోమున దృష్టినిలిపి కొంతదనుకఁ జూచి మనమున నిట్లనుకొనెను. 'ఈతఁ డెవఁడు? వీనిమోము విచారసూచకముగ

నున్నది. సేవకుఁడు వక్కాణించి యున్నవాఁ డితఁడయి యుండునా? ఆహా! అటులనే యున్నది. కానీ, చూచెదను.' అని యాతం డా పరున్న మనుజుని నాపాద మస్తకము పరిశోధించెను. ఆ కాఁపువాని కంచుకపు సంచిలో నొక యుత్తరము గాన్పించెను. దానిని మెల్లన నీవలకు లాగి చూడఁ బయివిలాసము 'భూతివర్మగారి' కని యతనికిఁ గనుపడెను. ఆ చిఱునామా కంటఁబడఁగనే యా రెండవ పురుషుని యాతురత మఱింత యెక్కువయి యా యుత్తరమును విప్పి తనలోఁ దా నిట్లు చదువుకొనెను.

“గౌరవపాత్రు లగు భూతివర్మగారికి —

జాలావధాను లాశీర్వదించి వ్రాయున దేమన: తాము సాగరునిచే నంపిన లేఖ యిప్పుడ నా కందినది. సంగతులఁ జదివికొన నాకుఁ బరమానందమయినది. బెబ్బులివాఁడికోఱల నడుమ నిఱికికొనిన భాగము దప్పించుకొనిన విధమున మీ రా యరిభీషణుని బారిం దప్పి బ్రతికితిరి. అట్టి మహాశూరుని చేతం జిక్కియుఁ దప్పించుకొనఁ గలుగుట దేవికి మనయెడం గల నిరుపమాన కరుణావిశేషంబునన గాని యితరము గాదు. ఆ దేవీ ప్రసాదముననే నే నెట్లో యా మృత్యువుం దప్పించుకొని గుహాపడలి యావలం బడి నేఁటివఱకుం జచ్చిచెడి ప్రాణము దక్కించుకొనఁగలిగితిని. మీ మానసము నపహరించిన యా మీననేత్రి సురక్షితయయి యున్నది. నే నపాయమునుండి వెలువలం బడినతోడన నా యొనర్చిన ప్రథమకార్యమా చేడియం గాఁపాడుకొనుటయే. సురక్షితస్థలంబున

కాపుం గొనిచని భద్రముం గావించితిని. ఆ ముసలిదానినే
యీ చెలికిం దోడుచేసితిని. మీరుకోరిన తెలుంగున రేపురాత్రి
యా సతిని నీ యూరి పశ్చిమ భాగమందున్న చక్రపురమునం
దలి యీశ్వరదేవాలయమున కెదుటనున్న సత్రమునకుం
జేర్చెదను. గమ్యస్థానము చేరిన వెంటనే తమ రా యువతిని
మీ సన్నిధికిం గొంపోవు నేర్పాటుం జేయవలయునని నా కో
రిక. మీరుకోరిన విధమున రేపటిరేయి జాముప్రొద్దుపోయిన
పిదపనే యాసత్రమునకు విచ్చేయుండు. అట్లుగాక యేర్పాటు
లకు వ్యవధి యయ్యెనేని నే నామెను కాపాడుట కష్టసాధ్య
ము. శత్రువులు బలవంతులు, మయిమయిం బోనిచ్చువారు
గారు. వా రొడ్డు నురులలోం దిరిగి మనము చిక్కుకొంటిమేనిం
దప్పించుకొనుట దుస్తరము.

అరిభీమణున కే నంతభయపడుట లేదు. కాని జిత్తులమారి
యయిన యా విష్ణుశర్మకు భయపడక తీరదు. ఆతండు బుద్ధి
శాలి. ఆలోచనపరుండు. సమయమెఱింగి మనలను మట్టు
బెట్టంజూచుచుండును. మనరహస్య మాతని కెట్టులో తెలిసియే
యుండును. మొదటినుండియు నేనాతనిపయి నొక్కకన్ను
వెట్టియే యున్నవాండను. ఆ చెలి నేలాగయిన మీ చెంతకుం
గొంపోవుమార్గ మాలోచించుండు. ఉపేక్ష సేయకుండు.

ఇట్లు విన్నవించు, భవదాశ్రితుండు,
జాలావధానులు.

ఆ యుత్తరము చదువుట ముగించి లోలోన సంతసిం
చెను. ఇంతియకాక యా యుత్తరమును దాంగొని దానిస్థాన

మున దానికి బదులు మఱియొక లేఖ వాని చొక్కాసంచిలో నునిచి తాను దనత్రోవం జనెను. కొన్నినిముసముల కావల నాకాఁపువాఁడు మేలుకాంచి లేచి జీవనమరమువయిపునకుఁ బయనమై నదిని దాఁటుటకు రేవులో దిగెను. తాను నిద్రా వస్థయం దుండిన సమయమున జరిగిన వృత్తాంత మేమియు నాతనికి దెలియదాయెను.

-:0:-

## ౨౧వ భాగము.

——(o)——

నాగేంద్రపట్టణమునకుఁ బశ్చిమమునఁ గొంతదూర మందుఁ జక్రపురియను గ్రామమొకటి గలదు. ఆగ్రామమున శివాలయముగలదు. ఆయాలయమున కెదుట నొక కొద్ది సత్రము గలదు. అది యాయూరి కొక పెడగానుండుటంబట్టి బాట సారుల కది యంత యుపయోగకారిగ నుండక పోయినను, జనసమ్మర్దమునం దసూయఁగొని నిర్మలమై, యారోగ్య ప్రదంబగు మంచివాయువును గోరుపాంథులు కొంద ఱీ సత్రమును విడిదలగఁ జేసికొనుచుండెడివారు. ఈసత్రము వెలుపల నొకనిడుపయిన వసారాయుఁ దూర్పువైపు లోఁదట్టున నొక యఱయుం గలవు.

ఈగది గవాక్షమునుండి పదునైదు వత్సరముల సుందరియొక్కర్తుక యాత్రోవను వచ్చుచుంబోవుచున్న జన సమూహమును ఱెప్పవాల్పక చూచుచుండెను. తానొనర్చు

పని యెవరికంటనయినం బడునేమో యను భయంబునం గాంబోలు నాచెలి యప్పుడప్పు డీవలావలం బెదరి బెదరి చూచుచుండెను. ఆబిత్తరిచూపులతత్తరమును గన్నవా రున్మత్తులుగాక తక్కరు. చూపఱులమనంబును గలంచుట కాకన్నులబెళుకె చాలును. అత్రిమున నొకసారి యూవంకకుం ద్రిప్పిన జవ్వనుల నేత్రముల కనిమిషత్వము సిద్ధింపంజేయుట కాచెలువచెలువంబే చాలును. ఆమె యీపగిది నాలోచించు కొనుచుండెను.

ఆహా! ఏమియీజనుల యదృష్టము! వీరెంత స్వేచ్ఛానువర్తులరయి యున్నవారు! స్వతంత్రులవుటవలనంగదా వారి రీతి నిచ్ఛవచ్చినట్లు విచ్చలవిడిసంచరించుచున్నారు. స్వాతంత్ర్యములేనివారి బ్రతు కొకబ్రతుకా? ఒక్క మనుజులయందు మాత్రము కాదు. పశుపక్ష్యాది జంతువులయందును స్వాతంత్ర్యేచ్ఛ సహజము. అస్వచ్ఛందజీవన మతిశోచనీయము. మానధనులకు స్వాతంత్ర్యమ నిక్షేపము. అద్దియ సకల సౌఖ్యప్రదము. స్వాతంత్ర్యమునందలి యానందము దేవేంద్ర పదవియం దయినను గలుగునా? దురదృష్టుల కీయానం దానుభవ మెక్కడిది? మనుజులయదృష్టము వానిజననకాలము నంద తెలియనగును. పువ్వుపుట్టుటతోడన దానిపరిమళమును గుర్తింప వచ్చునుగదా ?

ఎవ్వరికయిన నొకప్పుడు గాకపోయిన నొకప్పుడయి నను సుఖము లభించును. నాకో? మొదటినుండియుఁ గష్టములే సంభవించుచున్నవి. శైశవమునందు నాజనని గతిం

చెను. తండ్రి నన్నెంత గోమునఁబెంచినను దండ్రియింటఁ గొలఁదికాల మెంత ముద్దులనుభవించినను, నాసవతితల్లి నాజనకుని యిలుసొచ్చినది మొదలు నాకామెపో రధిక మయ్యెను. నాకికంటెనీ రాకంటఁ బోయుట యయ్యెను. ఆపోరు పడంజాలక మరణమె శరణంబని యెంచి ప్రాణము నకుం దెంపుచేసి యెవ్వ రెఱుంగకుండఁ గాననిక్రింతలకుం బోయితిని. 'పాపీ చిరాయు' రన్నయట్లు నాకందును మరణము దొరకలేదు సరియకదా నా దురదృష్టము నన్నామోసగాని గృహంబున కీడ్చికొనిపోయి నన్ను మఱియొక గొడవపాలు జేసెను. కష్టము లెప్పుడును నొంటరిగ రావను సుజనోక్తి నాయందుఁ దార్కాణించెను. ఇన్నియిడుములఁ గుడిచియు నే బ్రతికితిని. నాయదృష్టమో లేక దురదృష్టమో యెఱుంగను. ఆజవ్వనుఁ డేతెంచి పరితపించు నాహృదయంబునకుఁ గొంత యూరట గలుగఁజేసెను. కాని లేకున్న నాదుఃఖము నన్నెంతచేసి యుండునో! ఆ మహాపురుషునివలన నాకొక దరి కలుగునని మురియుచుంటిని. కాని, మూలదైవము మరల నాకీయలవిగాని యలమటఁ దెచ్చిపెట్టెను. ఇఁక నాకేదిదరి? నాకొఱ కింక నెన్నివిపత్తులు వేచియున్నవో యెవ్వారెఱుంగుదురు.

నన్నీబంధమునుండి విముక్తిఁజేయు మహానుభావుఁ డెవఁడు! ఇనుమునుగుఱించి యగ్నికి సమ్మెటపెట్లన్నట్లు నన్ను రక్షించ నెంచిన గుణవిధానునకుంగూడ నెన్నికడగండ్లు తటస్థించెనో! ఆనవమోహనాంగుని మరల సందర్శించుభాగ్యము

నాకబ్బునా ? నాకతఁ డగుపడకపోయినం బోవునుగాక ! అతని కేయాపదయు లేక సురక్షితుఁడయి యున్న నంతియ చాలు." అని యనుకొనుచుండ నాసకియ నయనాంచలముల నుండి బాష్పబిందువు లొకటిరెండు నిద్దంపు మెఱుంగుటద్దములంబోలు నామె గండఫలకంబులం జారెను. ఆసమయమున నొకయార్తధ్వని యాయువిద చెవింబడెను. దానివిని కారణమారయ నెంచి గవాక్షమునుండి శిరమొకింతసాచి యాయన్నులమిన్న చూచెను. అప్పుడు నలువదేండ్ల యీడుగల భిక్షుకుఁ డాయువిద వసించు గదిగవాక్షమున కెదురుగ నిలువఁబడి 'ఆహా ! నన్నీయాఁకలి యెంత బాధించుచున్నది. నిన్ననుదయమునుండియు నాకెచ్చటనునొకకబళమయిన దొరకకపోయెం గదా? నేనేమిసేయుదును? కడుపునఁ జిచ్చువెట్టిన ట్టీక్షుధ నన్నింతవ్యధపెట్టుచున్నది? నాకిం దెందయిననింత ప్రసాదమిడి రక్షించుపుణ్యాత్ము లుందురా? యని యఱచుచుండెను. ఆపదనొందు వారలస్థితి ఆపన్నులకే యెఱుకగదా! ఈయఱపు వినినతోడన యెచ్చటలేనిజాలి యాబాలహృదయమునం బ్రవేశించెను. అంత నామీనాక్షి యాభిక్షుకున కొక కబళమిడఁ దలఁచి యాతనిఁబిలువుమని యొద్దనున్న ముసలిదానితోడఁ జెప్పెను. ఆముదుసలి పోయి యాతనిం బిలిచెను. పిలువగనే యాతండు గదిసమీపమున కేగెను.

ఆచెలియ యొక తెలెయందుఁ గొంతయోదనంబుఁ గొనివచ్చి భిక్షుకున కిడఁబోయెను. భిక్షకుఁ డెద్దియో యోజించుచున్నట్లు నటించుచు నా యన్నముం గొనక నిలువంబడెను.

ఆ బిబ్బోకవతియు నబ్బురపాటున నాతనిం గాంచి యాతండు తాను మున్నెన్నఁడో చూచియున్నవాఁడని దోఁచినందున నాతం డెవ్వఁడయి యుండనోపు నని కొంచెము విచారించఁ దొడఁగెను. ఆ భిక్షుకుఁడును నా మగువ విద్యుత్ప్రభ యని తెలిసికొని యూరకుండెను. ఇంతలో నెద్దియో లోనఁ జప్పుడుగా నచటినుండి ముసలిది లోనికిం జనెను. అంత లబ్ధావకాశుఁడయి యా పురుషుఁ డల్లన నొక చీటి యచ్చెలియచేత నిడి కొంత రహస్యమాడి యావలకుం జనెను.

సూర్యుఁ డపర వారాశి నధిగమించెను. జనులు తమ తమ దినకృత్యముల నెరవేర్చికొని వారివారి యిండ్ల కేగుచుండిరి. అంత నా భిక్షుకుఁడు మరల గవాక్షముచెంతం జేరి సైఁగసేయ విద్యుత్ప్రభ యా వాతాయనము దరి కరుదెంచెను. వా రిరువు రీలాగు సంభాషించిరి.

భిక్షు - చెలీ! ఆతం డింట నున్నాఁడా ?

విద్యు - లేఁడు. పగ లెందుండునో తెలియదు. రేయి మాత్రి మతనిఁ దప్పక చూతును. చీఁకటి పడుచున్నది. ఆతం డరుదెంచుసమయమే. మనము త్వరపడవలయుం జుమీ ?

భిక్షు - చెలీ ! ఆతండు కాక యిచట మఱెవరున్నారు. ఆ ముసలి దెవరు ?

విద్యు - ఆ ముసలిది నామీఁదికాఁపు. జాలావధానులు కనిపెట్టియుండును. వీ రిర్వురుగాక మఱిద్దఱు సేవకులున్నారు. వా రప్పుడప్పుడు వచ్చుచుందురు. ఇం దిపుడు లేరు.

భిక్షు - ముసలి దిప్పు డెందున్నది ?

విద్యు - నిద్రించుచున్నది.

భిక్షు - నేను లోనికి రావచ్చునా ?

విద్యు - తలుపు లోపట బిగముఁ వేసి యున్నది. ము సలిదానిని నమ్మ వలనులేదు. ఆ బ్రాహ్మణుఁడును వచ్చు సమయమైనది; గాన నిది యసమయము.

భిక్షు - చెలీ ! నీ కెంతకష్టము కలిగెను ; నిన్నుఁజూ చిన నామనసు నీరయిపోవుచున్నది. నిన్ని చెఱనుండి యొరు లెఱుంగకుండ నెట్లు తప్పింపఁగలుగుదునో కదా ? నాకేమి యుం దోఁచలేదు.

విద్యు - మనము తప్పించుకొనుట కిపుడు నా కొక్క యుపాయము తోఁచుచున్నది.

భిక్షు - అదేమి ? నన్నేమి యొనర్పుమందువు ?

విద్యు - ఆ మోసగాఁడొడో చనియున్నవాఁడు. అతండు కనుబడలి మరల నిలుసేరును. ఇందు విచ్చేసినతోడన నందే నొక్కచో నిదురించును. ముసలిదానివిషయమై యిఁకఁ జెప్పనవసరము లేదు. దాని కెపుడును నిదురయే. అది కుంభ కర్ణునిసోదరి యనవచ్చును.

భిక్షు-మన మాలసింపఁ జనదు. నన్నేమిచేయుమనెదు ? సాహసించుట కిది యదనుకాదుగదా ! వజ్రమును వజ్రము చేతన భేదింపవలెను, ఆవంచకుని వంచనవలనన జయింపనగు.

విద్యు - ఈవసారా చూచితిరిగదా ! అందు నీ రేయి వరుండుఁడు. వచ్చునపుడు డెచ్చోనయిన మగవానిదుస్తునొకటి సంపాదించికొని తెచ్చి మూటకట్టి దాని మీఁతలక్రిందఁ దల

గడగా నుంచికొని యున్నాండుడు. నే నీవేసముతో వెలు వడిన నన్నెవ్వరయిన గుర్తింపకమానరు. అప్పుడు మనవు యత్నమంతయు విఫలమగును. మీ రాలా గొనరించితిరేని నే నెటులయిన నాముసలిదానిని మోసగించి వెలుపలికిం జను దెంచెదను. నే బయలువెడలినవెంటనే నీతలక్రిందిమూటను నాకందిండు. దాని నే ధరించుకొని నాదుస్తు మీకిచ్చెదను. అపుడు సులువుగ మనము తప్పించుకొని పోవచ్చును.

భిక్షు - బీగముచెవి నీయొద్దన యున్నదా?

విద్యు - ఆముసలిదానియొద్దన యున్నది. దాని నెట్ల యిన వంచించి యది సంగ్రహించెదను.

భిక్షు - ఇదిసరి. నీయుపాయ మతిశ్లాఘ్యము. దుస్తాక కొండైన దడివి తెచ్చెద. నీవింతలో జాగ్రత్తపడుము. నేఁబోయి వచ్చెదను.

విద్యు - మరల నిచ్చటనున్నట్లు విచ్చేయవలయుఁజుడీ!

అని చెప్పి భిక్షుకుఁ డరిగినపిదపఁ దానును లోనికిం జనెను. భిక్షుకుఁడు తానూనిన కార్యము ఫలోన్ముఖమయి నందున కెంతయు సంతసించెను.

## ౨౨వ భాగము.

---

పగలంతయుఁ దమతమపనుల నెరవేర్చుకొనుటయందు బాటుపడి యలసటనొందియున్న జనసంఘమున కొంకెంత

విశ్రాంతి నొసంగఁదలంచి కాఁబోలును, దివస్పతి తనపగటి పయనమునుజాలించి చరమాద్రి యవ్వలివైపునకుం జనియెను. అంధకారము క్రమక్రమముగ దిక్సంధులవ్యాపించుటచే దివాంధములు మొదలగు రేదిరుగుడుజంతువులకుఁదప్పఁదదితరజంతుసంతానముల కన్నులు చీకురించెను. ప్రజాసంచారము చేతను, పశుపక్ష్యాది తిర్యగ్జంతువులరాకపోకలచేతను, శిల్పిజనవృత్త్యనుగుణములగు సమ్మెటమొదలగు పనిముట్ల చప్పుడులచేతను శబ్దసంపూరితమయియున్న స్థలంబులన్నియు నపుడు నిశ్శబ్దముగను నిర్మలముగను మాఱెను. సమీపమునకుం జనుదెంచినంగాని యొండొరులగుర్తింపవలనులేనట్లు ప్రపంచమంతయు నెక్కడఁజూచినఁ జీఁకటి పుంజీభవించెను. గ్రామము మాటుమడఁగియుండెను.

అపు డింతకుముందుఁ జెప్పఁబడిన చక్రపురియందలి సత్రపువసారాలో నొకచాటసారి మూటనొకదానినిఁదలక్రింద నిడికొని పరుండియుండెను. ఈతఁడెవ్వఁడో మన మూహింపఁగలము. ఆతండు భిక్షుకుఁడు. ఈతనికిఁ బన్నుండినతోడన బడలికవలన నిదురపట్టెను. అచ్చటనే యతనిసరసన గదిద్వారము చెంత మఱియొకమనుజుఁడుకూడ నటులనే పవ్వళించియుండెను. ఈ రెండవమనుజుఁడు భిక్షుకుఁడు నిదురించినపిదప మెల్లనఁజనుదెంచి యచ్చటఁ దానునుఁ బరుండియుండెను.

ఇతనిరాక భిక్షుకుఁ డెఱుఁగఁడు. రెండవవాఁడందు నిదురఁగూరినవానియట్లగుపడుచుండెను గాని నిజముగ నతండు నిదురించుటలేదు. మిగుల మెలకువఁగలిగియుండెను. ఈలాగునఁ

గొంతకాలము వీరిరువురు పవ్వడించియున్నతఱి నీరెండవ పురుషుఁడు లేచి భిక్షుకునితలక్రిందనున్నమూటను మెలకువతోఁదీసి యాస్థలమునందుఁ దాఁదెచ్చిన మఱియొకమూటను నతనితల క్రిందికిఁ జొప్పించి, మరల నెప్పటియట్ల తనస్థానమునందుఁ దాఁ బరుండియుండెను.

నడిరేయియయినపిదప సమయమువేచియుండి విద్యుత్ప్రభ చప్పుడుగాకుండ గదితలుపుఁదెఱచికొని కాలుకాలుం గదలనీయక యడుగులిడుచు వెలువడి వసారాలోని కేతెంచెను. ఆమె యాలాగున వెలుపలికిరాఁగానే యందుఁ బరున్న రెండవమనుజుఁ డతివేగమునఁ దనతలక్రిందిమూట నా కలికి కందిచ్చెను. ఆమెయు నాదుస్తును ధరించుకొని తనదుస్తులని కొసంగెను. అంత బురుషరూపిణియయిన విద్యుత్ప్రభయు నీరెండవపురుషుఁడును నతిత్వరితగతి నచ్చోటు వాసి రాజమార్గమునంగాక సందుఁగొందులం బడి యెందేంజనిరి.

వీరిరువు రిత్తెఱంగునం జనిన కొలఁదికాలమునకు భిక్షుకుండు మేలుకాంచి నలుదెసలం బరికించిచూచెను. కాని యచ్చ టెవరునుం గానరారైరి. గదిద్వారము కొంచె మోరవాకిలిచేయఁబడియుండెను. అతఁ డాగదిలోనికిం బ్రవేశించెను. ఏమిచిత్రము! విద్యుత్ప్రభ యందుఁగానఁబడదయ్యె. ముసలిది మాత్రము నిద్రించుచుండెను. మనుజుని కాలియలుకుడు చెవింబడఁగనే యావృద్ధసతి యదరిపడిలేచి తనరక్షణమునందునుపఁబడిన యబలంగానక 'విదుత్ప్రభా, విద్యుత్ప్రభా' యని పిలుపుమీఁదఁ బిలుపుగఁ గలువరించుచుఁ గన్నులు విచ్చి

చూచెను. వెలుఁగుచున్న సన్నని దీపపువెలుతురున నాభి
క్షుకుఁడావిడుఁ గానఁబడియెను. హఠాత్తున నాతనింగాంచుట
వలన దానిమనంబు సాధ్వసపూరిత మయ్యెను.

అట్లు భయాకులితమానసయయి నోట మాటరామి
నది యూరకనిలువఁబడెను. ఆస్థితియందున్న వృద్ధవనితం
గాంచి 'ఓముసలిదానా! ఏలయిట్లుభయంపడెదు? నీవెవరవు
భయమువదలి నోడువుము' అనిభిక్షుకుఁడావెనడిగెను. ఆమె
భయకంపిత శరీరయయి యేమియుందోఁచక యెవ్వియో
కొన్నితబ్బిబ్బుమాటలు పలికెను. కాని యాభిక్షుకుని సాంత్వన
వాక్యంబులఁ గలఁతఁదేఱి 'స్వామీ! నేను భూతివర్మయింటఁ
బనిచేయు నొకభిల్లవనిత' నని యావె బదులుచెప్పెను.

"ఇచట నొంటరిగా నేలయుంటివి? నీయజమానుఁడెచట
నున్నాఁడు?" "నాయజమానుఁడు నన్నొకస్త్రీరత్నమునకు రక్ష
ణగ నిందునియమించియున్నవాఁడు. ఆజవ్వని యిప్పుడెం దరి
గెనో కానఁబడదు. ఈసంగతి నాయజమానునకుం దెలిసెనేని
నాయన నన్నూరకవిడువఁడు. ఎక్కడనో నా కీపాడునిదుర
పెద్దమ్మవలెవచ్చి నన్నుమోసగించినది" అని ముసలి దనెను.

'ఆస్త్రీరత్నముపేరేమి? ఆమె యెందరిగియుండెను?'
"ఆమెపేరు విద్యుత్ప్రభ. ఈరేయి యావెను నాయొద్దనే
పన్నుండఁబెట్టికొని నిదురించితిని. ఆమెయేమయ్యెనో తెలియఁ
జాలను.' అని వృద్ధవనితయనెను,

ఆమె యగుపడకపోయిననేమి? ఏల యిట్లంగలా
ర్చెదవు? 'అంగలార్చుటకాక మఱేమున్నది, నాయనా!

ఆపెనుఁ జూచని యుత్తరక్షణమున నాయజమానుఁడు నన్ను క్షమింపఁడు సరియగదా; నాప్రాణముతో నన్ను విడువఁడు.' 'నీకీయపాయమునుండి తప్పించుకొన నిష్టముకలదా?' అయ్యా! మీపుణ్యము! నన్నెట్లయిన నీవిలయమునుండి తప్పింపుఁడు.' నీయజమానుని వదలివేయుము. నీకు మేలు కలుగును. అట్లేచేసెదనుగాని వీరియొద్ద నాకొమరుఁడు చిక్కిపోవునే! నేను వారిని విడిచిన వానికిఁగలుగనున్న యుపద్రవ మతనికిఁగలుగును. ఏమిచేయుదును? అని ముసలి దనెను. 'నీకుమారుఁ డెవఁడు? రక్తాక్షుఁడా? 'అవును నాయనా. అతఁడే?

'అతనికేమియు నపాయము గలుగనేరదు. ఆతండు సురక్షితుఁడయి యున్నవాఁడు. నీవిప్పుడ నావెంటరమ్ము' అని భిక్షుకుఁడనెను. ఈమాటల కుబ్బి తబ్బిబ్బులయి ముసలిది తానచ్చటన యున్నయెడ జాలావభానిభూతివర్మలవలనఁ దప్పక తనకపాయము కలుగునని తెలియును గానఁ దానతని తోడవెళ్లెను. ఆహా! భయ మెంత చెడ్డదోగదా! భయము మనుజుల మనోధైర్యమును నిబ్బరమునుఁ బారఁదోలును. ఒకప్పు డది మనుజుల పురోదృష్టిని నయితము సంకుచితము చేయును. తమ మేలుగీడుల నరయనీయదు. భయపడినవానికి వివేచనాశక్తి స్ఫురింపనే స్ఫురింపదు. ఆపత్కాలమందు ధైర్యమే మనుజులను గాపాడునది 'విపది ధైర్యమ్' అను మాట వినలేదా? అట్టిసమయములయందు మనస్థైర్యమును సడలించితిమా, భయము మనల నేమిచేయనేరదు? చూడుడు.

పిలిచినది కొ్రత్తమనుజుఁడు. ఇదివఱ కెన్నఁ డాతనిగుణంబు తెలియదు. అతనివెంటఁజనిన శుభమా యశుభమా, యని విచారించలేదు. తనవశముచేయఁబడిన వనితామణి గానుపించ దనుచింత మనంబునఁబ్రవేశించినతోడన యామదుసలిదాని కాలోచనాశక్తియు న్తమించి యాభిక్షుకునిచేతి యాటబొమ్మ యయ్యెను. ఆభిక్షుకుఁడంత నొకసైగచేయ నొకభటుఁడే తెంచెనుఁ ఆభటున కాముసలిదాని నొప్పింప నాతఁడామెను వెంటఁబెట్టికొని యెచ్చటికో యేగను. అంతభిక్షుఁకు డెద్దియో యాలోచించుచు నాపా్రంతముననే తిరుగుచుండెను.

——o*o——

## ౨౩ వ భాగము.

"ఆహా! 'దురదృష్టులకర్మము పరంపరగ హెచ్చు' నను నార్యోక్తి కేలభంగముకలుగును! తానొకటి తలచిన దైవమొకటి తలంచును గదా! గోడలకుఁగూఁడ జెవు లుండుననుట సత్యము. కాకున్న మారహాస్య మీదోసకారి వినుటెట్లుతట స్థించును! భిక్షుకరూపియగు విష్ణుశర్మను జూచినపుడు నాపా్రణములు లేచి వచ్చినట్లయ్యె. ఇఁక గట్టునఁబడితినని యనుకొంటిని. అతని సహాయము నా కష్టవిముక్తికొక ప్రబలకారణమా ననుకొంటిని. తుదకు నా యదృష్టము మఱియొకవిధముగఁ బరిణమించెను. పాము గఱచియు పట్టి నోరయ్యెను. చేసినప్రయత్నము లన్నియు బూదిలోవే్రల్చిన

గతి యమ్యెంగదా ! విధినిఁ దప్పింప నెవరికి సాధ్యమగును. " లలాటరేఖా నపునఃప్రయాతి " యనునట్లు పూర్వకృతకర్మ ఫల మనుభవింపక తీరునా " అని యనుకొనుచుఁ బరితపించు మానంబుతో నొక యువతీలలామ మొకయింటియందుఁ గూరుచుండి యుండెను. ఈ మందభాగ్య యెవ్వరని తలంచెదరు ? ఈమె విద్యుత్ప్రభ. పురుషవేషిణియయిన విద్యుత్ప్రభయు నొక పురుషుఁడు నారేయి నల్లసత్రమునుండి యత్తెఱఁగునఁ బరువిడిపోయిరని మనమెఱుఁగుదుము. వారిరువురా లాగున నడిరేయి నందుగొందులం బడి చనిచని యాయూర నొక జనరహితమగు గృహముం బ్రవేశించిరి. అంతటఁ గొంతసేపటికిఁ దెల్లవాఱెను. తలంచినతలంపు సులువుగ ఫలించెనని మురయుచున్న యా తెఱవ తనకనుల నొక్కసారి కెలఁకున నున్న మనుజునిపయి మలపెను. ఆహా ! అంతలో నాకనులయం దెంతమార్పు గలిగెను ! ఆమె మనంబున నెంతచిల్లుపొల్లుదయించెను ! ప్రాణముపయి నెంతవిసువు జనించెను !

ఆ యుత్సాహమంతయు నెం దంతరించెనో ! ఇంతదనుక నా వనజముఖ మనంబునఁ జిఱ్ఱుబుఱ్ఱాడు కోరికలబారులన్నియు నెందువిరమించెనో ! దీనికి కారణమేమి ? తనచెంత నున్నది తా ననుకొనిన విష్ణుశర్మ కాదు. మఱియెవరు? మొదటి నుండియుఁ దన్నన్ని కడగండ్లఁ గుడుపుచున్న జాలావధానులు.

జాలావధానులఁ గంటఁబడుటతోడనే యామెహృదయమున నిస్పృహాత్వము జనించెను. ఆమె తనయాశలన్నియు నడుగంటినటుల భావించెను. కాని యామె తనమనోగతవ్యసన

మతనికిం దెలియఁబడకుండఁ గప్పిపుచ్చికూరుచుండియుండెను.

విద్యుత్ప్రిభయుపచారములకయి యేర్పరుపఁబడిన యా ముదుసలి లేనిహేతువుచేత నామెకుఁగావలసిన భోజనస్నానపానాదుల నా జాలావధానులే స్వయముగ నెట్టులో గడుపవలసివచ్చెను. ఆమె యుపచారములయం దవ్రిమత్తుఁడయి యుండియు మధ్యమధ్య జాలావధాను లా యింటివెలుపలి గుమ్మమున నిలిచి యెవరికొఱకో యెదురుచూచుచున్నవాని వలెఁ గనుపడుచుండెను. లోనికిం జనుచుండెను. మరల వెలుపలికి వచ్చుచుండెను. ఈ రీతి నుదయము గడచెను. మధ్యాహ్నమయ్యెను. దిననాధుం డంతకంతకుఁ దనలోని తేజము నుపశమింపఁ జేయుచుఁ బశ్చిమాభిముఖుండయి యేగుచుండెను. తుదకు రెండుగడియలపొద్దుమాత్రము నిలచి యుండెను. అపు డొకభటుఁ డేతెంచి యచ్చట జాలావధానులతో నిట్లు ముచ్చటించెను.

స్వామీ! ఎందు వెదకిన నావృద్ధాంగన కానఁబడదయ్యె. ఎం దరిగెనో తెలియదు. నేనచ్చట నామెను వెదకుచుండ మన యజమానునియొద్దనుండి భృత్యుఁడొకండు నను దెంచి 'రేపు సాయంత్రము చీఁకటిపడినపిదపఁ దా నాసత్రమునకు విచ్చేయుదుననియు నంతదనుక నక్కన్నియ నచ్చటన భద్రపరుచునది' అనియు, యజమానుఁడు సెలవిచ్చిన ట్లాతండు చెప్పి పోయెను. ఈసంగతి తమతో మనవిచేయుట కేనిందు వచ్చితి ననెను. "ముసలి దందు లేదా? పోనీ! మఱియెవ్వరయిన నందుఁ గనుపడిరా?"

"లేదు. అందామెలేదు. మఱెవరును గానరాలేదు."

అని భటుఁడు వలుక జాలావధానులు కొంచె మాలోచించి లోనికిం జనెను. ఇంతలో నినుం డస్తమించెను. కనుచీఁకటి యాఁబడెను. భటుఁడును జాలావధానులుఁను విద్యుత్ప్రభ కెఱుకపడకుండ నెద్దియో రహస్యాలోచనము సలుపుచు నాచెలియ సమీపమునఁ గొంతదూరమున నుపవేశించియుండిరి. దీపము ప్రకాశముగ వెలుగుచుండెను. రెండుగడియ లీవిధముగా జరిగెను. అంత నాయింటి పెరటివైపున నకస్మాత్తుగ వర్షముగురిసినట్లు శిలాపాతధ్వని వారిచెవులం బడెను. వారిరువు రత్యంతభయభ్రాంతులయిరి. వెంటన వా రిద్దఱు లేచి ధ్వనిసనుదెంచు దిశకై పరువిడిరి. అది యేమని విమర్శచేయుటకేని వారికిఁ దోఁచలేదు. తమపయినున్న వస్త్రములు దిగువ జారినసంగతి వారలకుం దెలియలేదు. తా మింతజాగ్రత్తతోఁ గాపాడుకొనుచున్న విద్యుత్ప్రభా రక్షణవిషయమైనను వారి మనసునకు రాలేదు. ఎక్కడివస్తు వక్కడన విడిచి దిక్కు తెలియక పెరటిలోనికిం బరువిడిరి. ఆహా! భయమెంత చెడ్డది!

పాపము వా రట్లురికి పెరటిలోనికిం జనిరిగాని యందేమియు వారికిఁ గానఁబడలేదు. నలుదిక్కులను బరిశీలించి చూచిరి. ఏమియు వారి కందు గోచరింపలేదు. చీఁకటియాట వలన పడిన శిలలును వారికంటికిఁ గానరాలేదు. అంతయుఁ జెక్కుచెదరకయుండెను. అయినను వారల కింక నాభయము వదలలేదు. మఱియు నా స్థలమును శోధించవలెననుబుద్ధి వా

లను విడువనందున దీపమునుఁ గొనివచ్చి వెదుకవలెనని యభిలషించిరి.

జాలావధానులు తనభటుని లోనికిం జని దీపముఁగొని రమ్మని యనిపెను. ఆ భటుఁ డింటిలో విద్యుత్ప్రిభ చెంత వెలుఁగుదీపమును గొనిరాఁ బోయెను. అప్పు డేమని చెప్ప వలెను. విద్యుత్ప్రిభ వాని కందుఁ గానరాలేదు. వాని గుండియ ఝల్లుమనియెను. నోట మాట రాలేదు. విభ్రాంతి నొంది యతఁడు నలుగడలం జూచెను. విద్యుత్ప్రిభ యుందెందును లేదు. ఎట్ట కేలకు మనంబుఁగుదుటఁదొ్రిసికొని "మోసము, మోసము" అని గుండెలుకొట్టుకొనుచుఁ బిచ్చివానివలె గద్గదస్వరమున నఱచెను. అది వినినతోడన జాలావధానులకు గుండె చెదరెను. ఆతండు లోనికిం బరువిడెను. వారిరువు రున్మత్తులచందమున నాప్రిదేశమంతయు న్వెదకిరి. కాని యామె జాడయే గానరాదయ్యె. తమకామె మరల లభించుననెడు నాశయును గతించెను. జాలావధాను లిట్లలమటింపఁ దొడగెను. దురదృష్టుల బాగుచేయుటకుఁగాని యదృష్టవంతులం జెఱుపుటకుఁగాని యెవ్వండోపు ? తాము సమర్థుల మని విఱ్ఱవీఁగుజను లెంతమూఢులు ! సర్వజ్ఞుఁడ ననియు నెంతయు యుక్తిపరుఁడననియు మొదటినుండియు నేను గర్వపడుచుంటిని. భూతివర్మయు నటులనే యెంచి నన్ను శ్లాఘించుచుండెను. తనకార్యములన్నియు నావలనన నిరపాయముగ నెరవేరుననియుఁగూడ నాతనియభిప్రాయము. వానిముఖస్తుతుల కే నుబ్బితబ్బిబ్బులయి యూతం డాడించినట్లెల్ల నాడి

తిని. పొగడ్తలెవ్వని మోసముచేయవు! నా తెలివి తెల్లవారి నది. విద్యుత్ప్రభ భూతివర్మ కలవడున బ్లెన్నెన్ని యో పాట్లు పడితిని. రెండుమాఱు లామె నెట్లో రక్షించుకొంటిని. ఈన గాచి తుదకు నక్కల కిడినచందమయ్యెంగదా? ఈయొక్కదిన మెట్లయిన నామెను గాపాడఁగలిగియుంటినేని రేపటి రేయి యక్కన్య భూతివర్మసొత్తై యుండియుండును. కాంతాళంబు వహించిన శత్రువులనుండి యక్కాంతం గాపాడుట సులభ సాధ్యమా? నేనెంతయుం బ్రయోజకుఁడనని నమ్మి నాపయిం గొండంత యాశవెట్టుకొని తనకార్యభారమంతయు నాతల మీఁద వైచియున్న భూతివర్మ కెట్టియాశాభంగంబుఁగలిగించి తిని! నావంటి యప్రయోజకుం డీ ధరణియం దెందునుం గాన రాఁడు. నే నతని కెట్లుసాయంబొనర్పఁగలను? ప్రయోజ కుఁడగు శత్రుఁడును నప్రయోజకుండగు మిత్రుఁడు నెవరికిం గొఱగారుగదా! ఆమె యెట్లదృశ్యయయ్యెను? సమయము చిక్కనని తప్పించుకొన నామెకు బుద్ధిపుట్టెనా? లేక శత్రు వులే వేగుచూచి యీపనిసల్పియుందురా? ఇది యామెపని గాదు. బుద్ధిమతులయినను స్త్రీ లబలలు. అబలల కీ సాహ సముండునా? అది యసంభవము. ఇది శత్రువులపనియ, అయిన వారెం దరిగెదరులే? పరమర్మభేదనోపాయదక్షుండ నని పేరువడసిన యీజాలావధానుల మాయానలంబుముందర శత్రుశలభంబు లేపాటివి? ఇక్కార్య ముపాయముచేత సాధింపందగు! ఉపాయములేక పనులు సాధింపఁజూచుట యక్షరములేనివ్రాత! చూచెదంగాక!”

అని యెద్దియో మనసునకురాఁ నొద్దనున్న భటుని చెవిలోఁ గొన్నిరహస్యములనూది యచ్చోటువాసి భటునితో జాలావధాను లెందేనిఁజనెను.

—— :o: ——

# ౨౫ వ భాగము

ఒకనాఁడు సాయాహ్నమునఁ జక్రపురమునకుఁ దూర్పువైపుననున్న జీవనమఠమునకెదుట నొకబయలునబహుజనులు మూఁగియుండిరి. ఆజనులలో స్త్రీలు మెండు. మఠప్రథమద్వార సమీపమున నొకయఆయం దొకమహాయోగి మౌనముద్ర ధరించి కన్నులు ముకుళించికొని జపముచేయుచుండెను. ఒక ఛాత్రుఁ డాయోగిచెంత నుపచారము చేయుచుండెను. యోగిది కోలమోగము. సింగపుజూలువలె నెఱసినగడ్డము. అడ్డగట్టిన వెండ్రుకలు శిరముపయి నొక్కయుండవలెఁ జుట్టఁబడియున్నవి. ఒడలం దెల్లయెడఁ దెల్లని విబూదిపెండెకల్లలందఁ బడియున్నవి. నొసట నెఱ్ఱనికుంకుమబొట్టమర్పఁబడియున్నది. ప్రాదేశమాత్రపుబనాతుసంచియం దునిచి కుడిచేత మొదటి మూఁడువేళ్ళతో జపమాలయొకటి త్రిప్పుచుండెను. చంక నొక కక్షపాల వ్రేలవేయఁబడి యుండెను.

అందుఁగూడిన జనులంద ఱీయోగిపుంగవుని యసమానప్రజ్ఞల వేనోళ్ళం బొగడం జొచ్చిరి. తమపాపముల నపనయించి తమ్ము రక్షింప నవని కవతరించిన భవుండ యితండను

వారును, వారు చే యెత్తిమంత్రించి కించిద్భస్మతీర్థంబు లిడిన జనుల క్షయాదిమహావ్యాధు లడుగంటిపోవుటకు సందియమే మని శ్లాఘించువారును, ఎట్టిజాడ్యపీడితుఁడయినను లోనికిం జని యోగిదర్శనముచేసికొనినమాత్రమున యోగిపుంగవు సంప్రయోగమున నారోగి నిరోగియయి వెలికిఁజనుదెంచు టయకాని యురక యరుదెంచువాఁడు లేడని యాయనతపశ్శక్తి మెచ్చువారును, నెవని కేని మనంబున నొకకోరికయొడమి యయ్యోగినిఁబ్రశ్నించెనేని నాతఁడు తనప్రభావంబున వచ్చిన వానిహృదయంబునంగల కొదువలనెఱింగి యతనికోర్కులు కొనసాగించుసామర్థ్య మీతనికింబలె మఱియెవ్వరికి లేదను వారును, నెందుఁజూచినఁ బ్రబలియుండిరి.

అందఱును యోగినిరుపమానమాహాత్మ్యమున కాశ్చర్య పడువార! అంద ఱామహానుభావుని మనోనైశ్చల్యమున కానం దించువార! అంద ఱాతపసిహృదయమార్దవమును గొని యాడువార! అందఱును వారిప్రశాంతమున కెంతయు సంత సించి తలయూచువార! దైవజ్ఞునికడ కేగి మన మెద్దియయిన ప్రశ్నం బడుగునెడ నాతఁడు యుక్తియుక్తములగు ప్రశ్నలచే మన మనోభీష్టముల గ్రహించుచుండుట యంద ఱెఱుంగు విషయముగదా! అట్లుగాక యీజడదారి మాటలాడకయ జనులమనోగతంబుల నెట్లో యెఱింగి శిష్యునిద్వారా యాప్రశ్నంబులకన్నింటికిం బ్రతివచనముల నిచ్చుచుండెను. ఇందఱు జనులొక్కపరి యాబోడరాయునిసన్నిధి కేగిన నొత్తుడు మెండవు నను కారణంబునఁగాఁబోలును పలువుర నేకకాలంబునం గొని

పోవక యయ్యంతేవాసి యోగికడ కొక్కరొక్కరిని దోడి కొనిపోవుచుండెను.

వీరిమాహాత్మ్యమును విని వారిని దర్శింపవచ్చినవారలలో భూతివర్మయొక్కఁడు. ఈరాజపుత్రునిమానసంబునం గొంత కాలమునుండి యొకయాందోళనము ప్రవేశించెను. ఆయాందోళన మాతనిం బిచ్చివానిం జేసెను. తాఁ గోరినవిద్యుత్ప్రభ తనకు దూరమయ్యెను. పదునైదు పదునాలు దినములనుండి యాతని కామెజాడయు దెలియలేదు. ఇందువలన నాతనికిఁ గంటినిండ నిదురగాని కడుపునిండ నాహారముగాని లేదు. ఆతం డీలాగున విచారింపఁజొచ్చెను.

నాఁడు నాప్రాణమిత్త్రుఁ డంపిన లేఖయందు నాకుఁ బ్రాణపదయగు విద్యుత్ప్రభను శత్త్రువుల బారింబడకుండఁ గాపాడఁగలిగితిననియు, నేఁగోరినవితాన నామెను చక్రపురము నందలి యీశ్వరాలయము చెంతనున్న సత్త్రమునకుఁ జేర్చి కాపాడుచుండెదననియు, సమయము వేచి శత్త్రువు లేమఱి యున్నతఱి నామెను నాచెంతకుఁ గొనివచ్చెదననియు, నేనచ టికి మరల నేగిన మోసము వాటిల్లుననియు వ్రాసియుండెను. ఈయుత్తరము వ్రాసి నేఁటికిఁ బదునేను దినము లయ్యెను. ఇంతవఱ కక్కోమలి వృత్తాంతముగాని నాసంగాతిగాని యుదంతముగాని బొత్తుగఁ దెలియలేదు. కారణ మేమయి యుండవచ్చును ? మిత్త్రున కేదియయిన నపాయము సంభ వించి యుండునా ? లేక శత్త్రువు లతిజాగరూకు లయి యుండుటవలన నక్కన్నియను నాకడకుం గొనిరా వలనుపడక

పోయెనా? అటుల జరిగి యుండఁగూడదు. ఆగంతు మిగుల నేర్పరి. శత్రువుల ప్రయత్నము లాతనికడ నేమిపనికివచ్చును? నిజముకల్ల లే నెట్లు గ్రహింపఁగలను !

ఇటీవల చక్రపురసామీప్యమున నున్న జీవనమఠము నకు నొక మహాయోగి విచ్చేసి యందు నివసించుచున్నవాఁ డఁట ! ఆతండు తన సన్నిధి కరుదెంచు మనుజుల మనంబులం గ్రహించి వారికోరికలు సఫలంబు సేయుచున్నాఁడనియుఁ, దన్నెవ్వ రెట్టి దేప్రశ్నమడిగినను దానికి సరియయిన ప్రతి వాక్య మొసంగి నిక్కువము వెలిఁబుచ్చుననియు వార్తలు వినంబడుచున్నవి. నేను వారికడ కేగి వారిని సేవించి యా మహానుభావునివలన నాకోరినవిషయము నెఱింగిన పిదపఁ గర్తవ్య మాలోచించెదం గాక.

అని చిత్తూరుపత్తనమునందుఁ దన గృహంబుననుండి యాలోచించుచు భూతివర్మ యాతపసికడ కరుగ నిశ్చయించి కొనెను. చూడుఁడు ! ఇంతకుఁబూర్వము భూతివర్మ యతుల యందుఁగాని వారి మాహాత్మ్యమునందుఁగాని యెంతమాత్ర మును నమ్మకము కలవాఁడు గాఁడు. అయినను నిప్పటి యాతని యవస్థ యాతని కీయోగియెడల గొప్ప పిచ్చినమ్మక మొకటి పుట్టించి నిద్రాళుని భంగి నాతని నయ్యతికడకుం గొంపోయెను. భూతివర్మ జీవనమఠమునకు రేయి కొంత గడచినపిదప నొంటరిగఁ జనుదెంచెను. అప్పు డచ్చట జన సమ్మర్ద మంతగ లేదు. కాన యోగిని నొంటరిగ దర్శించుట కాతని కవకాశము గలిగెను. యోగి కతండు నమస్కరింపిం

చెను. యోగియు శిరఃకంపమునఁ దన యంగీకారమును సూచించుచు భూతివర్మ మోమునందుఁ జూడ్కి నిగుడించి ఱెప్ప వాల్పక చూచుచుండెను.

భూతి - స్వామీ ! మీవలన నొక్క రహస్యమును దెలిసికొనఁగోరి మీసన్నిధి కేతెంచితిని. తమ సెలవయినయెడ మనవి చేసికొందును?

యతి - పురుషశ్రేష్ఠా ! నీవచ్చిన కార్యము నీవు చెప్పనక్కఱలేకయ యోపరమేశ్వరీ కరుణావిశేషమున గ్రహించితిని. నీ వొకప్పు డొక యాపదంబడి నీచే నుపాసింపఁబడు దేవీప్రసాదంబువలన దానికిం దప్పి బ్రదికితివి. కాని నీప్రాణపదమగు నొక మహారత్నముం గోలుపోయి యుంటచే నీస్వరక్షణయు నీకంత విలువగలదిగాఁ గనుపడలేదు. ఇదియ నీమనోవిచారమునకుఁ గారణము.

"ఆహా ! ఈమహానుభావుని మాహాత్మ్య మనన్యసామాన్యముగదా ! ఉన్నది యున్నయటుల వచించినవారు. ఇంతదనుక యోగులయందు నాకుఁగల విపరీతాభిప్రాయము లన్నియు నేఁటితో మాఁటినవి. నిశ్చయముగ వారు పూజనీయులు. నావలచినకన్నియ విషయమయి నాసంశయము వీరివలన తీరవలయును" అని తనలోఁ దానెంచికొని భూతివర్మ యతని నిటులఁ బ్రశ్నించెను. "స్వామీ ! నా యమూల్యరత్నము నాకు మరల లభించునా ? అది యెట్లదృశ్య మయ్యెను? "

"అది యదృశ్యమయినవిధము నీకుఁ దెలియవలెనా? అది నీనమ్మిన స్నేహితుని మోసమువలననే గలిగినది. అయినను

నీవా చెలి కాని యంతఁ డింకను నమ్మిక యిడి యున్న వాఁడవు. తద్రత్నము నీ యామిత్రుఁడే మఱుఁగుపఱచి యున్న వాఁడు. జాగరూకతతో నీవు దాని గ్రహింపవలయును" అని చెప్పి యోగి యదృశ్యుఁ డయ్యెను."

ఈ పలుకులు వినినతోడనే భూతివర్మకుఁ గలిగిన మనస్తాపమును జిత్తవిభ్రమమును నింతింత యని చెప్ప నలవి కాదు. నా నేస్తకాఁడు నాకోరినప్రియాలి నపహరింపనున్న వాఁడని వీరు వక్కాణించిరి. నా నేస్తకాఁ డెవఁడు? జాలావధానులా? అతనిని నేను మొదటినుండియు నెఱుఁగుదును. అతని స్వాధీనమునందుఁ గదా యాచెలియ యిప్పు డున్నది? ఆతం డిట్టిపనికి లోఁబడునా! అతఁడు మున్నెన్నఁడు నన్నిది వఱకు మోసము చేసినవాఁడు గాఁడు. నా కెన్నెన్ని చిక్కులు వచ్చినను వానినన్నిటినిం గడునేర్పరితనమునఁ దొలఁగించి నన్నుఁ గాపాడినాఁడు. అట్టివాఁ డిట్టి మిత్రద్రోహమునకుఁ బాలుపడునా!

ఏమో! ఎవ రెఱుంగుదురు! అతనిమనసులోని యాలోచనల నేనెట్లు గ్రహింపఁగలను? ఇతరవిషయములయందు నా కాతఁ డాప్తుఁడయి యుండియుండవచ్చును. ఇది స్త్రీవిషయము. ఏకీమునకుఁ గాని కాంతా కాంచనములు గదా కారణములు. ఇంద్రియముల నిగ్రహించి షడ్వర్గములం జయించి మోక్షేచ్ఛను ముక్కుమూసికొని తపంబు సల్పుచున్న విశ్వామిత్రునంతటివాఁడు విలాసినీవతులకొఱకుఁ గదా తా నా బాల్యము కాయముం దపింపఁజేసి సముపార్జించిన తపఃఫలము నొకనిము

సమున దారవోసినది! సకలసామ్రాజ్యము ననుభవించుచు న్నను తనసవతితమ్ములకు రావలసిన రాజ్యభాగము నీయలేక తుదకు దుర్యోధనుండు వర్ధమును బ్రాణమునుం గోలుపోయి నది ద్రవ్యాశ చేతనగదా?

ఒకని కెల్లకాల మొకబుద్ధియ యుండునని యేమి నమ్మకము? కమ్మనిపలుకుల నూరించు కొమ్మలంగనిన బమ్మ కైనంబుట్టునుగదా రిమ్మతెవులు! ఆతం డీస్త్రీవిషయమున నన్ను మోసపుచ్చఁదలంచియే యున్నవాఁడని నాకిపుడు దృఢమయినది. లేకున్న నన్నానాఁడాచక్రపురమందలి సాంకేతికస్థలంబున కేలరావలదని యుత్తరము వ్రాసియుండును? ఈ కల్మషము వానిమనంబున నుండుటవలనన నా కటుల వ్రాసి యుండనోపు. కానీ! అతనికిం దగినబుద్ధి చెప్పెదను" అని యనుకొనుచు భూతివర్మ సాగిపోయెను.

# ౨౪ వ భాగము

---

తనవశమున నునుపఁబడిన విద్యుత్ప్రభ మున్నానిర్జనా గారమునుండి యదృశ్యయయ్యెనని మన మిదివఱకు జదివియు న్నాము. ఆమె నెటులనయిన నన్వేషించి తిరిగి తనహస్తగతం గావించుకొనవలెనను నిశ్చయముతో జాలావధాను లానాఁడు చక్రపురమున సందుసందు గొందిగొంది వెదకెను. కాని యామె యెందును గానరాదయ్యె. తనమాయలును మర్మ

ములును శత్రువులకడ నేమియుఁ బనికి రాకపోయెనుగదా యనుచింత యొకటియు, విద్యుత్ప్రభ విషయమయి తనమిత్రిన కేమిసమాధానము చెప్పవలెనో తెలియమి మఱియొక చింతయు జాలావధానులను బాధింపఁజొచ్చెను. అందువలన నతండు వెఱ్ఱివానివలె దేశమంతయు నఱ్ఱాడుచుండెను.

ఒకనాఁ డీతం డెద్దియో యాలోచించుచు నొంటిగా నొకత్రోవను నడచుచుండెను. అప్పు డొకబాటసారి యతని కెదురుపడెను. జాలావధాను లామనుజునిరాక నాతండు సమీపమున కేతెంచువఱకు నెఱుఁగఁడు. మోమెత్తిచూచి "ఎచ్చటి కింత యవసరముగ వెళ్ళుచున్నావు" అని యాబాటసారి నడిగెను.

నే నొక పనిమీద చిత్తూరునకు వెళ్ళుచున్నానని యాతఁడు బదులు చెప్పెను.

జాలా - చిత్తూరులో నేమి పని ?

బాట - నేఁటికి నాలుగుదినముల క్రింద మాయింటఁ గొంతసొమ్మును చోరు లపహరించియున్నారు. దాని పోబడి కొంచెము తెలిసికొనవలెనని బయలుదేరితిని. దైవానుగ్రహము వలన దొంగయుఁ జిక్కినట్టె ! ప్రభుత్వమువారి సహాయమున నాసొత్తును మరలఁ బొందఁ బ్రయత్నించుచున్నాను.

జాలా - చోరుఁ డెవఁడు ?

బాట - వాఁడు చిత్తూరుకాపరస్థుఁ డఁట. ఇపుడు నాగేంద్రమున వసించుచున్నాఁడు.

జాలా - వానియొద్ద సొత్తు చిక్కెనా ?

బాట - వానియొద్ద సొమ్ము కనుపడలేదు. కాని కొంచె మాతని యొత్తిడిచేసినయెడఁ దప్పక చిక్కును. అందు నకే చిత్తూరు టాణాకు వెళ్లుచున్నాను.

జాలా - అదేంతపని. వెళ్ళి కొత్వాలుతోడఁ జెప్పి వేయుఁడు. కాని యాతఁడే దొంగిలించినాఁడని మీ రెట్లు నిశ్చయింపఁగలరు?

బాట- ఆతఁడ దొంగిలించినాఁ డనుకొనుటకుఁ గొంత కారణమున్నది. వానికడ నొకతరుణి గలదు. ఆమెతో మాట లాడు సందర్భమున నామె వాఁడే సొమ్ము దొంగిలించి తెచ్చి నట్టు రహస్యముగఁ దెల్పినది.

జాలా - ఆ చిన్న దతని కేమవును?

బాట-ఎవరో తెలియదు. వానిసంబంధమేమో కాదు. ఆమెనుచూచిన గొప్పయింటిబిడ్డవలెఁ గనుపడుచున్నది. ఎచ్చ టనో వాఁ డీమెను నిర్బంధమునఁ గొనివచ్చిన ట్లున్నది. ఆమె ముఖలక్షణములను గుణములనుఁ బట్టి నే నా సంగతి కనిపెట్టి తిని. లేకున్న నీ నీచున కీ కులీన మతి యెట్లు లభించును?

జాలా-అలాగునా! అయినయెడ వంచకుఁడు వాఁడే? మీ రాలసింపక గట్టిపనిచేసికొనుఁడు.

ఈ మనుజుని సంభాషణము వలన జాలావధానుల మనంబున నొక యనుమానము జనించెను. "ఆ తరుణి విద్యు త్ప్రభయయి యుండునా? ఆమెయే కావచ్చును. సందియ మేమి? ఆమెయే! వాఁడు సాగరుఁడు. వాఁ డామె యాచూకి నెట్లో తెలిసికొని యామెను జిక్కించుకొని యుండనోపు!

లేక యొకవేళ వాఁడే యక్కన్నియను మొదట నాగ్రహము నందే మఱుఁగుపర్చెనేమో !

వాఁడేయయినయెడ వానిమానసము నిష్కల్మషమే యైనచో నామె చిక్కినవెంటన నాకడ కాతఁ డేల వచ్చియుండఁడు ? అతని కేమయిన దుర్బుద్ధి పుట్టినదేమో ? పుట్టియుండనేవచ్చును. లేనియెడ నాతం డింతయేలతడయును? "వినాశ కాలే విపరీతబుద్ధిః" ఇది యెవ్వరిని నమ్మదగినకాలము కాదు. నే నచటి కేగి నిజము తెలిసికొనెదంగాక, అని జాలావధాని త్వరత్వరగ నడచుచుండ నొకభటుఁ డొక జాబునుదెచ్చి యతని చేత నుంచి యాతనితో నివ నాతఁ డేగెను.

ఈలేఖ నామిత్రుఁ డంపినదేనా ? అతఁడంపినది కాదని తలంచెదను. మిత్రునిదే యయినయెడ నీజా బేల యింతతీవ్రముగ నుండును ! మాసౌహార్దలత యింతసులువుగఁ ద్రెంపఁ బడఁదగినదా ! కాదు కాదు. ఈజా బతండు లిఖయించినది కాదు. మాయిరువురియొద్దికకు భంగము గలుగఁజేయవలయు నని గిట్టనివాఁ డెవఁడో యీపన్నాగము పన్ని యుండును.

పరికించిన నీ లేఖయందలి వ్రాలా భూతివర్మదిగానే యగుపడుచున్నది. ఒకవేళ నతఁడే దీని వ్రాసియుండునా ? అట్లనుకొనుటకును వీలులేదు. ఒక్కొక్కం డెందఱి చేవ్రాళ్ళ నొప్పొత్తిన ట్లింత చక్కఁగఁ జేయుచుండుటలేదు. నేనే యిది వఱ కెన్నిపర్యాయము లెందఱి నిట్లు మోసపుచ్చలేదు ? మోసముచేయ నెంచిన నేది యడ్డగించును ? కాన నేను తొందరపడుట మంచిదికాదు. అయినను మాసాంకేతికపదం

బులు కొన్ని యిం దుదాహరింపఁబడి యున్నవి. ఈపదములు భూతివర్మకును నాకునుం దక్క నన్యుల కేరికిం దెలియవు. దీనింబట్టిచూడ నీయుత్తరము భూతివర్మ వ్రాసినదే యని నిశ్చయింపఁ దగియున్నది. అనుమానపడుట కెడము లేదు. ఈజా బాతఁడు వ్రాసినద !

ఆతని కింతయాగ్రహ మేలకలుగవలెను? నేను ద్రోహినఁట! ఏమిద్రోహము చేసినాను ? నాయం దాతం డేమి ద్రోహభావంబు కనిపెట్టెనో ! ఇంతకాలము స్నేహమున గలసి మెలసి యుండినను నా స్వభావ మాతండు కనిపెట్టఁజాలకపోయెను ? తన కనులుగప్పి విద్యుత్ప్రభను నే నపహరింపఁ దలఁచితినని యాతం డూహించెను గాఁబోలును ! నే నటుల నెన్నఁడయినం జేయుదునా ! విద్యుత్ప్రభనుగూర్చి నే నే నాఁటి వర్తమాన మానాఁ డాతనికిం దెలియఁజేయుచున్న ద తని మోసము చేయుటకా ? నే నెప్పు డాతని యభివృద్ధినే కోరుచున్నందునకు ఫల మిదియా ? తుద కాతఁడు నాకే కీడు రోయుచున్నాఁడు. అగ్నిచేఁ గాఁపఁబడిన పాత్రములోని జలము పొంగి తుద కయ్యగ్నినే చల్లార్చునుగదా !

ఆయన కీయనుమానము గలుగుటకుఁ గొంతకారణము కూడ లేకపోలేదు. విద్యుత్ప్రభ నానాఁ డాయింటం గోలుపోయినది మొదలాతెను వెదకుటయందె నామనం బాక్రమింపఁబడి యున్నది. కాన నతని కిటీవల నుత్తరము వ్రాయ వలనుపడలేదు. ఇదిగాక యావనిత నెట్లయినఁ గష్టపడి వెదకి కనుఁగొనినపిదప నా శుభవర్తమాన మతని కంపిన బాగనికూడ

నాకుఁదోఁచినది. అందువలన నాతనికి జాబు వ్రాయ సంశయించుచుంటిని. ఇంతలోఁ బిసుగడచిన ట్లీ శ్రీముఖము వచ్చినది. ఇంతియకదా యాశ్రితునిబ్రతుకు! తన కెంతకష్టమయినను నొరులమనంబు కనిపెట్టి నడచుకొనుచుండవలెనుగదా ! అట్లు వినమితముగ నడుచుకొనుచుండినను వాని కెల్లప్పుడును మన్ననయు గలుగునని నమ్మిక మెక్కడిది ? దుష్టయజమానిని సంతుష్టిపఱచుట కష్టముగదా ?

ఆహా ! ఈ దుష్టునాశ్రయించి యెంతదూరునకు గుఱియయితిని ! ఎన్ని పాపముల నాతలకుఁ జుట్టుకొంటిని ! నే నొనర్చిన ఘోరకృత్యములనెల్ల నా మనంబునకుం దెచ్చికొనిన నా హృదయము కాల్చిన కఱ్ఱువెట్టి కలంచిన ట్టయ్యెడి. ఈ పాపఫలము నన్ను వేయిజన్మములవఱకును గట్టికుడుపక మానునా ? ఎంతహైన్యమునకుఁ బాలుపడితిని ? అఱవనఱవ గొఱియల కుత్తుకలం గోయు కటికివాఁడుసయితము చేయ వెఱచు క్రూరకృత్యములం జేసితింగదా ! నా పాపమునకు మేర యెక్కడిది ! అగ్రజన్మమెత్తి యుక్తాయుక్తవివేచనాబుద్ధి గలిగి, సకలధర్మశాస్త్రముల భగ్గున వెలుగఁబెట్టి యీక్షుద్రుని వాగురులలో నేల తగులుకొంటిని ? ఎట్టి పాపకార్యముల నొనర్పఁ బూనుకొంటిని ! ఈ నీచుఁడు మెచ్చి నా కేమో నెత్తిన కిరీటము పెట్టునను దుర్భ్రాంతి నన్నింతచేసినది ! నా చేసిన యీ దురితమునకు భగవంతుఁడు నన్నూరక విడుచునా? శమనుఁడు నన్ను క్షమించునా ? ఎన్నఁటికిని క్షమింపఁడు. శంభూ, పశుపతీ ! నన్నెటులఁ గాపాడుదువోయి తండ్రీ !

మర్యాదుఁడును దబ్బఱియు నగుభూతివర్మకుఁ జేసిన సేవయందు సహస్రాంశమయిన నీయెడ వినియోగించిన నేఁదరించియుం దునే! దేశసేవాతత్పరత నిద్రాహారములకు సయితము దూరుఁడయి పాటుపడుచున్న విష్ణుశర్మకును, దుర్మార్గానువర్తనమున నూరునుం గాడును రోయునట్లు కాలముం గడుపుచున్న నాకును హస్తిమశకాంతరతారతమ్యము గలదు. ఆ పురుషుని నిహపరములఁగీర్తియు, ముక్తియు నాశ్రయింపఁగింకరులవలె వేచియున్నవి. విశ్వజనీనమయిన కార్యముల సల్పుచున్నానని యాయన కొకతృప్తియయినఁ గలదు. ఆయనకుంబలె నాకా సంతోషముగాని పరిశుద్ధమనస్సుతోడి సంచారముగాని లేదు గదా? దీనికంతయు దుస్సంగత్వమే కారణము" అని ముచ్చిరుచు జాలావధానులు నాగేంద్రపట్టణమార్గమున నడచుచుండెను.

—o*o—

## ౨౭ వ భాగము.

మీవారుదేశమునకుం దూర్పుటెల్లయయి రామరాజ్యముంబోలె సర్వజనభద్రాకరంబయిన "కోటా" యనురాష్ట్రమొకటి గలదు. అది ధర్మస్వరూపుఁడని పేరొందిన యొకనృపోత్తముని పాలనంబునకు లోఁబడి యుండెను. ఆరాష్ట్రప్రజను లచటి యధికారులవలనఁగాని జారచోరాది దుర్జన సముదాయమువలనఁగాని బాధలంబొఱయక సుఖం బుండెడివారు.

కోటారాజ్యమునఁ గృష్ణగిరియను నొకచిన్నపల్లియ కలదు. అది మీవారురాజ్యమందున్న నాగేంద్రపట్టణము నకుఁ బశ్చిమమున నాలుగుక్రోసులదూరమందుఁ జెంబలు నదీతీరమున నుండెను. ఆనాఁ డెద్దియో యొక పండుగదినము. జనులందఱు వేఁడుక లపరిమితముగఁ జేసికొనుచుండిరి. ఆదిన ముదయమున నాబాలవృద్ధు లభ్యంజనాదికృత్యంబులం దీర్చి కొని కొంచెము పొద్దు గడచినమీఁదట భోజనము చేసిరి. ఇతరదినములయందుఁ బొద్దుపొద్దున లేచి చల్దులు భుజించు నవరవర్ణులును బాలురునుంగూడ నాదినమునఁ బొద్దుపో యియే భుజించిరి. భోజనమున కకాల మయినను భక్ష్యభో జ్యాదికరసాన్నముం గడుపార భుజించి జను లానందించు చుండిరి.

ఈవిధముగ నాపండుగ దినమంతయు నానందాబ్ధి మునిఁగి తేలుచుఁబొద్దుపుచ్చి, పొద్దుగ్రుంకుటతోడన గృహం బులకరిగి భోజనాదికృత్యంబులఁ దీర్చికొని యాపురవాసులు శయనములను భజించి పడకలపయి మేనులు వైచిరి. పల్యంక ములపయి శరీరములు వాల్చినదె తడవు వారిని నిద్రాధిదేవత యతిగౌరవమున వరించెను. పగలంతయు నుత్సాహపరవశు లయి విచ్చలవిడి సంచరించి యలసిసొలసియున్న యాపుర వాసుల కట్లు సుఖనిద్ర పొరయుట యొకవింతకాదుగదా ? అయినను నిదురపోవక జాగరూకులగు వారలును గొంద ఱుండిరి. పరద్రవ్యాపహరణపారీణులును బరనారీసౌందర్యా

పహృతచేతస్కులును గన్నులకుఁ గునుకుపాటైన లేక తమ కార్యనిర్వహణమునం దప్రమత్తులయి యుండిరి.

సాధారణముగ జారచోరులకుఁ బండువ దినంబులు కన్నులపండువులు! ఏలయన, నుత్సవేతరదినంబులం బడంతులు సొమ్ము లంతగ ధరించుటగాని, బహిరంగముగ విచ్చల విడి సంచరించుటగాని సంభవించదు. ఇట్టిసమయములందే స్త్రీల శలంకారములును, స్వేచ్ఛావిహారములును. ఈయుత్సవములుకూడ నందునకే యేర్పడ్డవనియుం జెప్పవచ్చును.

పగటిపూటఁజూచిన స్త్రీలభూషణముల నివాసమయములఁ దామపహరింపవలయునని కొందఱదను వెదకుచుందురు. ఇది తస్కరులధర్మము. దీని గ్రహింపఁజాలక మూఢత్వమునఁ జేసియులు సొమ్ములుసొమ్ములని కలవరించుచుందురు. ఒక్కొక్కపు డలువుసొమ్ములను సయితము దెచ్చిపెట్టుకొని యువివాహయినయెడ మగలకుఁ గొంతదండుగలుకూడఁ దగిలించుచుందురు. కాన నీపండుగదినంబులు గృహస్థులకే కాక తెక్కలికాండ్రకుసయిత మనుభావ్యములుగదా?

ఆ రేయి నూరు మాఁటుమణఁగి నిశ్శబ్దముగనున్నతఱి నొక సందున స్త్రీయాక్రందన మొకటి బయలువెడలెను. ఆధ్వని మిగుల గొప్పది యయినను నిండునిదురలోనున్న గ్రామవాసులకది వినఁబడలేదు. కాని యాయూర నాసాయంతనముననే వచ్చి మార్గాయాసము దీర్చికొనుటకై యారాతిరి యొక యింట నిదురించుచున్న యొక క్రొత్త యువకుని కీయంగనారోదన మెట్లో చెవింబడెను. వెంటనే యాతఁడు

చివ్వున లేచి ఖడ్గహస్తుండయి శబ్దమేతెంచినచోటున కతిత్వరిత గతిం బరువిడెను. అచట నొక పొలములోఁ జెట్లు మఱుగున యమదూతలంబోని కొందఱు మనుజు లతిసుకుమార యగు పదునాఱువత్సరముల ప్రాయముగల బాలికను, నేబదేండ్ల యీడుగల యొక వృద్ధును జుట్టుకొని యుండిరి. అందుఁ గొంద ఱా ముదుసలివానిం బెడకేలుగట్టి నోట నొక గుడ్డఁ దురిమి సమీపమున సిద్ధముగ నుంపఁబడియున్న శకటము చెంతకుఁ దోడికొని పోవుచుండిరి. బాలికయు రోదనము సేయుచు నప్రియత్నముగనే యాముసలివాని వెంబడి నడచుచుండెను. ఆమోషకులలో నొకఁడు తామరతూండ్లవలె మృదువులయిన యాకన్నియ హస్తములను బట్టుకొని "నోరెత్తవలదు! అట్లు చేసితివేని నిదె యీఖడ్గాహి నీప్రాణానిలంబుల నపహరించి వేయును. నోరెత్తకుమని బెదరించుచుండెను. ఆతండే స్వర్ణప్రతిమానుకారశరీరచ్ఛాయ గల యాయువతిలలామ ధరించియున్న స్వర్ణాలంకారముల, మెల్లన నూడ్చి మూటగట్టి మఱియొకని చేతి కిచ్చెను.

ఇంతలో సింగపుం గొదమభంగి నాక్రొత్తపురుషుఁ డాచోరుల నడుమ దుమికి ముసలివానిం గొనిపోవుచున్న వారిలో నొకనిశిరం బొక్క వ్రేటునం దెగనఱికి వైచెను. అంత నిలువక యప్పురుషుం డాయిభరాజగమన యాభరణముల మూటను బట్టికొనియున్న మనుజుని హస్తముంగూడఁ దటాలున ఖండించెను. ఆదెబ్బతో వాఁడు చేయూడి మొదలునఱుకఁబడిన వృక్షము పగిది నేలం గూలెను. అది చూచి

తక్కినవారు దిక్కుదెలియక కాందిశీకులయి 'శీఘ్రబుద్ధిః పలాయనమ్' అను న్యాయము నవలంబించి చెల్లాచెదరయి పరువిడ నారంభించిరి. ఆపురుషుఁడును వారి వెంటనంటి కొలఁది దూర మరిగెనుగాని వారతనికిం జిక్కినవారు కారు. చోరులు పారిపోవుచుఁ జచ్చినవారి సహచరుశవం గొనిచనిరి. కాని యాతొందరలోఁ దమశకటమును, దానికిఁగట్టిన యాజానేయమును వదలివెళ్ళిరి.

హస్తము తెగి నేలంగూలియున్న మనుజునికడ కాకొ్త్తపురుషుఁడు మరల నేతెంచి చేతి గాయమునుండి కారెడు రక్తస్రావమువలన స్పృహతప్పి పడియుండిన యతనికిఁ దగిన చికిత్సచేసి యతని నొక వృక్షమునకుం గట్టివైచెను. పిదప నెండిపోవుటకు సిద్ధమయిన సస్యము సమయమునఁ గురిసిన సువృష్టిచే మరల జీవవంతమయిన తెఱఁగున సంతసించుచున్న యాతండ్రి బిడ్డలకడ కతఁ డేతెంచి ముసలివాని కన్గొనాశ్చ నోటఁ దుఱుమఁబడిన వస్త్రమును వెలికిఁ దీసి పాఱవైచెను. అందునకు వారిరువు రద్భుతానందరసాబ్ధినిమగ్నులయి విభ్రాంతి నూరక నిలువఁబడిరి.

ఇట్లు నిశ్చేష్టితులయి నిలచియున్న యాముసలివానిం గుసుమసాయకుని సాయకమన నొప్పు నాబిసరుహాక్షిని నూరడించి వారివృత్తాంత మారయనెంచి 'ఓపురుషశ్రేష్ఠా! మీరింక భయపడకుఁడు. స్వస్థచిత్తులరయి మీయుదంతము సవిస్తరముగ నాకెఱింగించి నన్నానందాబ్ధిం దేల్చుఁడు. మీరెవ్వరు? మీకాపద ఘటింపనెంచిన యాకుటిలు లెవరు? అని

యామహాపురుషుఁ డనెను. ఆవృద్ధు, తమచారిత్ర మిట్లుచెప్పం దొడఁగెను. స్వామీ! మే మీయూరికిఁ గ్రొత్తకాఁపులము. పేరుంబ్రతిష్ఠయునుంగల యొకకుటుంబమునకుం జేరినవారము. నాపేరు విజయసింహుఁ డందురు. ఈబాల యీమదదృష్టుని కొమరిత. మేమింతవఱకు సౌఖ్యసంపద లనుభవించి యిప్పు డీస్థితికి వచ్చినవారము. శత్రువులవలన పరీభావము నొందినవారము. మాకీయవస్థయం దీబాలయే యాధారము.

మాది మున్ను చిత్తూరురాజ్యము. ఇటీవల నారాష్ట్రమున కనేకములగు కడగండ్లు సంభవింప నచట నిలువంజాలక యిచ్చటికివచ్చి తలదాఁచుకొనుచుంటిమి. ఈదేశాధిపతి మిగుల నీతిపరుఁడు. పరులకష్టములఁజూచి యోరువఁజాలఁడు. ఇందుచేతన మాస్వదేశమును నభిమానముంగూడవదలి కొలఁదికాలమునుండి యిందుఁ గాఁపురించుచుంటిమి. నాకుఁ జిత్తూరునందుండు ముఖ్యోద్యోగస్థులతోఁ గొంతపలుకుఁబడియు నాభూపాలునితోఁ గొంతచనవును గలదు. కాని యిటీవల నచ్చటి యుద్యోగస్థులయం దొకనితో మాకొకబలవద్విరోధము సంభవించెను. అందువలన మే మాగ్రామమునం దుండుట యుపద్రవకరమని నాకుఁ దోఁచెను. అచట నుండుట క్లిష్టపడక పోవుట కిదియే ముఖ్యకారణము.

మేము నిద్రించుతఱి మాకీయాపద ఘటింపించిన నీచులెవ్వరయినదియు నేఁజెప్పఁజాలను. కాని వారు నాకువిరోధులయిన చిత్తూరి యుద్యోగస్థుని బంటులని నేనూహించెదను.

అని యింక నేదియో చెప్పఁబోవుచుండఁ గృష్ణగిరి గ్రామము వెలుపల నొక కాఁగడా వెలుతురు వారలకుఁ గానఁబడియెను. ఇచటి కోలాహలమువలన నిదురనుండి మేలుకొలుకంబడి మగనిం బిడ్డనుం గానక విహస్తయయి గృహముఖంబున నబ్బాలికజనని సల్పురోదనంబువలన మేల్కాని కొందఱు గ్రామవాసు లాపెను వెంటఁబెట్టుకొని కొన్ని కరదీపికలతోఁ గూఁతును మగనిని వెదకి తుదకు వీరున్న స్థలంబునకుఁ జనుదెంచిరి. తల్లి నల్లంతదవ్వునఁగాంచి యా యబల యెదురేగి యామెను కౌఁగిలించికొని పెద్దపెట్టున రోదనముసేయ నారంభించెను. ఆహా! బిడ్డలకుఁ దల్లికంటెఁ బ్రియతరమగు వస్తువు మఱియొకటి లేదుగదా! 'గర్భధారణపోషాభ్యాం పితు ర్మాతా గరీయసీ' అని తండ్రియందుఁగూడ వారల కంత ప్రేమ యుండదు సుఁడీ!

తల్లిబిడ్డలభయంబుడిపి వారిదుఃఖమునుమాన్పుట కచ్చట నున్నవారలకుఁ గొంతకాలము పట్టినది. ఎట్టకేలకు వారు శాంతించిరి. అంతట నాయబల దూరముననున్న కొత్తపురుషుంజూపి 'అమ్మా! ఇమ్మహాత్ముని జూడుము. ఈతనివలననే నీ యీబిడ్డ నీకు దక్కెను. లేకున్న మానాన్నగారి గతియు నాస్థితియు నేమయియుండునో! ఈమహానుభావుఁడ నీకుఁ బతిభిక్షయుఁ బుత్రికారక్షయు నొసఁగినవాఁడని యెఱుంగుము' అని చెప్పుచుఁ జోరులదౌష్ట్యము తనమనసునకురా మరలఁ దల్లింగౌఁగిలించికొని యబ్బాల రోదనమారంభించెను. ఆచిన్నదాని దుఃఖముచూచినపుడు తల్లిదండ్రులెకాక యచ్చట నున్న

వా రందఱుఁ గన్నుల నీరిడిరి. గొడ్రాలికిఁ దప్ప బిడ్డలు గనిన వా రట్టియవస్థయం దున్న వారినిఁగాంచి సహింపఁగలరా ?

అంతట నామహాపురుషు నచటఁ గూడినవా రందఱు బహువిధములఁ బ్రస్తుతించిరి. తల్లిదండ్రులును నా మహామహునిఁ దమనివాసంబునకు విచ్చేయుఁడని ప్రార్థింప వారివేఁడికోలు నంగీకరించెను. అదివఱ కందుఁ జెట్టునకు బంధింపఁబడియున్న చోరు నచ్చోఁగూడిన వారలలో నొక్కరి స్వాధీనము చేసి యా ముప్పురి నందున్న శకటంబుపయిం గూరుచుండఁబనిచి తా నా శకటమునకుం గట్టిన యాజానేయము నెక్కి వృద్ధునిం గుటుంబమును వారి గృహంబునకుఁ గొంపోయెను.

—o*o—

## ౨౭ వ భాగము.

తే. గీ. అన్యులకుఁ గూర్చుఁ దనకార్యమైన వదలి,
స్వార్థ మన్యార్థమును నొక్కభంగిఁ జూచుఁ
స్వార్థమె పరకార్యము భంగపఱచు,
నుత్తముఁడు మధ్యముఁడు నల్పుఁ డుర్వి నొలి

నీ వెంత యదృష్టవతివమ్మా! కొమరులన నందఱుఁ గొమరులా? నీకుమారుఁడే కుమారశబ్దమునకుం దగినవాఁడు. అతండు నిశ్చయముగఁ గుమారుఁడ! అట్టి శౌర్యనిధికిం జననివయి నీవును వీరమాతవయితివి. అప్పు డాయేకచక్రపుర వాసులగు బ్రాహ్మణదంపతుల ముద్దుకొమరునిం గాపాడఁ

దలఁచి తన తనయు నసురపాలికిం బుచ్చిన మహోపకారిణియు సద్గుణముల దొంతియు నగు కుంతీమహాదేవియే యీ కుంతీమహాదేవి! కానియెడ నొరులనిమిత్తమయి యేకపుత్త్రుఁడని యయిన నెంచక యరాకూరులగు చోరులపయికి నాతనిం బంపుదురా? ఆతండును వెనుతివియక యసహాయశూరుఁడయి చని వారిం దఱిమి మమ్మును మా కుటుంబమును రక్షించినవాఁడు. మే మాతని భుజాదండపు టండంగదా నేఁటికి బ్రతికియుంటిమి. మీఋణం బేమెట్లుదీర్చి కొనఁగలము? అని గడచినరేయి నాపురుషుఁడు దమకొనరిచిన మహోపకారమునకుఁ దమకృతజ్ఞతాసూచకోక్తులఁ గుంతీబాయితోడ రమాబాయి పలుకఁజొచ్చెను.

'అమ్మా! మీరు నన్నింతకొనియాడవలయునా? మనుజులకుం బరోపకారబుద్ధిగదా యుత్తమభూషణము? చేయవలసినవిధిఁ జేసితిమి. దాని కింత శ్లాఘింపవలెనమ్మా? మీ సాధువృత్తియే మీకాపత్కాలమందుఁ దోడ్పడినది. మంచివారల కెప్పుడును భగవంతుఁడు తోడనువిషయమున కిది యొకతార్కాణము' అని కుంతీబాయి నొడివెను.

'అట్లనకుఁడు. మేలుగాని కీడుగాని భగవంతుఁడు స్వయముగ నరుదెంచి చేయునా? అందున కెవరినయినఁ బ్రేరేచును. మాకు మిమ్ముఁ గానుపించెను' అని రమాబాయి యనెను.

ఈలాగునఁ గుంతీబాయియు రమాబాయియు నొక యింటఁగూరుచుండి సంభాషించుచుండ నొకసేవకుఁడే తెంచి

'అమ్మా! రమాబాయిగారా? యజమానుఁ డెందున్నవారు? వారికొఱకుఁ బ్రభువుగా రెదురుచూచుచున్నవారలు. వీరిని వెంటఁబెట్టుకొనిరమ్మని ప్రభువుగారు నా కనుజ్ఞయొసంగిరి" అనెను.

రమా - వా రిప్పుడు చిత్తూరు వెళ్ళియున్నారు. నీ కెదురుపడలేదా?

సేవ- లేదు. నా కెదురుపడలేదు. అటులయిన వెళ్ళెదను.

రమా- త్వరగాఁబోయితివేని నీవు వారినిఁగలిసికొనఁగలవు

రమాబాయినోట నీమాటవెడలఁగనె సేవకుఁ డచట నిలువక బిరబిర మరలిపోయెను. ప్రభు వింత యవసరముగఁ దనయజమానునిఁ బిలువనంపుటకుఁ గారణ మేమయియుండు నని రమాబాయి పరిపరివిధములగు నాలోచనలకుం జొచ్చెను. కుంతీబాయియు, రమాబాయిదీర్ఘాలోచనకు హేతువు నెఱుంగఁజాలక యేమట్లాలోచించెదరని రమాబాయి నడిగెను.

రమా - అమ్మా! ఈసేవకుని వాలకముచూచిన నాకే మోభయముదోఁచుచున్నది. మాకుఁజిత్తూరున విరోధులనేకు లున్నారు. వారు మాకెప్పుడుఁ గీడుఁదలఁచుచుందురు. ఈ వచ్చినవాఁడు భూతివర్మసేవకుఁడేమోయని నేను సంశయించుచున్నాను. తొందరగాఁ నాయజమానున కేయపాయమును గలుగకుండునుగాక.

కుంతి—అమ్మా! నీమగని కేమియు భయములేదు. మీరు నెమ్మదిగ నుండుఁడు.

అని యిట్లు కుంతీబాయి రమాబాయి నూరార్చుచుండెను. అపుడు విజయసింహుఁడొక యువకునితో నాగృహంబునకు విచ్చేసెను. ఆయువకునిది చిత్తూరు కాఁపురము. అతని పేరు ధర్మసింగు. వీరిరువురం గాంచి కుంతీబాయి దిగ్గనలేచి తానందేనిఁజనెను. రమాబాయిమాత్రి మందే నిలచియుండెను. అందఱునుఁ జావడిలోఁ గూరుచుండి యిష్టగోష్ఠి సలుపుచుండిరి. వీరీలాగున సంభాషించుచుండ విజయసింహు కూఁతురును వారికడ కేతెంచి తల్లియొద్దఁ గూర్చుండెను.

ఈవచ్చినక్రొత్తయువకుఁడు విజయసింహుకుటుంబమునకుం గ్రొత్తవాఁడు గాఁడు. వారిగృహంబునకుఁ జనుమానముగ నప్పుడప్పు డరుదెంచుచుండెడువాఁడ! మీరింతత్వరితముగ మరలితిరేమి? అని రమాబాయి తనమగని నడిగెను.

విజ—అవును. తిరిగివచ్చితిని. మన ధర్మసింగు నాకుఁ ద్రోవలో నెదురుపడినవాఁడు. అతండు మనగృహంబునకు వచ్చుచుండెను. కాన నేనును నతనితోఁ గలసి మరల వచ్చితిని. చిత్తూరునకు మఱియొకపర్యాయ మేగెదను.

రమా—త్రోవలో మీకెవ్వరయినఁ గానుపించిరా?

విజ—కానుపించలేదు. ఏల?

రమా—ఎవరోయొక సేవకుఁడరుదెంచి ప్రభువు మిమ్ముఁ బిలుచుచున్నాఁడని చెప్పెను. మీరు చిత్తూరే వెళ్ళినారని నేను జెప్పితిని. అతఁడు తిరిగి వెంటనే మీకొఱకే తెంచెను. అతఁడు మిమ్ముఁ గలసికొననేలేదా?

యువ—ఆతండు వీరినిం గలసికొనకపోవుటయ క్షేమము. లేకున్న నాతోడ వీరిచ్చటికి వచ్చియుండరు.

వీరు మాటలాడుకొనుచున్నను, విజయసింహుని కూఁతురు వీరిప్రసంగమం దంతమనసుపెట్టి గమనించుటలేదు. కాని యాచిన్నది యాయువకుని పలుకులయందుమాత్రి మను రాగము గలిగి యాతనిమోముఁదమ్మికిఁ దనమంజులదృష్టిపాత మును బట్టముగట్టెను. ఆయువకునినేత్రకుముదము లాసుం దరిమోముచందురునిచే నాకర్షింపఁబడి యాతం డాకన్నె నర ముడిం గాంచుచుండెను.

కొంతవడి వా రిటుల విస్రంభసంభాషణములాడిన పిదప విజయసింహుఁడును రమాబాయియు లేచి లోనికింజనిరి. ధర్మసింగును విజయసింహునికూఁతురును నందు కొంతవడి నిలచి ముచ్చటలాడుచుఁ గాలముగడపిరి. పిదప ధర్మసింగు విజయ సింహాదుల సెలవుం గైకొని చిత్తూరున కేగెను.

# ౨౨ వ భాగము.

---

లోకములో నెల్లప్పు డొకరీతి నన్నివిషయముల సౌఖ్యమునే యనుభవించువాఁ డెందయిన నుండునా? తర్కమీమాంసాదిసకల శాస్త్రముల నభ్యసించి, భారత రామాయణాద్యనేక పురాణములను గ్రోడీకరించి సకలదేశ

ములయందలి రాజసభల బహువిధసత్కారముల నొందు నన ర్గళపాండితీగరిమను గలవిద్యావంతులు తఱుచుగ నిష్పచ్చ రము ననుభవించుచుందురు. పాఁడియుఁ బంటయు సమృద్ధిగఁ గలిగి యింత తినుటకును గట్టుటకును లోపంబు లేక నిత్య లక్ష్మీవిలాసంబునకు నివాసయోగ్యు లగుధనికులును సుఖ ప్రాణులు గాకపోవచ్చును. కొందఱు వ్యాధిపీడితులయి మాతులు చిక్కులచే బిగింపఁబడి, మోకాటి పచ్చికబయ ళ్ళనడుమ నిలువబడ్డ పశువులవలె నైశ్వర్యలాభమును బొందఁ జాలక సౌఖ్యమునకు దూరులయి యుందురు. ఒకవేళ విద్యా సంపదలున్నను సంతానవిహీనులు గావచ్చును. అప్పుడును వారు సుఖలవంబును నెఱుఁగక సదా పరితపించు చుందురు. కాన లోకములోని జనుల కందఱకు భగవంతుఁ డేదోయొక కొఱంత యేర్పరచియే యున్నవాఁడు. ఈ కడపటి యంశము నకు నాస్థితి యొక చక్కని మాదిరికమై యున్నది. నాకెంత కలిమి యున్న నేమి? ఎంతవిద్యావంతుఁడ నయిననేమి! ఎందఱు బంధువులు, నెందఱు మిత్రులు గలిగియున్న నేమి! నాకున్న తక్కువపాటు నాకుండనే యున్నది.

ఆహా! అచ్చెలి నన్నెన్నఁడయినం జేపట్టునా? ఆ మగువ బిగికౌఁగిలి నాకొదవినం గాని నా పుట్టువున కెట్లు ధన్యత కలుగును! అక్కన్నియ చెలిమిబలిమిసం గాని నా కలిమి కెట్లు ఫలంబు కలుగును. నా ప్రయత్న మెన్నఁడయినం గొనసాగునా? ఆ చెలి నను జేపట్టు భాగ్యము నాకబ్బునా?

మా వివాహ విషయమై నే నెన్నిమా ర్లాకన్నియ

నెచ్చరించి యుంటిని ! నే నా ప్రస్తావము తెచ్చినప్పు డెల్ల నయ్యోలనాగ నన్నొండు ప్రసంగములలో దింపి నన్నుటంకించు చున్నది. కాని నాకు సరియయిన బదులుమాట చెప్పుట లేదు. ఇందువలనన నాఁటి రేయిఁ గృష్ణగిరిగ్రామమున విజయ సింహుని నా మిత్రులు బంధించికొనిపోవుచుండ నే నా యబ లను బలాత్కారముగఁ గొనియేగం దలంచి యామెను నా వశము చేసికొని యుంటిని. కాని యెవ్వఁడో యా సమయ మున నా పాలిఁటి దురదృష్టదేవతవలెఁ జనుదెంచి యా పదు చును విడిపించి నా ప్రయత్నమునకు భంగము గావించెను. అప్పుడ పీఁటలమీఁది పెండ్లి తప్పిపోయినటులఁ దలంచితిని.

పిదప మఱియొకసారి నా ముద్దుగుమ్మను బలుకరించి చూచెదమని బుద్ధిపొడమి కృష్ణగిరి గ్రామమున కేగియుంటిని. అప్పుడచ్చట నా ప్రత్యర్థి ధర్మసింగు వారితోడం గూర్చుండి ముచ్చటించుచుండుటం గాంచి లోని కేగ నిష్టము లేక, వెనుక వాఁడను వెనుకనే మరలి చిత్తూరునకు వచ్చితిని. అయినను మఱియొక పర్యాయము కృష్ణగిరికి వెళ్లి యక్కన్నెను దిరిగి కదలించిచూచెదను.” అని చిత్తూరునగరమున సరదారుసింగు కృష్ణగిరిగ్రామమునకుఁ బయనమయి పోవ నిశ్చయించుకొనెను.

కృష్ణగిరియందు విజయసింహుఁడు కొంతకాలమునుండి కుటుంబముతో వాసముసేయుచుండినసంగతి మన మిదివఱకుఁ జదివితిమి. ఆతనికిఁ బురుషసంతానము లేదు. కూఁతురు మాత్రము గలదు. ఆ చిన్నదాని పేరు జీవబాయి. ఈమె గుద వివాహము విషయమయి తండ్రియయిన విజయసింహు మనం

బునఁ గొంతకాలమునుండి యొకతీఱనితొ్రక్కులాట కలిగి యుండెను. చిత్తూరునగరవాసుఁడగు సరదారుసింగున కొక్కన్య నీయ విజయసింగుభార్య రమాబాయి తనమనంబున నాలోచించుచుండెను. సరదారుసింగు చిత్తూరులో నొకగొప్ప కుటుంబమునకుఁ జేరినవాఁడు. అతనితాతతండ్రులనుండి వారు ధనికులు. అతఁడు పడుచువాఁడు. విద్యాబుద్ధులుగలవాఁడు. సాధారణముగా వరునకుండవలసిన సుగుణచర్య లీతనినిఁ జాల మట్టుకు హృద్యమగు భోగినులవలెఁ జేపట్టియుండెను. కాని దుష్టసహవాసమువలనఁగొంత చెడునలవాటులలోఁబడినవాఁడు. ఇందుచేతనే విజయసింహున కీతనికిఁగన్య నొసఁగ నంతనిష్టము లేదు. అయినను విజయసింహు భార్యమట్టుకు సరదారుసింగు ధనికుఁడగుటచే నాతనికిఁ గూఁతునీయ సమకట్టియున్నది విజయసింహుఁడును భార్యమాటఁ ద్రోచివేయఁజాలక కర్తవ్యము నాలోచించుచుండెను. సరదారుసింగు విద్యకలవాఁడు గాక పోయినయెడ విజయసింహునకు భార్య సల్పుయత్నము లెట్లు రుచించియుండునో తెలియదు.

తల్లి యెప్పుడును దనయల్లుండు ధనవంతుఁడుగావలెనని కోరును. సరదారుసింగు చదువరిగాన విజయసింహునకుఁ దనభార్య ప్రీతిగ నతనియం దిష్టమును గానుపించెను. జీవబాయిమాత్ర మాసరదారుసింగునం దిష్టముగలిగియుండలేదు. కన్నెలకు రూపమే ప్రధానము. అరూప మాసరదారుసింగు నందంతగాలేదు. అయిన నాతండు కురూపిమాత్రము గాఁడు.

ఒకనాఁడు విజయసింహుని గృహసింహద్వారమునకు ముందుండుబయలుప్రదేశమున రమాబాయియు విజయసింహుఁడును సాయంతనము చల్లగాలికిఁ గూర్చుండియుండిరి. జీవబాయియుఁ దల్లిసరసన నొక్కచోఁ గూర్చుండియుండెను. అపుడు విజయసింహుఁడు కూఁతువివాహము రమాబాయి తోడఁ బ్రస్తావమునకుఁదెచ్చెను. రమాబాయి యంతట కూఁతువంకఁజూచెను. తల్లిదండ్రులయభిప్రాయ మెఱింగి జీవ బాయి "నాన్నగారూ! నావివాహవిషయమయి తమకిపు డింతతొందరేల? కొలఁదికాలము నిదానించఁగూడదా?" అనియనెను.

విజ - అమ్మా! ఎట్లునిలపనగు? నీతోడిబాలికలంద ఱిదివఱకే తగినమగలనుఁ జేపట్టియున్నారు. నీకును యుక్తవ యసువచ్చియున్నది. కాన నేనీసంబంధము నేరుపఱిచి నీ కుద్వాహముసేయఁదలఁచినాను.

జీవ - నాన్నగారూ! మీరీవిషయమయి యింతచిం తింప నవసరములేదు ప్రస్తుతముమీరీప్రయత్నమూపందగు.

విజ - నీకిష్టములేనియెడ నేనీపనికిఁబూనను లేవమ్మా! నేఁజూచినస్థలములలో నిదికొంచెము గుర్రిడ్డిలో మెల్లగా నున్న టులఁదోఁచినది. అందువలన నీసంబంధము నాలోచించితిని.

రమా- దానికిష్టముగానిసంబంధము మనమేల యాలో చింపవలెను? మఱియొకచోట విచారింతములెండి.

వీ రీలాగు మాటలాడుకొనుచుండ నొకయువకుఁడు వారికడ కేతెంచుచుండెను. వాని నల్లంతదవ్వునఁ గాంచినతో

డన వారిసంభాషణము ముగించిరి. జీవబాయి దిగ్గనలేచి లోని కిం జనెను. విజయసింహుండు తోంటలోని కరిగెను. రమా బాయి మాత్రి మందే నిలువంబడియెను. ఆ యువకుండును వచ్చి యాపె కెదురుగనున్న యాసన మలంకరించెను.

రమా - ఏమిట్లు దయచేసితిరి ?

యువ - ఊరక మిమ్మొందఱం జూచిపో నేతెంచితిని.

రమా - రండు, లోనం గూర్చుండవచ్చును.

అని రమాబాయి నుడువ నా యువకుం డామెతో లోనికిం జనెను. జీవబాయి లోన నొక కురిచీవయింగూరు చుండి యెద్దియో యొకపుస్తకము ముందిడుకొని చదువుకొను చుండెను. యువకుం డాకన్నియ కెదురుగ నిలువంబడెను.రమా బాయి 'ఇదె యిప్పుడ వచ్చెద నింద విశ్రమింపుండు' అని యొకయాసన మాతనికిం జూపి తా లోని కేగెను.

జీవబాయి మనంబంతయుం దనచదువునంద లీనమయి యుండెను. మో మెత్తలేదు. ఆ యువకునిం జూడనులేదు.

యువ - ఓమితమధ్యా!నీ వెద్దియో పనిమీందనున్నట్టు న్నది. నారాక నీకేమయిన నసందర్భముగా నుండదుగదా!

జీవ - ఓహో! సరదారుసింగుజీ! ఎప్పుడువిచ్చేసితిరి?

సర - ఇదె! ఇప్పుడ యే తెంచితిని.

జీవ - అందఱు క్షేమమా? ఏమి! తోవతప్పివచ్చితిరి? ఏమిపనిమీంద విజయము చేసితిరి ?

సర - నా కిచట మఱేమిపనులు గలవు ? నిన్నుజూచి పోవచ్చితిని.

జీవ - మాయందు మీకుఁగలకరుణగదా మిమ్మిందు
కొనివచ్చినది ?

సర - ఓ మంజువాణీ ! నీ ముద్దుపలుకులు నిష్ప్రహా
తపమున నెండిపోనున్న నామనం బనుతరువున కొక యమృత
ధారాసేచన మయ్యెంజుమీ ! ఇఁక నావేఁడికోలుం దోసిచి
పైవక నన్ను మన్నింతువని నమ్మెదను.

జీవ - సరదారుసింగుజీ ! ఉప్పనచప్పనలేని నా నిస్సా
రపుఁ బలుకులయం దమృతారోపణము సేయుచున్నారు. అగ్నిక
యందు మధురిమయు నట్లె కూర్పఁదగును.

సర - అహా ! మానినులచిత్త మెప్పుడును బ్రియాను
రాగపరీక్షాపరాయణముగదా ? నిజముగ నీ వాక్కునం దమృ
తమే గలదు.

జీవ - సరదారుసింగుజీ ! నా వచనములయం దమృత
మున్నదో విసమున్నదోగాని మీరుమాత్రము నాకులేని ఘన
త్వమును దెచ్చిపెట్టుచున్నారు.

సర - లోలలోచనా ! నీవు నాపయినింత కాఠిన్యము
వహించనేల ? నన్నుఁ జేపట్టి నా ప్రాణమును నిలుపుము.
ఈ నీ సేవకుని బ్రతికింపుము. అని సరదారుసింగు తన్ను వివా
హము చేసికొనుట కంగీకరించుమని పలువిధముల బ్రతిమాలఁ
జొచ్చెను. కాని జీవబాయి యతనిమాటలను వినియు విననిదానివలె
నుండెను. అందువలన నాతం డాచిన్నది తన్ను
బరిగ్రహించుటయందు నిరాశచేసికొని శోకపర్యాకులుండయి
మరల నేదో యచ్చెలియతోడఁ బలుకఁదలంచెను. ఇంతలో

విజయసింహుఁడు గృహంబునకు విచ్చేసెను. రమాబాయియు లోననుండి యేతెంచి సరదారుసింగు నావాఁ డందునిలువుమని బ్రతిమాలుకొనెను. కాని యాతం డందున కియ్యకొనక మఱి యొకపర్యాయ మేతెంచెదనని పలికి పయనమయి చిత్తూరున కరిగెను.

—:O:—

## ౩౦ వ భాగము

పూర్వము మీవారుదేశమునకుఁ జిత్తూరు రాజధాని యయి యుండెను. మొదటినుండియుఁ జిత్తూరు రాజవంశము మహాపురుషసత్కీర్తియుంబోలె నిష్కల్మషంబయియుండెను. అందలిరాజులును న్యాయపథానువర్తులయి దోషమునకు సందీయక ప్రభుత్వము చేయుచుండెడివారు. వారప్రతిహతమాన వీర్యముగలిగి శత్రుదుర్నిరీక్ష్యముగఁ బ్రజాపాలనంబు సలుపుచు బహుకాలము గడిపిన వెనుక "చెట్టుచెడు కాలమునకుం గుక్కమూతిపిందెలు" అనినయట్లప్పుడు చిత్తూరురాజ్యసింహాసనమును విషయలంపటుఁడును స్వయోజకదుర్జనత్వదూరీకృత సకలబంధుమిత్త్రప్రేముండును, నగునొకదుర్బలుఁ డధిరోహించి యుండెను. ఈతనిపేరు ప్రమారుఁ డని యిదివఱకె తెలుఁగుదుము. ఈతండు ప్రభుత్వమునకుఁ జనుదెంచినది మొదలు మీవారుదేశమంతయు నల్లకల్లోలమయి యెచటఁగాంచిన నల్లరులు ప్రారంభమాయెను. అతనిదుశ్చేష్ట లతనిసరదారులకుఁ

గాని సామంతరాజులకుఁగాని రుచించినవిగావు. దీనివలన దేశ మందుఁ గుట్రలు మెండయ్యె. అదివఱ కాతని కాంతరంగికు లుగానున్న సరదారులునయిత మతనితో నిచ్చకములాడుచు న్నను శత్రువర్గములోని వారయిరి. కొందఱు కుటిలస్వభావు లనేకదుష్కార్యములకుం బాల్పడిరి. కొందఱు స్వలాభపరా యణులయి శత్రువర్గమునం గలసి కుట్రలుపన్నుచుండిరి. జార చోరాది దుర్జనవితతి విచ్చలవిడి సంచరింపఁజొచ్చి "యథా రా జా తథాప్రజా" అనునార్యోక్తిని ధ్రువపరిచిరి. ఈదేశోపప్లవ ముంగని దీనిసందుచేసికొని బహుకాలమునుండి చిత్తూరురా జ్యముపయిఁగన్నువెట్టియున్న సన్నిహితరాజులు లబ్ధావకాశు లయి మీావారుదేశముపయి దండువెడలిరా నుద్యమించు చుండిరి. ఒకనాఁడీచిత్తూరుపట్టణము వెలుపల నొక వివిక్తస్థల మున నయిదుగురుమనుజులు చేరి రహస్యాలోచనము సేయు చుండిరి. అప్పుడు రాత్రి పండ్రెండుగంటలయి యుండెను. ఆ దినము భాద్రపదబహుళదశమియగుటచే నాఁప్రదేశ మంధ కారబంధురమయి యుండెను. దీనికిందో డభ్రమభ్రాచ్ఛాదిత మయి చొటచొట సన్నని చినుకులు రాలుచుండెను. ఇందు వలన జనాళికిం గన్నులుండియుం గన్నులులేని వారికింబలె చుట్టునున్న వస్త్వావళి గాన్పించుటలేదు. ఆ యయిదుగు ఱిట్లు మాటలాడఁ గడఁగిరి.

మొద - మన మానాఁ డొనరించిన యత్నములన్ని యుం బూదివేల్చిన విధంబున నిష్ఫలంబు లయ్యెంగదా !

రెండ - అవును. నిష్ఫలంబులే యయ్యెను. మనమేమి చేయఁగలము ?

మొద - అయినను మన మాపట్టుదల వదలఁగూడదు. ఒకప్పుడు గాకపోయినను మఱియొకప్పుడు మనపూన్కి నిర్విఘ్నముగ నెరవేరవచ్చును. నడచువానికి దూరమును బ్రియత్నపరుల కసాధ్యమును గలదా ! ఎట్లయిన మన మాతని మట్టు బెట్టినం గాని మనకార్యము పండదు.

మూడ - మనకార్యము కించిన్న్యూనముగ నెరవేరియే యుండెను. కాని యెవ్వఁడో సైంధవునివలె వచ్చి మనకపు డడ్డపడియెం గద! కాన విజయసింహుప్రాణమును వానిముద్దు కూఁతుమానమునుఁ దక్కెను.

రెండ - మనము మొన్నపన్నియున్న వలలో నతఁ డనాయాసముగఁ జిక్కియే యుండవచ్చును. పోయిన మనుజుఁ డెంతపనియయినఁ జేయఁగలఁడు.

మొద - అయ్యో నీవు వినలేదు కాఁబోలును. విజయ సింహుఁ డీపర్యాయముఁగూడఁ దప్పించుకొనియెను. ఆతని కిం దోఁచినయుపాయము లేరికిం దోఁచవు. “ మహాగజాఃపలాయంతే మశకానాంతు కా కథా ” అను నట్లీమనుజుఁ డొక లెక్కయా !

రెండ - అయిన నీకముందు యోచనయేమి ?

మొద - ఏమయినఁ బని జరిగినఁ నీగరదుసింగువలనన జరుగవలెను.

నాల్గ - ఓహో ! నాకే వచ్చినదే ! ఈ విషయమున

నేనేమి చేయఁగలను? న న్నేమి యొనర్పుమనిన నది యొనర్ప సిద్ధముగ నున్నాఁడను.

మొద - చేయుదునని చేతిలోఁ జెయివైచి వాగ్దాన మిమ్ము.

నాల్గ - నిశ్చయముగ మీరు కోరినటుల గనిచేయు దును. అని యతనిచేతిలోఁ జేయి వైచెను.

అయిద - ఏమిది! మనగరదుసింగు మనస్సింతలో మాఱినది! ఈతఁడు మనపక్ష మవలంబించునని యిదివఱ కెన్నఁడును మన మనుకొనలేదు. రాజున కీతఁడు పరమా ప్తుఁడుగదా?

మొద - రాజునకె కాదు. విజయసింహునకుంగూడ నీతం డాంతరికమిత్రుఁడు. కాన నీభార మీతనిపయివైచితిని.

నాల్గ - పాప మిప్పటికిని విజయసింహుఁడు నన్నునమ్మి తన రహస్యాలోచన లన్నియు నా కెఱింగించుచుండును. నాయాలోచనల ననుసరించి నడచుకొనుచుండును. నమ్మిన వాని నెట్లు చెఱుపనగు. అయినను బ్రభువుచర్యలు వాకు మిక్కుటము లయినవి.

మొద—ప్రభువున కన్నిబుద్ధులును గఱపున దీవిజయ సింహుఁడె. అతని ముందుఁ గడ తేర్పవలయును. ఇందుముఖ్య ముగ నీసహాయ మవసరము.

నాల్గ—న న్నేమి చేయుమందువు?

మొద—విజయసింహుఁడు మొన్న రాజగృహంబు పకుం జనియుండెను. అచట వారిద్ద ఱేమి రహస్యములాడి

కొనిరో మరల నాతండు గృహంబునకేగుచు మీయుటజము నకు వచ్చియుండెను. నీ వింట లేవు. కొంతవఱకు నీకొఱ కచ్చట కాచికొని యుండి నీజాడఁ గానక వచ్చుశనివారము సాయంతనము మరల వచ్చెదనని, నీయింటఁ జెప్పి వెళ్ళెనట. ఏదో యవసరమైన కార్య ముండి యుండును. చెప్పిన యట్ల యాతండు మీయింటికి శనివారము వచ్చును. వచ్చినపుడు చీఁకటిపడువఱకు మీయింట నాతని నిలుపుము. ఆతం డెట్లొ మీగృహంబున నారాత్రి నిదురింపఁడు. కృష్ణగిరికే పోవును. మీగృహంబున నిలిచినను మేలె. ఇంతమాత్రము నీ వొనర్పుము. తక్కిన సంగతులకు నే నున్నాను.

నాల్గ—ఇదెంతపని లెమ్ము.

మొద—ఈవిషయము నీకొడుకునకుమాత్రము తెలియఁగూడదు సుమీ. వాని కీసంగతి తెలిసిన మన కార్యమంత యుఁ జెడిపోవును.

నాల్గ—నా కాసంగతి తెలియును. అట్లు జరుగకుండఁ దగిన యత్నము చేయుదును.

మూఁడవ—ఈ విజయసింహు నొక్కనిం దీర్చిన మన కార్య మంతయుం దీరిపోవునా ? సేనాసముదయమునం గొందఱు మన కనుకూలురయి యున్నను, బహుభాగము రాజునకు లోఁబడిన ప్రవర్తనము గలిగియున్నది. వారి కుద్వాహనములు చేయువా రెందఱు !

మొద— అట్టివారలలో విజయసింహుఁడు మూలకం

దము గదా! ఈతండు మనలకుం దక్కినం దక్కినవారు లెక్కలూడ్చిన పక్కులు.

మూడ—అట్లనకుండు. రాజునందు సరదారులంద ఱయిష్టులయినను దేశమన్యాకాంతమౌట కేరికినిష్టము లేదు.

నాల్గ—రాజ్య మన్యులపాలుసేసి యపదూరుపడుట నాకిష్టము లేదు. నాయుద్దేశ్య మీరాజుం దొలంగించుటయు.

మూడ—మాల్వారాజునకు వ్రాసిన యుత్తరమున కాతం డేమి బదులు వ్రాసెను?

మొద— 'మన సేనాసమూహపరిమితియు నందు రాజపక్షము మనపక్షమువారి సంఖ్యావివరమును దెలుప వలయునని కోరియున్నవాండు. కోరినరీతి నే నాతనికి మరల వ్రాసి యుంటిని. అందుమీంద నాతం డిటుల వ్రాసినాండు. మార్గశీర్ష శుద్ధ దశమి దినంబునం దా నెత్తివచ్చునంట. మన సేనాభాగమును వేరుగ నున్నట్లు గనుపరుపక సేనా వారమంతయు నేకముగ నునిచి రాజును కాపాడుమిష చేం గోటదక్షిణ ద్వారమున రాజును గమ్ముకొని యుండుండనియు మాల్వాసైన్యము చిత్తూరుకోట ముట్టడించినతోడన, రాజును వదలి పలాయనం బొనరింపవలసినదనియు సూచించెను. అపుడు వెంటనే తమ సైన్యము రాజుం బొదివి పట్టుకొనును. తక్కినవారిసైన్యము కోటను బట్టుకొని దానిని మన స్వాధీన ముచేయును. ఇదియ యేర్పాటు' అనెను.

భూతివర్మ, సురూపుసింగు, సరదారుసింగు, గరదు సింగు, శివసింగు లయిదుగురును జేరి యీలా గాలోచనలు

చేసిరి. కాని వారిలో సరదారుసింగు తక్కిన నలువురి తోడc గొంతవఱ కేకీభవించినను, నొక విషయమున మాత్రి మాతనికిc దన సహచరులు సల్పు యత్నము లంతగా రుచించినవి కావు. విజయసింహుని నెటుల నయిన బారిగొనుటయ భూతివర్మాదులు నల్వురు తమ మొదటి పనియని తలంచుచుండిరి. ఈతని కిది సరిపడినదిగాదు. అయి నను దన యీయభిప్రాయము వారల కెఱుకపడకుండ నటిం చుచుc బయికిమాత్రము వారితోటిపాటు తానును దలనెగుర వేయుచుండెను. వారియుద్యమమున కెట్లుభంగముగలుగc జేయcగలనాయని యాలోచించుచుండెను. వారియాలోచన లన్నియు ముగించువఱకుc దనమనోగతము బయలుపడకు యెట్లో జాగ్రత్తపడెను.

వారిరహస్యాలోచనము ముగించినతోడన, వారంద ఱచ్చోటువాసి గుప్తమార్గముల నెవరితోవ వారేగిరి. శుక్రి వారమువఱకు సరదారుసింగున కేమిచేయుటకును దోcచ లేదు. తానీరహస్యమును వెలిచేసినవర్తమానము భూతి వర్మకుcదెలిసినయెడ, విజయసింహునిచావబద్ధము తనచావు నిజమగునని యతcడెఱుంగును. విజయసింహున కీవర్తమానము తెలుపనియెడ, మాచిమాచి యొకదేశభక్తుని ప్రాణమునుc దానే చేతులారc దీయించవలసియుండుననియుంగూడ నతc డెఱుంగును. విజయసింహునకుc గన్యాకృతిదాల్చిన మన్మధరాజ ధానియననొప్పు నొక్కకొమారిత గలదని మనకుcదెలియును. ఆచిన్నది సరదారుసింగుప్రేమకు గుఱియయియున్నదని మన

మెఱుంగుదుము. ఆతండక్కన్నియ నెట్లయినఁ బరిణయమాడవలయునని బహుప్రయత్నములు సేయుచున్నదియు మనము వినియున్నాము. విజయసింహుఁడును దనకూఁతు సీతనిక్కియు వలెననియున్నది. కానియాచిన్నదానిమనం బొండు రాజపుత్రయువకునియందు లగ్నంబయి యుండుటవలన నతని కాచెలి యందరాని ఫలంబయ్యెనని మనము చదివియున్నాము. అయినను వానికాచిన్నదానియం దింకను భ్రాంతి సదలలేదు. విజయసింహుఁడు తనకూఁతుమనంబుఁ నెటులయినఁ ద్రిప్పి యది తనయెడఁ బాదుకొనునట్లు చేయుగలఁడని సరదారుసింగున కొకనమ్మకము కలదు. అందువలన విజయసింహుప్రాణము నేలాగయినఁ దక్కింప నాతండు గోరెను. అందున కాతం డనేకాలోచనలు చేసెను. తుదకు నాతని కొకయుపాయము మనంబునకుం దట్టె దిగ్గన బయనమయి యెందేనిఁజనెను.

-:o:-

# ౩౦ వ భాగము

కృష్ణగిరిసమీపమున మనోహరంబగు నొకతటాకము గలదు. అది యెడతెగని జలతరంగములనెడు నాట్యస్థానమునందు విలాసముగ నాట్యముసలుపుచు నానందించు చక్రవాకదంపతులతోడను, కాముని హోమకుండములతో సరి దూఁగు మనోజ్ఞమయిన యెఱ్ఱదామరలఁ బొందియున్న పొగవంటి తేఁటికదుపులతోడను, నిజరామణీయకపర్యాదస్త నందన

వనసౌందర్యంబులగు పలుతెఱంగు తోటలతోడను మిగుల మనోహరంబయి యుండెను.

ఒకనాఁడు సాయాహ్నమునఁ దత్తటాకతరంగచలనముచే లాస్యంబునల్పు వివిధములగు తీవియల గుమితోనిండిన యా చెరువునొడ్డున, వనితాతిలక మొక్కర్తు, చింతానిమగ్నమానసయయి కూరుచుండి యీలాగున విచారించుచుండెను.

నేఁ డాసరదారుసింగు మోముఁజూడ నొకచిత్రముగఁ గనుపడెను. నాతో నాతఁ డెన్నిమాఱులు ప్రసంగించలేదు. ఈ దినమున నాతనిముఖమున్న ట్లెప్పుడు నుండలేదు. అందును నాయం దాతనికిఁ గలయనురాగభరంబు కొలఁది యింతయని వర్ణింపనలవిగాదు. అతని మానసము నా కిదివఱ కెన్నఁడును దాఁచినవాఁడు కాఁడు. కాని యాతండు నాతోడ నేఁడెద్దియో యొకరహస్యమును జెప్పఁబూనియు నేటికో చెప్పక నన్నితర ప్రసంగములలో దింపి యూరకున్నవాఁడు. నాతోడఁగూడ నాతండు చెప్పని విషయ మెంతరహస్యమయినదో! 'మీతండ్రి నీ దినంబునఁ జిత్తూరున కేగకుండునటులఁ జేయలేవా' యని మాత్ర మాతండు నొడివెను. దానియర్థ మేమో నాకు స్పష్టము కాలేదు. కాని యాతని యీమాట నాహృదయమందొకభరింపఁగూడని సంకటమును బ్రవేశపెట్టెను. మానాన్నగారి కేమయిన బెడద చేకురునా! చిత్తూరున మాకుఁ బలువురు శత్రువు లున్నవారు. వారివలన నా జనకున కేయాపద మూఁడనున్నదో! లేకున్న సరదారుసింగు నాతోడ నట్లెచ్చరికించియుండఁడు.

ఈ సమయమున నా ప్రాణప్రియుఁడు ధర్మసింగు నా చెంతనున్న యెడ నాతం డెంతయు నాకుఁదోడుపడియుండును గదా! నేఁ డిచటి కేతెంచి యీ కొలనుదగ్గఱ నన్నుఁగలసి కొనియెదనని వాక్రుచ్చి వెళ్ళినవాఁడు. వా రిందువిచ్చేసినయెడ నా తుచ్ఛుల యత్నములన్నియు సూర్యకిరణప్రసారమువలన మంచువలె విరిసి చెల్లాచెదరయి పోవుట నిశ్చయము.'

అని యనుకొనుచుఁ దనదృష్టియంతయుఁ జిత్తూరు మార్గమున నెలకొల్పియుండెను. అప్పటికి సాయంతనము నాల్గు గంటలయినది. ధర్మసింగును జిత్తూరునుండి జాముప్రొద్దుకడఁ బయనమయి కృష్ణగిరి కేతెంచెను. జీవబాయియు నతనిం గాంచిన వెంటన తాను దిగ్గనలేచి తనదుఃఖముం బట్టఁ జాలక కంటఁదడి పెట్టుకొనుచు నిలువం బడియెను.

ధర్మ - ఓ ప్రాణపదమా! ఏల నేఁడు నీ నేత్రోత్పలములనుండి యిట్టి వింతముత్తియములు రాలుచున్నవి? ఏ విచారము నీ మది నిపు డావరించెను?

జీవ—ప్రియా! నేఁడొకవిచారకరమగు సంగతి విని యున్నాను. అది మా నాన్నగారినిఁ గూర్చిన విషయము. ఆవార్త విన్నదిమొదలు నామనంబు పవనచలితదీపకళికయుం బోలె సంచలించుచున్నది. తమతోఁ జెప్పుటకు నానోట మాట రాకయున్నది.

ధర్మ—అంత దుర్వార్త యేది?

జీవ—మా నాయనగా రీదినమున ప్రాతర్భోజనానంతరము చిత్తూరు వెళ్ళి యున్నారు. వారీయూరు విడిచిన పిదప

మీనాయనను జిత్తూరువెళ్ళకుండఁ జేయలేవా ? అనియొకరు నన్నడిగిరి. అతఁడట్లు పలుకుటకుఁ గారణమేమో తెలియఁ జాలక పరితపించుచుంటిని. ఆతం డూరక నాతోనట్లు వచించు వాఁడు గాఁడు. నమ్మఁక ముంచఁ దగినవాఁడు.

ధర్మ—ని న్నాలా గడిగిన దెవరు ?

జీవ—సరదారుసింగు. ఆతఁడు నాయెడల నెట్టిభ్రాంతి గలవాఁడో తామెఱింగియ యున్నవారు. అట్టివాఁడు నాతోడ నబద్ధము లాడునా ?

ధర్మ—అతనికి నీమీఁదఁగలయనురాగము నాకుఁ జెప్ప నక్కఱలేదు. 'ఎద్దియో మీజనకునిగుఱించి శత్రువులలోఁ గుట్ర జరుగుచుండవచ్చును. సరదారుసింగు భూతివర్మసేనా కోటియందుఁ జేరియున్నవాఁడని నేను విన్నాను. కానియాతం డంతదుర్మార్గుఁడుగాఁడు. మీనాయనగారివిషయమయి మచ్చరించియున్నశత్రువు లేమో ఘోరము జరిగింప సిద్ధపడియు న్నారని నాకుఁదోఁచుచున్నది. కాని నీవు భయపడవలసిన యవసరము లేదు. నేవారినందఱఁ గనిపెట్టియున్నవాఁడ. నేఁడే మో భూతివర్మ శివసింగు లింటలేరు. కృష్ణగిరి మార్గమున నెచ్చటికో వెళ్ళుచుండుట చూచితిని. దీనివిచారించిన వారంద తేమో యేర్పాటుచేసికొనియున్నట్టున్నది. నేనిచట నిలుచుట కిదిసమయముకాదు. రేపో మాపో మరలనిన్నుఁగలసికొనెదను. నేఁ బోయివచ్చెదను'అని చెప్పి యశ్వారూఢుఁడయి వడివడిగ స్వారిచేయుచు ధర్మసింగు చిత్తూరున కేగెను.

—o—

# ౩౧వ భాగము.

ఆహా! ఏమియీచిత్రము! భూతివర్మ మొదలగు వారలు తాము పన్నుకుతంత్రము లొరుల కెరికిందెలియఁగూడ దని యతిరహస్యస్థలమును జేరి మంత్రాలోచనముఁ జేసిరి. వారి కది సాధ్యమయ్యెనా? తా మేర్పరచుకొనిన తా వెవ్వారికి నగమ్యమనియుఁ దమచేయు గుప్తప్రసంగ మొరుల కగ్రాహ్యమనియు నెంచియుండిరి. అన్నిరహస్యముల గ్రహించు మహాశయుఁ డొకఁ డున్నాఁడని వారూహింపఁజాలరయిరి.

శనివారమునాఁడు విజయసింహుఁడు రాజునగరున కరిగెను. రాజుతోడఁ గొంతకాలము రాజకార్యములవిషయమయి మంతనంబులాడి తనవాగ్దత్తప్రకారము తాను గరదుసింగుగారియాగారమున కేగెను. గరదుసింగా దినమున నెచ్చటికింబోవక గృహంబునన నిలచియుండెను. విజయసింహుఁడు రాఁగానే తా నెదురేగి తనగృహంబునకుఁ దోడికొనివచ్చి యాతనితో విస్రంభాలాపంబులు సల్పుచుఁ బ్రొద్దుగడపుచుండెను. విజయసింహుఁడును వానిమాటల కమితానందకందళితహృదయుఁ డగుచుండెను.

ఈమాటలసందడిని విజయసింహునకుం బ్రొద్దు తెలియలేదు. సాయంతనము నాలుగుగంటల కేతెంచినవాఁడు చీఁకటిపడువఱకు నాచోటు విడువలేదు. తా నూరునకుంబోవలయునను సంగతియు నాతనిమనంబునకు రాలేదు. గరదుసింగువాఙ్మాధురికిం జొక్కుచుఁ దనివిదీరక యతనితో సల్లా

షంబు లాడుచుండెను. ఎట్టకేల కాతం డాసంభాషణము ముగించి పయనమున కాయత్తపడగా, గరదుసింగు, మిత్రి నారేయిఁ దన యింట నిలువుమని బలవంతపెట్టెను. కాని యచట నిలుచుట కాతం డంగీకరింపలేదు. కొంచెము దూర మయినం గొనుండని బహువిధములం బ్రార్థించెను. కాని వాని ప్రార్థన లన్నిటికిం దగిన యుపశాంతి వచనముల నొడివి విజయసింహుఁడు స్నేహితుని వీడ్కొని తన యాజానేయము నారోహించి కృష్ణగిరి మార్గమున స్వారిచేయ నారంభించెను.

శత్రుదేశమునఁ జీఁకటి నొంటరిగఁ దనయజమానుఁ డయ్యెడఁ బ్రోవం జనుచున్నవాఁడు; అతని కెద్దియే నపాయము సంభవించునేమోయని భయంబునంగాఁబోలు నాయశ్వమును వడివడి నడువసాగెను. చిత్తూరునకుఁ గృష్ణగిరి నాలుగు మైళ్ళదూరముననున్నది. త్రోవ నిఱుప్రక్కల ననేకానోకహ ములు తఱుచుగ వ్యాపించియుండెను. చిత్తూరు కృష్ణగిరు లకుమధ్య నూరుగాని పల్లియగాని లేదు. విజయసింహుఁడు రెండుమైళ్ళదూరము స్వారిచేసెను. అచ్చట చెట్లుచేమలు మఱింత తఱచయి దారి కీవలావలఁ జిన్నచిన్న తిప్పలు గలిగి యాదారి, పాంథజనాళికిం దిప్పలు గలిగించునదియయి యుం డెను. ఆ భయంకరప్రదేశమున కనతిదూరమున, బహుశాఖా సమన్వితంబును జోరజనశరణ్యంబునగు నొకచింతచె ట్టుండెను. మృత్యుముఖముంబోని యా ప్రదేశమునకు విజయసింహుఁడు వచ్చుటతోడన వానిగుఱ్ఱము తననడకవడి తగ్గించి మందగమ నంబునం బోవఁజొచ్చెను. నడక మందమాటయు కాక యా

యశ్వము ముం దెద్దియో యడ్డగించినటుల నాకస్మికముగ వెనుకకు మొగ్గి చదికిలఁ బడెను. విజయసింహుఁడును సంకుచితాశ్వగమనమునకుఁ గారణ మారయఁజాలక తా నశ్వము నుండి క్రిందికి దుమికెను. అంత విజయసింహుఁడు నల్వురు మనుజుల చేతులలో బందీకృతుఁడయి నిలువవలసిన వాఁడయ్యెను. ఆ నలువురు నాతనిఁ గాలుసేతులఁ బగ్గముల బిగియఁ గట్టి శవమునీడ్చికొనిపోవురీతి సమీపమం దున్న గుట్టలచాటునకు నాతనిం గొనిపోవుచుండిరి. ‘ఈతని మనమేల మోచికొనిపోవలయు ? ఇచ్చటన ఖండించివైచిన మనభారము తగ్గిపోవును గదా !’ అని యందొకండనెను. ‘మన మాలాగునఁ జేయఁగూడదు. మన యజమానుఁడు వచ్చువఱ కీతని మన మేమియుం జేయఁజనదు. ఇది త్రోవగదా ! ఎవరయిన వచ్చెదరేమో ! ఆ తిప్పలచాటునకుం గొంపోదము కదుండు’ అని రెండవవాఁ డనెను.

ఆలా గాతనిం గొనిచని కొండచరియ నొకచోనుంచి యెవరికొఱకో యెదురుచూచుచు నిలువంబడిరి. ఇంతలో వల్గితధారావిశేషంబునఁ దనవైపునకుం బాఱు నశ్వఖురధ్వని వారి చెవులం బడెను. ఆ ధ్వని తనయజమానుని గుఱ్ఱపుగిట్టలచప్పుడని యెంచి యత్యాతురత వా రా దిక్కునకు దృష్టిసారించి చూచుచుండిరి. కాని యాసాది తన యశ్వమును దఱుముచుఁ దక్కరు లున్న తావునకుం దుమికించి తటాలున వారిలో నొకనిం దన చేతి కరవాలమునకుం బలియిడెను. మిగిలిన మువ్వురుం భయచకితమానసులయి యా యాశ్వికుని

విజృంభణమునకుం దాళఁజాలక తమపిక్కబలముం జూపి పలాయనము సలిపిరి. అప్పు డా యాశ్వికుఁ డచటనున్న విజయసింహుని కట్లూడ్చి యాతని కుపచారములు సలుపుచుండెను.

తెక్కలికాండ్రు కొంతదవ్వరిగి తమకుఁగలిగిన భ్రాంతిని సవరించుకొని తమ్మునెదిరించినవాఁ డొక్కండయని గ్రహించి మరల నాయాశ్వికు నెదిరింప వెనుకకు మఱలిరి. ఇంతలో వారియజమానుఁడును వారలఁ గలిసికొనిరాగా వారు నలువు రొక్కుమ్మడి దొమ్మిగ నా యాశ్వికునిం గొదివిపట్టుకొన యత్నించుచుండ నాతం డందఱ కన్నిరూపులయి పోరాడుచుండెను. బంధవిముక్తత సేదఁదేఱియున్న విజయసింహుఁడచటఁ బడియున్న తస్కరుచేతి కరవాలముం గొని యా యాశ్వికునకుం దోడుపడియెను. ఈతుములంబున వీ రిద్దఱు వారి నలువురి చేతఁ జిక్కిన ట్లొకప్పుడు దోఁచుచుండెను.

ధర్మముండుచోటన దైవముండునుగదా! క్రొత్తయాశ్వికుఁడును విజయసింహుఁడును దస్కరులతోడం బోరిపోరి యలసియుఁ జేయునదిలేక పోరుసల్పుచుండిరి. శత్రువుల బల మంతకంతకు రేకెత్తుచుండెను. వీరిరువురకు నలసట హెచ్చుచుండెను. బలముతగ్గుచుండెను. ఆ సమయమునఁ బోనీకుఁడు పోనీకుఁడని గంభీరస్వనంబున మఱియొకయాశ్వికుఁ డతిరయంబునం జనుదెంచి తస్కరులపయిం బిడుగుపడినవడువున దుమికి యలసియున్న విజయసింహునకును మొదటియాశ్వికునకును దోడుపడియెను. అంత నానల్వు రైకాగారికులును జేయునదిలేక పాఱిపోయి ప్రాణములం దక్కించికొనిరి.

విజయసింహుని ప్రాణములు దక్కెను. కాని యతని యెడమచేతిపయి నొక్కయలఁతిగాయము మాత్రము తగిలెను. అతండీయిరువురాశ్వికుల చేయూతంగొని మెల్లనఁ దిబ్బలు మిట్టలు దాఁటి వారలతోఁ గృష్ణగిరిమార్గమునకు మఱలవచ్చి చేరెను. అచటవిజయసింహునిగుఱ్ఱ మొకచెట్టునకుఁ గట్టివేయఁబడియుండెను. విజయసింహుఁడు దానిం గని కరంబు సంతసించెను. వారు మువ్వురును దమతమయాశ్వముల నారోహణము చేసిరి. అప్పుడు విజయసింహుఁడు మొదటియాశ్వికునిఁ దమగృహంబునకు విచ్చేయుమని పదింబదిగ వేఁడికొనెను గాని యాతండు 'నే మిమ్ము మరలఁగలిసికొందును' అని పలికి వారియనుమతిఁ గొని యచటనిలువక మఱియొక త్రోవం జనెను. తానుపోవు తొందరలో నీతఁడు తనచేతితువాలా నచట వదలిపోయెను. దానిని విజయసింహుఁడు భద్రముచేసెను. పిమ్మటఁ దక్కిన వారిరువురుఁ గృష్ణగిరిమార్గమునఁ బయనంబు సేయఁదొడఁగిరి.

వెన్నెల పిండియారఁబోసినటుల నెచటఁ జూచినను దన రాజత కాంతులఁ బ్రకాశించుచుండెను. విజయసింహుఁడు తన చెంతనున్న యాశ్వికుని మోముఁ దేఱిపాఱఁ జూచెను. అపు డతని సంతోష మేమని చెప్పవలెను; విజయసింహు నేత్రము లానంద బాష్పబిందువులం దొప్పఁ దోఁగెను. 'అప్పాజీ ! నీవిచ్చటి కేలా గరుదెంచితివి ?' అని విభ్రాంతి నడిగెను. మీరు చిత్తూరునుండి ప్రొద్దుగ్రుంకినను రాకపోవుటంజేసి యింట నందఱును దొందరపడుచుండ మీకొఱకేను జిత్తూరునకుం బయనమయి వచ్చుచుంటిని. ఇచట

మీాయశ్వము వలలోఁ దగులుకొని పడియుండెను. ఎద్దియో మోసము తటస్థించి యుండునని యెంచి యాతురంగమును వలనుండి తప్పించి దాని నచటఁ గట్టివైచి యావైపునఁ గల కలధ్వని యాలించి వెంటనే యచ్చోటికి శబ్దానుసారముగఁ బరువిడి వచ్చితిని. దైవకృపవలనఁ దగుతరి సమయమునందుఁ దోడ్పడఁ గలిగితిని' అని యువ్వాజి బదులు చెప్పెను.

నాయనా ! నీఋణ మే నెట్లు దీర్చికొనఁగలను ! నీవు మున్నప్పుడు కృష్ణగిరిలో నాదుర్మార్గుల బారినుండి తప్పించి నన్ను బ్రతికించితివి. మరల నిప్పుడును నీకూరులగు చోరుల నుండి నాజీవముల నిలిపితివి. ఆపత్రథము యువకుఁ డెవండో గాని వాఁడు నాపాలిఁటి దేవుఁడ యని చెప్పవలెను. ఆతం డాసమయమునకు రానియెడ నన్నాతస్కరు లప్పుడ యమసద నమునకుం బాఁతకాఁపునుఁ జేసి యుండియుండురు సుమా ! అని విజయసింహుఁడు వారిరువురను గొనియాడెను.

వీరిలాగు మాటలాడుకొనుచు నశ్వముం దరిమికొని యారేయినడిజామునకుఁ గృష్ణగిరిగ్రామముఁ జేరిరి. తలుపు తట్టినతోడనే విజయసింహుని పత్నియు, సుతయుఁ దటాలునఁ దలుపుఁ దెఱచి వారలం గని సంతసించిరి. ఇంత తడ యుటకుఁ గారణమేమని కూఁతు రడుగ జరిగిన వృత్తాంతముం తయు విజయసింహుఁ డాత్మజకు వినిపించెను. తల్లియుం గూఁతురును గన్నుల నీరువెట్టుకొనుచు వారిల్లు చేరినందునకు భగవంతునకు వందనశతంబు లాచరించిరి. దొంగచింతయొద్దఁ దన తండ్రినిఁ గాపాడిన మొదటి మహాపురుషుఁ డెవఁడాయని కూఁతురు లోన విచారించసాగెను.

—:o:—

# ౩౨ వ భాగము.

---

కాలము రాట్నమువంటిది. నెలలు దాని యాకులు. కాలపురుషుఁ డీకాలచక్రమును వలయాకారముగ నెగువకు దిగువకుం గ్రమముగఁ ద్రిప్పుచుండును. లోకములనెల్లఁ జీకాకుపఱచిన వేసవియుఁ గర్షకులకుఁ దర్షంబు దీఱులాగున సస్యసమృద్ధి నిచ్చిన వర్షకాలమును గడచనియెను. ఇండ్లు వాకిండ్లులేని బీదసాదలకు బాధాకరమగు శీతకాలము ప్రవేశించెను. ఇది మార్గశీర్షమాసము. మార్గశీర్షమాసమున సూటాడుటకయినఁ బొద్దుండదనునుడి సడిపడినది గాదు. ఇదివఱ కెండకాలముననఁగాని వానకాలముననఁగాని బయలునకు రాక పేటికాంతస్థములయి యుండిన రల్లకములును నీశారములు నిప్పు డెక్కుడఁగాంచిన వాడఁబడుచుండెను.

మార్గశీర్షమునఁ బదిదినములు గడచెను. ఒకనాఁడు చిత్తూరుపురాధిపతి యగు ప్రమారుఁడు గొంద ఱాంతరంగిక మిత్రులతో సభాభవనమందు మంతనంబు లాడుచుండెను. అప్పుడు పవ లురామరిక కదిగంటలయినది.

సురూప్‌సింగు - మహాప్రభూ ! నేను దమతోఁడ మనవిచేసిన విషయము తాము చక్కఁగఁ బరిశోధించినం గాని తమ మనంబున కది తేటపడదు. పరుల మనోవ్యాపారములను జాగరూకతతో గ్రహింపవలయును. ఎవరు విశ్వసనీయులో యెవరు కారో తెలిసికొనుట దుస్తరము. పయి కంద ఱాప్తుల

వలెఁ గనుపడుచుందురు. మీ మానస మెవరిపై నమ్మికయుం చెనో వారే మోసగాండ్రయి యుండవచ్చును. ఈ కపట స్వభావులు తేనెపూసిన కత్తులు; ఇచ్చకము లాడి కడకు మోసము వాటింతురు. ఇంతకును నే నాతనిపైఁ గిట్టక యిట్లు వచించెదనని మీ రూహింతురేమో? మీ రట్లెంత మాత్రమును దలంపకుఁడు. దేశక్షేమము విచారించి, యున్నస్థితి మీకు విన్నవింపవలసి వచ్చినది.

అని సురూపుసిం గెద్దియో చెప్పఁబోవుచుండ నధిపుఁ డతనిమాట కడ్డమువచ్చి 'విజయసింహుఁ డంతటిస్వామిద్రోహియా? నే నాతనియం దెంతో నమ్మికయుంచితిని. ఇప్పటికిని నా కాతనియెడ నవిశ్వాసము గలుగకున్నది. ఇంకను వాని నడత పరిశోధింపవలెను' అనుచు శివసింగునుజూచి నీ కాతనియం దభిప్రాయ మేమని యడిగెను.

శివ- 'స్వామీ! విజయసింహునిఁగూర్చి సురూపుసింగు చెప్పినది చాలదు. చెప్పవలయునన్న నింకనెంతయో గలదు. కాని మేమాతని విషయమై యధికముగఁ బ్రసంగించినయెడఁ దమమనం బెక్కడనొచ్చునో యను శంకచేత సురూపుసిం గూరక చూపివిడిచినాఁడు. నిశ్చయముగ నతనిగురించి చెప్ప వలసినసంగతు లనేకములున్నవి. వీనికంతగా మేముచూడ లేము. చెప్పకతప్పనియంశ మొకటియున్నది. చెప్పిన మానము చెప్పకున్నఁ బ్రాణము పోవునుసుడీ! అతఁ డిప్పుడు మీజన్మశత్రువైన మాల్వారాజుతోడ రాజ్యవిషయకమైన

కుట్రలు పన్నుచున్నవాఁడు. అందునకే మేమింతత్వరపడివచ్చితిమి. ఇది చిత్తగింపుఁడు" అని యొకచీటి ప్రభువుచేతికిచ్చెను.

ఆహా! కొండెగానినాలుక గుండెకాయవంటి మిత్రులయెడంగూడ నరగలిఁగలిగించునుగదా! ఆలేఖ నిజముగ విజయసింహుఁడు వ్రాసినదేనాయని యాలోచింతము. అది యాయన లిఖించినదె! కాని దాని నాతఁడు వ్రాయుటకు సందర్భము వేఱు! ఆనిరపరాధియందుఁ బ్రభువునకాగ్రహము కలిగించుటకయి యీగిట్టనివారు పన్నినపన్నాగమిది:- ఆనాఁడు విజయసింహుఁడు గరదుసింగుగృహమునఁ బొద్దుగ్రుంకువఱకు నిలిచెనని మనకుఁదెలియును. ఆతనికి గరదుసింగునందుఁగల యనురాగమును సమ్మకముంగూడ మనమెఱుంగుదుము. తనయం దాతనికింగల విశ్వాసము నూతఁజేసికొని గరదుసింగు విజయసింహునకిట్లుబోధించెను. "మిత్రమా! దేశక్షోభమును దొలఁగింపఁదగిన సహాయము మనకుఁగావలసియున్నది. మాల్వారాజు మనవాఁడు. అతనినిఁ గోరినయెడ నాతండు మనకుందగిన సహాయమొనర్చి రాజ్యమునందలి తుందుడుకు మాన్పును" అని గరదుసింగు సమ్మకము గలుగునట్లుపలికి విజయసింహుని మాల్వారాజునకొక లేఖ వ్రాయుఁడని ప్రార్థించెను. ఈమోసముదెలియక గరదుసింగునే యొక యుత్తరము లిఖింపుమని విజయసింహుఁ డతనిచే వ్రాయించి లోనిసంగతులఁబరికింపకయ దానిపయిఁ దనచేవ్రాలు పెట్టెను. సమ్మక మెంతపనినైనఁ జేయించునుగదా! ఆయుత్తరమును గరదుసింగు మాల్వాధిపతి కంపలేదు. అది యతనిదగ్గఱనె యున్నది. దానిని వీ రిట్లుపయోగించిరి.

ఆజాబు నందికొని ప్రభువు దాని లోలోనఁ జదివికొనెను. దానినిఁ జదివినతోడన ప్రమారుని మొగమున నెత్తురుచుక్కయయిన లేకపోయెను. విజయసింహునియందుఁగల నమ్మకమంతయు నాఁటితో నంతరించెను. బహుజలంబుల సేతువువలెఁ గొండియంబున సఖ్యమును జెఱుచునుగదా! ప్రమారుఁడు శిరఃకంపమునర్చి మితిలేని యాలోచనలకుం జొచ్చెను.

వీరీలాగున సంభాషించుచుండ వేగులవాఁడొకఁడరుదెంచి 'మహాప్రభూ! శత్రువులు చిత్తూరుపయి దండెత్తివచ్చి కోటను ముట్టడించుటకు మొనలుదీర్చియున్నవారలు. నిముసమాలసించిన వారు కోటలోఁ బ్రవేశించుదురు. త్వరపడుఁడని పలికెను. ఈ గుండియ లవియువార్త చెవిసోకగనే ప్రమారుఁడు వితాకుఁజెందెను. విజయసింహుఁడు ద్రోహియగుటకు సందియములేదని నిశ్చయించుకొనెను. తొల్లి యుద్ధముసంభవించినపుడు సాధారణముగఁ జేయునట్లు సరదారుల నందఱను రమ్మనుమని యతఁడాజ్ఞ చేసెను. కాని విజయసింహునకుమాత్రము వర్తమాన మంపలేదు.

సరదారెవరును రాలేదు. రానందునకుఁ బెక్కులు కారణంబులు గలవు. ప్రమారుఁడు తనతోఁబుట్టువపట్టియు రాజ్యమునకుఁ గొత్తవాఁడునయిన యప్పాజీకి రాజ్యమందు గొప్పసేనానిపదవి నొసంగి యాతనియందు మితిలేనియనురాగము గలిగియుండెను. బహుకాలమునుండి రాష్ట్రమునకెద్దియేని మహాత్కార్యముసంభవించునపుడెల్ల తమయాలోచన సాలోచనలుగొని ప్రభువు తమ్ము గౌరవించుచుండెడి వాఁడు.

ఇప్పుడట్లు చేయక నవీనముగ వచ్చియున్న యీయప్పాజీయందుఁ బ్రేమయుంచి వానిని గౌరవించుచుండఁ దమ్ము నిరాదరణము చేయుచున్నాఁడను క్రోధమునఁ గొందఱు రాలేదు. స్వలాభపరాయణులయి రాజునకుఁ గీడుగోరుచుం గొందఱు రాలేదు. నిశ్చయముగ రాజభక్తిగలిగి ప్రభువుయొక్కయు దేశముయొక్కయు క్షేమమునుగోరు సరదార్లను సురూపసింగు మొదలగువారి దుర్బోధనవలన రాజు పిలువలేదు.

తమ్మెదిరించువారు లేకపోవుటచేత శత్రువు లంతకంతకుఁ జెలరేఁగి కోటను సమీపించుచుండిరి. రాజునకేమియుఁ దోఁచలేదు. అత్తఱి నచ్చటనున్న సురూపసింగు మొదలగువారు ప్రభువుముందునిలిచి "స్వామీ! మీరాలోచింపకుఁడు. వీరెవ్వరు రాకపోయినను భయములేదు. మనసేనలనన్నిఁటినిఁ బురికొలుపుకొని శత్రువులపయింబడి యిప్పుడ రూపుమాపెదము. కార్యమును సాధించెదము" అని చెప్పి లేచి వెలుపలికి వెళ్ళిరి. వెంటనె కొంత సేనావారము రాజునకు బాసటగ నిలువఁబడెను. ఈనడుమ శత్రువులును బ్రబలి కోటదక్షిణమార్గమునం గోటం బ్రవేశించి రాజును గమ్ముకొన వారిధాటికోర్వఁజాలక కాఁబోలు సరదారుసింగు రాజరక్షణమునకుఁ బంపినసేన రాజును విడిచి నలుదెసలఁ బాఱిపోయెను. శత్రువులు నిరాటంకముగ రాజుం జెఱఁగొనిరి.

శత్రుసేనలో నుత్సాహ కలకలధ్వనులు మెండయ్యెను. తమ మనోరథములు పండెనని సురూపసింగు మొదలగుదుష్టులు సంతసించుచుండిరి. సర్వమును వైరుల

స్వాధీనమవునటులఁ గానుపించుచుండెను. ఇంతలోఁ గోటను తూర్పుదెసనుండి శత్రువులలో విపరీతపరిదేవనారవ మొకటి బయలువెడలెను. శత్రుసేనయంతయుఁ జెల్లాచెదరయి నలు దెసలం బరువిడుచుండెను. సింహప్రతిమానబలులు ముప్వురు యోధులు పలాయనంబుసేయు శత్రువులపయి సింహకిశోరం బులభంగి లంఘించి పదులునూరులుగ వారల యమసద నంబున కనుపుచుండిరి. ఈమూగురకుం దోడ్పడి వారి వెనుక రాజభక్తిపరాయణములగు చిత్తూరుసేనలు శత్రు వులం దఱుముచుండిరి. రిపువర్గము దప్పించుకొని పాఱిపోకుండ, గొంత చిత్తూరు స్కంధావారము మండలాకృతిగ శత్రుసేన లకుం జుట్టును నిలువంబడి యుండెను. ఈముప్వురు యోధుల వలన శత్రువులు నుఱుముసేయఁబడుచుండిరి. క్షణములోఁ గోటనుఁ జుట్టుకొని యున్న మాల్వారాజు సేనయంతయుఁ గంటికగుపడకుండఁ బాఱిపోయెను. వెంటనే యాముప్వురు యోధులు రాజుం జెఱగొని యేగుచున్న వైరివర్గముపయిఁ బిడుగుపడినపగిదిఁ బడి వారలలోఁ గొందఱ ఖండించియుఁ గొందఱఁ జెండియుఁ గొందఱ బాధించియుఁ బలుతెఱంగుల వారల హింసించిరి. ఆసంకులసమరమునం దాముప్వురు పురు షులలో నొకఁడు మాల్వారాజుచేతం జిక్కినట్లు గనుపడు చుండెను. మాల్వారాజును నా యువకునిఁ బొరిగొనుటకై తన కరవాలము నెత్తెను. ఆతరుణమునఁ బదునాలుగు బదు నేను వత్సరముల పడుచువాఁ డొకఁ డశ్వారూఢుఁడయి చిత్తూరుసైన్యమునుండి తటాలున నచ్చటికిఁ దన యశ్వమును

చుమికించి మాల్వారాజు చేతి ఖడ్గమును దన గరవాలంబున దిగువకుఁ బడునట్లు చేసెను. అంత నతఁడు చేయునది లేక మాల్వారాజు తా నిదివఱకుఁ బోరుసల్పుచున్న యువకునకు లోఁబడి యావలకుం గొంపోఁ బడియెను. అట్టి యాపత్స మయమునఁ దనకుం దోడుపడిన మహాపురుషుఁ డెవ్వఁడని యా యువకుఁ డాలోచించెను. కాని యాతం డేరయినది యా యువకుని మనస్సునకు రాలేదు. ఇదివఱ కెన్నఁడో తాను చూచిన మనుజుఁడని మాత్రము గ్రహించెను. ఆ వదుచు వానికి గడ్డముగాని, మీసములుగాని రాలేదు. ఆపాదమ స్తక మాతఁ డుదచ్ఛదముం దొడిగికొని యుండెను. వాని మోముచందురుఁడును నేత్రకుముదములు నతఁడొక సుందర పురుషుండని సాక్ష్యమిచ్చుచున్నవి.

తాను వచ్చినకార్యమును నెరవేర్చి యావదుచు వాఁడు మరల శిబిరముం బ్రవేశించెను. ఆ యువకుఁడును మనమున నాలోచించుచుఁ దిరిగి సంగరరంగముం జొచ్చెను. ఈ సమరమున సుహూపుసిం గొక యువకునిచేఁ జావఁబడెను. మూడవ పురుషుఁడు ప్రమారుని బంధవిముక్తుం గావించి యతనిని సురక్షితస్థలమునకుం జేర్పించుటయ కాక సరదారు సింగును జెఱగొనెను.

ఈపగిది శత్రువులనెల్లఁ దమభూరిశౌర్యాగ్ని కింధ నంబుగ నొనర్చిన యాశూరత్రయ మెవరని యోచించెదరు? అందు రాజును జెఱనుండి తప్పించిన నడివయసు వాఁడు చిత్తూరు రాజ్యలక్ష్మి నన్యులవశముగానీనని కంకణము గట్టి

కొనిన రాజభక్తిస్వరూపుఁడగు విజయసింహుఁడేసుడీ. ఈ విజయసింహునకు వామదక్షిణభుజంబులయి యీదుష్కర కార్యం బవార్యశౌర్యమున నిర్వహించిన యాయిరువురు యువకు లప్పాజీ ధర్మసింగులుఁగాక మఱెవ్వరు?

తన్నుగక్షించి చేతులుజోడించుకొని చెంతనిలువఁబడి యున్న విజయసింహునిఁ, దక్కినయిద్దఱను గాంచి ప్రభువు నిశ్చేష్టితుఁడయ్యెను. వెనుక నామోసగాండ్రు విజయసింహుని గుఱించి పలికినపలుకు లప్పు డాతనిమనంబునకు వచ్చెను. ఆలోచించక వారిమోసపుమాటల నమ్మి తానాతని విషయ మయి పొందిన దురభిప్రాయమునకు వగచి మనంబునం దన్నుదా నిందించుకొనఁ దొడఁగెను. ఆదుష్టుల దుర్బోధనలవలన విజయసింహుఁడు దోషియనియెంచి తానాతనిరావింపక యవ మానించినందునకుం జింతించెను. ఆతనిని క్షమాపణము గోరనెంచెను, కాని వానిదోషమానస మాతనికి నోరాడ నీయలేదు. అయినను నోరుచేయవలసినపని యతని నేత్రములు గన్నీళ్ళవలనఁ జేసెను. విజయసింహుఁడు తనప్రభువుమనంబు నంగల తొట్రుపాటునెఱింగి "స్వామీ ! ఈమీసేవకునియెడ మీరొకలాగెంచవలదు. సమయమునఁ దమకుఁదోడ్పడఁ గలిగి నందునకు సంతసించుచున్నాను" అనెను.

ధర్మసింగు, గరదుసింగు కొమారుఁడు. ఈతండు మొదటినుండియు ఋజుమార్గావలంబియయి నిర్దుష్టమయిన రాజభక్తిగలిగి దేశక్షేమము నెప్పుడును గోరుచుండువాఁడు. చిత్తూరు రాజ్యమందు స్వలాభపరాయణులయి రాష్ట్రము

నకుం గీడురోయు దుష్ప్రవ ర్తకులపయి నీతం డొకకన్నిడి యున్నవాఁడు. ఇపు డీయుద్ధరంగమునం దప్పాజీ విజయసింహు లకుం దోడ్పడి దేశమును నీయుపప్లవమునుండి తప్పించిన దీతండ. ఆహా! ఈతనిపౌరుష మేమని చెప్పనగు! పౌరుష కీర్తులుగల వానిబ్రతు కొక్క నిముసమయినం జాలదా?

ఇంటిలోనిదొంగను నీశ్వరుఁడయినఁ బట్టఁజాలఁ డను నట్లీదుర్మార్గులు పన్నుకుట్రల నింతవఱ కెవ్వరు నెఱుంగఁజాల రైరి. వారిదోహాభ్రము విజయసింహు మనీపానిలంబున నీవిధ ముగ నెగురఁగొట్టఁబడియెను. ఈయంతశ్శత్రువుల పన్నాగ యప్పాజీ కృపాణధారాజలమున శాంతపఱుపఁ బడి యెను. తనచేతంజిక్కియున్న మాల్వారాజును బ్రమారుఁడు పరిగొననెంచెనుగాని యుదారుఁడగు నప్పాజీ యాఘోర కార్యమునుండి పరిమారుని విముఖుంగావించెను. కానఁ బ్రమా రుఁడును నాతని శూరునకుఁ దగినసత్కారములతో, వదలి వేసెను. పిమ్మట నీరాజు లిరువురును బ్రాణమిత్రు లయిరి. అప్పాజీ శౌర్యస్థైర్యముల కాశ్చర్యనిమగ్నుండయి మాల్వా రాజు తన ముద్దుకూఁతు హేమాబాయి నతని కిచ్చి వివాహ మొనర్చెను. పరిమారునివలన మితిలేని యాదరణంబు నొం దుచుండుటచే సరదారులందఱు నప్పాజీయందు మొదట బద్ధ ద్వేషులయియుండినను వాని పరాక్రమాదులను నుపలక్షించి వారంద ఱిప్పు డతనియందు బద్ధానురాగు లయిరి.

-o*o-

# 33 వ భాగము.

'అబ్బా ! నేఁటికిఁ దప్పి బ్రతికితిమి ! బ్రతికి యేమి ప్రయోజనము? చిత్తూరురాజ్యమునకును మనకును ఋణము తీఱినది గదా?'

'నీ కెందున కింత నిరాశ కలిగినది?'

'నిరాశ కాక యేమున్నది ? ఇదివఱకుఁ బ్రభువు ప్రమారుఁడు గనుక మన యాటలు సాగినవి. ఇప్పుడో ! మనయాశ లన్నిటికిని నీరు వదలుకొనవలసినదే!'

'ఏల? ఇప్పుడు ప్రభు వెవరు? ప్రమారుఁడు గాదా?'

'అయ్యో ! ఇంకను నీకీసుషుప్త్యవస్థ వదలలేదా. ప్రమారుఁడు రాజ్యమునుండి తఱుమఁగొట్టఁబడి యెన్నాళ్ళయినది! ప్రభుత్వము మాఱినది. '

'ఏమీ! అనుకొనినంత యయినదే ! అదెటుల సంభవించెను? '

'ఆనాఁడు చిత్తూరునందు జరిగిన మహాసంకులసమరమున నప్పాజీప్రతాపానల విజృంభణము మనము కన్నులారఁ గాంచితిమిగదా ? అతని పరాక్రమాతిరేకమువలనన ప్రమారునకు విజయమును మనకు దేశాంతరభజనమును గలిగెను. తొల్లి యీ రాజదుర్బలత్వమును జాటుచేసికొని మనము దేశము విప్లవముల పాలుసేయుచున్నారమని సరదారు లందఱకుం దోఁచెను. ప్రమారుని నీరసప్రభుత్వమునందు వారందఱు

విసువు జెందిరి. ఆతనిని రాజ్యపదభ్రష్టుం గావింపనెంచి వారం దఱప్పాజీని బ్రోత్సాహపరచి యతని సాయమునం బ్రిమారుని రాజ్యమునుండి తఱుమఁగొట్టి యప్పాజీకిఁబట్టముగట్టిరి. ప్రిమారున కప్పాజీ మేనల్లుఁడఁట. మేనమామయని యైన విచారింపక యాతఁడతని రాష్ట్రమునుండి వెడలించి తాను జిత్తూరు సింహాసనము నధిష్ఠించెను. దురాత్మ్యుల నెవరు మన్నింతురు?' పాపము! ప్రిమారునిగతి యేమయినదో!

దేశాంతరము పాలయినాఁడు. అప్పాజీ యతనిని జీవముతో విడిచె నంతియ చాలును.

'ఏయుపాయముచేతనయినను విజయసింహాప్పాజీలను గడ తేర్చితిమా తక్కినసరదార్లును గిరదార్లును మనచేతిలోనివారు. కాని మనకార్యము గట్టెక్కువఱకు మనమిచట నిలువవచ్చునా యని సందేహము.

'సందేహమేమి? మనల నిచటఁ జెనకువా రెవరు.'

'అప్పాజీ మనల నిచ్చట నుండనిచ్చువాఁడుగాఁడు. నన్నును నిన్నును బ్రాణముతోఁగాని శవరూపమునఁగాని తనకుం బట్టియిచ్చినవానికి గొప్పబహుమతి యొసంగెదనని యుత్తరువు చేసియున్నాఁడఁట. వాఁడు వచించినపగిది రచించువాఁడ సుమా!' అని ముచ్చటించుచుఁ జిత్తూరున కనతిదూరమున నున్న యొక కొండచఱియయం దిరువురుమనుజు లొంటరిగఁ గూరుచుండి యుండిరి. తమ నోరు లెవరయినఁ గనుగొందురేమోయను సాధ్వసంబు వారలమనంబుం గలఁచుచుండెను.

వారట్లు చేయుట యొక చిత్రముగాదు. దూష్యకార్యముల నల్పువారి కెల్లప్పుడును దేనినిఁజూచినను భయమగదా!

కొలదిదినములు జరిగినపిదప నొకజో దొకయొత్తరపుఁ దేజీనెక్కి పయిఁజెప్పినమనుజులు దాఁగియున్నకొండకు సమీపముననున్న కాలిత్రోవను బోవుచుండెను. మృగయాకౌశలముగల కౌలేయకమొకటి యాతనిని వెంబడించుచుండెను. ఈసారమేయము త్రోవనున్న ప్రతివస్తువు నాఘ్రాణించుచు ముందువెనుకలకుం బరువిడుచుఁదన యజమానునివెంట నడచుచుండెను. ఈమలనుఁజుట్టివచ్చునపు డీకుక్క యొక్కచోఁ దటాలుననిలువంబడి కొండపయిపునకు మోరనుసాచి పసిపట్టుచుండెను. చిత్రమయినయాజంతుచర్యం గాంచి యాయోధుండు తనయశ్వము నచట నిలిపెను. ఆశునకమును దన యునికిం దనయజమానుఁ డెఱింగెనని తెలిసికొని మెల్లన దా నాకొండమీఁదికిఁ బోవ నారంభించెను. ఈయోధుఁడు దాని వెంబడించిపోవ సాగెను.

ఆవేఁపియు యోధుఁడును గొండచఱియలోనికిం బ్రవేశించిరి. ఆగుహాలోనిమనుజులు వీరిచర్య లాగుహానుండిచూచుచునేయున్నవారు. వారికీయోధుండు చక్కఁగఁగనుపించుచుండెనుగాని వీరాతనికిం గానుపించుటలేదు. ఈయాశ్వికుఁడింకను గుక్కవెంబడి కొండపయికిఁబోవుచుండెను. ఇంతలోఁ దటాలున వారొకగుప్తమార్గమున నాకొండచఱియనుండి వెడలి యయ్యోధుం బొదివి యతనిం బందీకృతుం గావించిరి. కుక్క మాత్రము వారలకుం జిక్కక పరువిడిపాఱిపోయెను.

బందీకృతుఁడయిన యోధుని నాయిరువురు బలాత్కారముగ లాగికొనుచుఁ దమగుహాకుం గొని చనిరి. అందొకఁడాతనివెంటనే పారిమారుప నుంకించెను, కాని రెండవవాఁడేటికో తా నాపని కియ్యకొనఁడయ్యె. అందువలన వానివిషయమయి యేమిచేయవలయునని యాయిరువురుఁ దమలోఁ దాము తర్కించుకొన నారంభించిరి.

ఇంతలో నాకొండకుఁ గొంచెముదూరమున మహాకోలాహల మొకటి బయలువెడలెను. ఆకలకలమునకుఁ గారణ మారయనెంచి కొండచఱియయందలి యిరువురుతమవాగ్వాదమును జాలించి తమశిరంబుల నొకింత పయికెత్తి నలుదిక్కులం బరికించిరి. ఎక్కడఁజూచినను చిత్తూరుసైన్యములు వ్యాపించి యున్నవి. సేనాసముదాయము లొకటివెంబడినొకటి యాకొండచుట్టును గ్రిమ్ముకొని వచ్చుచుండెను. గుఱ్ఱపుదళము లతివేగమున నక్కొండదరిఁ జేరవచ్చెను. ఆయిద్దఱుగుండియ లవిసిపోయెను. వారల కేమిచేయుటకును దోఁచలేదు. ఏమిచేయుటకును వ్యవధియును లేదు.

ఇంతలో రాజభటులు వెంటనేయేతెంచి వారిరువురం జుట్టుకొనిరి. ఈదండునకు విజయసింహుఁడు నాయకుఁడు. ఈవిజయసింహునితో నొకచిన్నజోదుకూడ వచ్చియుండెను. ఈపడుచుబంటుం గాంచినతోడన, బంధింపఁబడియున్న యాయువకుఁడు వెనుక తన్ను రక్షించిన దీతండయని గుర్తించెను.

విజయసింహుఁ గాంచినతోడన వారిరువురకుఁ గాలుసేతులు చల్లబడెను. నాఁటితోఁ దమకాయుస్సు సంకుచితమై

నదని యనుకొనిరి. భటులు కొంద ఱాయిరువురకరంబుల కరదండయును గాళ్ళకు సంకెలలును దగిల్చి వారిని నాయకునికడకుం గొంపోయిరి. పడుచుజోదు బాధింపఁబడియుండిన యోధునిబాధముల నూడ్చినపిదప నాయోధుఁడును సేనను గలిసికొనెను. ఆఖయిదీ లిద్దఱు విచ్చుఁగత్తులతోడి యమభటులంబోని భటులచేఁ జిత్తూరునకుం గొంపోఁబడి కారాగృహమునం దునుపఁబడిరి.

వీరిరువు రెవరని యోచించెదరు? మనభూతివర్మ గరదుసింగులు సుఁడీ! చిత్తూరునందు జరిగినయుద్ధమునకుఁ బిమ్మట వీరిరువురకు చటనిలువవలనులేక పలాయనంబుచేసి తమప్రాణంబులం దక్కించుకొనిరి. తమ్ముఁబట్టుకొన నప్పాజీ యత్నించుచున్నవాఁడని తెలిసి యచ్చటచ్చటఁ దిరిగితిరిగి తుద కీగుహాయందు దాఁగికొనిరి. గరదుసింగు కొమరుఁడు ధర్మసింగెట్టకేలకు వీరిం గనిపెట్టెను. శౌర్యమహోద్యమంబు లెపుడు ఫలింపకపోవును?

———:o:———

# ౩౫ వ భాగము.

చిత్తూరు రాష్ట్రాధిపతియయిన ప్రియమారుఁడు రాజ్యమునుండి తఱుముఁగొట్టఁబడినపిదప నాపదవికినభిషేకింపఁబడిన శ్రీత్రాతేఁ డప్పాజీ తనకునచ్చిన సచివాగ్రేసరులతోఁదనసభాభవనమున నిండుకొలువయి యుండెను. వీరాగ్రేసరుండగు

విజయసింహుఁ డతనిదక్షిణహస్తమువలెఁ బ్రధానమంత్రి స్థానమం దాతనికుడివైపునఁ గూరుచుండియుండెను. రిపుమర్మభేదనుఁడగు ధర్మసింగు రాజునకు శరీరరక్షకభటుఁడయి యాతనివెనుకఁ గూరుచుండెను. తక్కినసరదారులును వారివారి యుచితస్థానములయందు రాజును బరివేష్టించియుండిరి. రాజు విజయసింహురాజభక్తిని శ్లాఘించెను. ధర్మసింగు ఋజుమార్గప్రవర్తనము నిష్పక్షపాతబుద్ధినిగుఱించి కొందఱు ప్రశంసించుచుండిరి. అప్పుడొక భటుఁ డొకజాబును దెచ్చి విజయసింహునిచేత నుంచెను. అది గరదుసింగువద్దనుండి వచ్చినవిజ్ఞాపనపత్రిక. చెఱసాలప్రవేశానంతరము గరదుసింగునకు మనసు పరిశుద్ధమయ్యె. పశ్చాత్తాపమును గలిగెను. అవ్యాజమగు రాజభక్తిచేతను నిరూఢమగు దేశప్రేమచేతను బవిత్రమగు తనమానసమును గలుషంబొనర్చిన స్వార్థాంధుఁడగు భూతివర్మస్నేహమునం దాతని కసూయ జనించెను. బలవంతమునఁ జేసినమైత్రి చిరకాలముండదుగదా! తననేరమునొప్పుకొని తన్ను క్షమింపుఁడని రాజున కతఁ డొకమనవి వ్రాసికొనెను. విజయసింహుఁ డాజాబును రాజునకుఁ జదివివినిపించెను. సరదారు లందఱు వానివిజ్ఞాపన మంగీకరింపఁదగునని ప్రభువున కైకకంఠ్యముగ విన్నవించిరి. అందుమీఁదఁ బ్రజాభిప్రాయమునకు లోఁబడి రాజాతనిని క్షమించి గరదుసింగును గారాగృహవిముక్తుం గావింప నానతియొసంగెను.

కారాగృహవాసము కొంతవఱ కందఱినిఁగాకపోయినను దోషులలోఁ గొందఱినయినను దిద్దుబాటుఁ జేయుననుట

సత్యము. చిరకాలమునుండి దోసపుఁబనులఁ జేయ నలవాటుపడి యెల్లను సాధ్యముగాని ముష్కరులకుందక్క దుర్బోధవలనఁగాని పొరపాటువలనఁగాని మొదటినేరమును జేయఁబాలుపడిన జనుల కది పశ్చాత్తాపమునుసయితము గలుగఁజేయును.

గరదుసింగు మొదటినుండియు దేశభక్తియు రాజానురక్తియుం గలిగి ధర్మమార్గమున మెలంగుచుండెను. అతనికీదుర్మార్గవర్తనము మధ్యవచ్చినది. భూతివర్మ మొదలగుఁ పలువలసాంగత్యమునఁ గలిగినది. అతనికడ నితరదుర్గుణము లెవ్వియును లేవు. విజయసింహుని విషయమునమాత్రి మెల్లో భూతివర్మమద్బోధ కాతండు లోఁబడెను.

గరదుసింగును సభామంటపమున కరుదెంచి రాజు సముఖమున దూరమునఁ జేతులుజోడించుకొని నిలువఁబడెను. విజయసింహుఁ డాతనిని స్వయముగ దోడికొనివచ్చి రాజు సమీపమున విడిచెను. "గుణనిధీ! నీవింకభయము విడువుము. నేఁటినుండి నిన్ను నామిత్రిలలో నొకనిగఁబరిగ్రిహించితిని. నీ వాయాసనము నలంకరింపుము" అని రాజు వానికుత్సాహము గలుగునటులఁ బలికెను.

పిదప రాజాజ్ఞచే నరదండ సహితముగ భూతివర్మను భటులు రాజసముఖమునకుం దోడికొనివచ్చి నిలువంబెట్టిరి. వానిం గాంచి ప్రభు వీలాగు ప్రశ్నించెను:—

భూతివర్మా! నీవు రాజద్రోహివనియు దేశవిప్లవకారకుఁడవనియు నీపయి నేరము మోపఁబడినది. అందునకు నీవేమి పరిహారము చెప్పఁగోనెదు ?

భూతి—మహాప్రభూ! నే నేయొకపాప మెఱుఁగను. నరి కడనివారు పట్టినేరములు నాపయి వైచిరి.

రాజు — నీ వేపాపమెఱుఁగనివాఁడవ యయినయెడ గ్రామమువిడిచి పాఱిపోవలసిన యవసరము నీకేలగలిగెను? అందును నిర్జనారణ్యమున నొక చఱియలో దాఁగవలసిన యగత్య మేమివచ్చినది?

భూతి - నాశత్రువులు రాజునకు నాపయి ననుమాన మును బుట్టించి కుట్రలుపన్నుచుండుటచే నే నిచటనుండుట యపాయకరమని భయమువలనఁ బోయి దాఁగితిని.

రాజు - ఇచట నీకు శత్రువు లెవరు?

భూతి - విజయసింహ ధర్మసింగులు ముఖ్యులు. వీరు గాక మఱికొందఱును గలరు. కాని వారు ఫలానా యని నిర్ధ రింపఁజాలను.

రాజు - గరదుసింగు నీకు మిత్రుఁడా? లేక శత్రుకోటి లోఁజేరినవాఁడా!

భూతి - అతఁడు నాకు శత్రుఁడునుగాఁడు మిత్రుఁ డని చెప్పుటకును వలనులేదు. మధ్యస్థుఁడని చెప్పవచ్చును.

రాజు - అయిన నతఁ డకొండచఱియలో నీకెట్లు సహచరుం డయియుండుట తటస్థించెను?

భూతి - అతఁ డేలవచ్చెనో నాకుఁదెలియదు.

ప్రభు వంతట గరదుసింగుమోముఁజూచెను. ప్రభు వాలాగునఁ దన్నుఁజూచుట తనవలన నాతఁ డీ విషయము నెఱుం గఁగోరియయని తలంచి, భూతివర్మ జయసింహునిం గడతేర్ప

నిశ్చయించుకొని మొదట తన్ను బ్రేరేచుట, తమరహస్యాలో చనము, విజయసింహుని జిత్తూరుకృష్ణగిరిమార్గమున దొంగ చింతవద్ద నిర్బంధించి చంపయత్నించుటయుఁ, గడకు మాల్వా రాజుతోడ భూతివర్మ పన్నినకుట్రలో నతనికిఁదోడుపడుటయు మొదలగు సంగతులన్నియుఁబూసగుచ్చినట్లు తూచా వదల కుండ గరదుసింగు రాజునకు నివేదించెను.

'ఈతం డంతపనికిం బూనికొనెనా' యని నొడువుచు రాజు భూతివర్మముఖమువంకఁ జూచెను.

'స్వామీ! నే నేపాప మెఱుఁగను. గరదుసిం గబద్ధమా డుచున్నవాఁడు. విజయసింహుఁడు మిగుల యోగ్యుఁడు. నా కతనివయి నేమేనిఁ బగయా' అని భూతివర్మ నుడివెను.

'మదిలోనిమలికిత మిపుడు వదలినది. భూతివర్మయే న న్నానాఁడు చంపఁదలంచినది?' అని విజయసింహుఁ డా శ్చర్యమునఁ దలయూచుచుండెను. ఇంతలో నెద్దియో తనమ నసునకు రా, నతండు తనకంచుకపుసంచిలోనుండి యొకతువా లాను వెలికిఁదీసి దానిం జక్కగఁ బరిశోధించెను. అప్పుడతనికిం గలిగినసంతోష మింతంతయని చెప్పనలవిగాదు.

విజయసింహున కప్పుడంతసంతసముగలుగుటకుఁ గార ణమేమి? ఆరేయి దొంగచింతవద్ద తన్నుఁగాపాడినవాఁ డెవఁడో తనకప్పుడు తెలిసెను. ఆ తువాలాపయి వేయఁబ డిన పేరువలన నతని నెఱింగెను. ఆమహాపురుషుఁ డాసమయ మున కచటికి రాకయుండినయెడ నాముష్కరులచేతిలో విజ యసింహుఁడు హతుఁడయియుండియుండును.

విజయసింహుఁ డా తువాలా నంతట రాజుహ స్తమున నునిచెను. "స్వామీ! తామీతువాలానొక్క-పరిపరికింపుఁడు. దీనిసొంతగాని కే నశాన్తిములు నహస్రాధికతంబు లొనరింప వలసియున్నది. ఆమహాపురుషుండ నన్నా రేయిఁ జిత్తూరుకృష్ణ గిరిమార్గమునం గాపాడినవాఁడుసుఁడీ" అని విజయసింహుఁడు వచించెను.

ఆతువాలాను పరిశీలించి రాజు దనవెనుకఁగూర్చుండి యున్న ధర్మసింగువంక తనదృష్టినిసారించెను. ధర్మసింగు తానే మియు నెఱుంగనివానివలె వినమ్రుఁడయి నిలువఁబడెను.

రాజు - ధర్మసింగూ! ఈతువాలా యెవ్వరిదో చెప్పఁ గలవా?

ధర్మ - స్వామీ! అది నాయదియ. కొంతకాలము కింద నది నావద్దనుండి జారిపడిపోయినది. విజయసింహు కృపవలన నా కది తిరిగి లభించినది.

రాజు- విజయసింహులుగారూ! తమ కిదెచ్చట లభించెను?

విజ - 'దొంగచింతవద్ద నా యీ ప్రాణదాత మఱపు ననో లేక రక్షకు నెఱుంగఁగల నా భాగ్యముననో విడిచిచని యెను. దాని నే నెత్తిపెట్టితిని. ఈప్రాణదాత ఋణమే నెటులఁ దీర్చుకొనఁగలను!'

రాజు - ధర్మసింగూ! నీవచటి కేల వెళ్ళియుంటివి?

ధర్మ - స్వామీ! నేనొకశనివారము కృష్ణగిరికి వెళ్లి యుంటిని. అచట విజయసింహున కాప్తులును, నేను నమ్మక

ముంచఁదగినవారు నయిన యొకరివలన విజయసింహుని యీ
నాఁటి రేయిఁ గృతాంతని కేతనంబునకనుప శత్రువులు చిత్తూరు
నం దేర్పాటుచేసికొని యుండిరని వింటిని. అందువలన నేను
బొద్దుగ్రుంకుటకుముందే చిత్తూరు జేరి సంగతులను గనిపెట్టు
చుంటిని. గడియప్రొద్దుండఁగనే నీనగరు సమీపముననున్న
తోఁట కేగితిని అచటఁగొంద అనుమానగ్రస్తులు చేరి యెద్దియో
గుసగుసలాడుచుండిరి. నేను కృష్ణగిరిలో విన్నదాని కిది యుప
బలకమయినది. ఈ చేరినవారిలో నిరువురను వారిమాటలను
బట్టియుఁ గంఠస్వరమును బట్టియు గుర్తించితిని. అందు
భూతివర్మ యొకఁడు. రెండవవాఁడు మానాయనగారు.

వీరందఱు కృష్ణగిరిమార్గమున విజయసింహుంబొరిఁగొన
సమకట్టిరనియు, నందున కాళనివారమే యేర్పఱచికొనిరనియు
వింటిని. కాన నే నానాఁడచ్చటికి సమయమునకుంజని నిరప
రాధియు దేశభక్తుఁడునయిన యీవిజయసింహునకుం దోడు
పడఁగలిగితిని. నేనును వీరికార్యమునకు బలియైయుండవలసిన
వాఁడనకాని గజేంద్రునకు విష్ణుమూర్తివలె నాకాయాప
త్సమయమున నొక మహాపురుషుఁ డెవ్వఁడో యడ్డుపడి
నన్నును విజయసింహునిం గాపాడినవాఁడు" అని ధర్మ
సింగ నెను.

విజ—ఆహా! నాప్రాణదాత నిపుడుగదా కనులపండు
వుగఁ గనుఁగొంటిని! స్వామీ! ఈమహామహుని ఋణం బేనె
ట్టులదీర్చికొనఁగలను! దొంగ చింతవద్ద నాప్రాణమును దీయఁ
దలంచిన దెవ్వరయినదియు నిప్పుడు గ్రహించితిని. ఇఁకఁ గృష్ణ

గిరి గ్రామమున నన్నుఁగడతేర్ప నెంచినవా రెవరో తెలియ వలసియున్నది సుఁడీ !

ఇటుల వీరు ప్రసంగించుచుండఁ గృష్ణగిరివాసుఁడయిన యొక మనుజుఁడు, కరవిహీనపురుషు నొకని వెంట నిడుకొని రాజసభకు విచ్చేసెను. ఈ లుప్తకరుం గాంచినతోడన భూతివర్మ ముఖమునఁ గత్తివాటు వైచిన నెత్తురుచుక్క లేక చిన్నవోయెను. అతండు భయవిహ్వలుఁడయి తనమో మావలకుఁ ద్రిప్పికొనెను.

ప్రభు వంత వచ్చినవానింగాంచి " నీవెవరు ? నీవచ్చిన కార్య మేమి " అని యడిగెను.

' నేను కృష్ణగిరివాసుఁడను. కొంతకాలముక్రింద మా గ్రామమునం దొకపెద్దమనుష్యుని గొందఱుచోరులు సంహరింపనుద్యమించిరి. ఆ చోరులలో నీమనుజుఁ డాపెద్దమనుష్యునిఁబట్టుకొని శిరఃఖండనంబుసేయ సిద్ధమయ్యెను. ఆసమయమున దైవవశమున నారేయి నాగ్రామమునకు విచ్చేసియున్న యొకమహాపురుషుఁ డీతనియెత్తినహస్తమును దననిశితాసిం దెగనేసి యాపురవాసు ప్రాణమును దక్కించెను. ఈమనుజుని భద్రముచేయుఁడని యామహాపురుషుం డీతని నాకొప్పఁజెప్పెను. ఆయువకుఁడు తిరిగి నాకగుపడలేదు. ఈనేరస్థునిఁ గృష్ణగిరిటానాలో నొప్పగించి యిప్పుడు టానాధికారియాజ్ఞచేఁ బ్రభువుసన్నిధానమునకుం దోడితెచ్చితిని' అనియామనుజుఁడు నొడివెను. ఈలుప్తకరుఁడు భూతివర్మభటుఁడని ధర్మసింగు గురించెను.

రాజు—నీకరం బేల పోఁగొట్టికొంటివి ?

భృత్యు—ఏమని తమకు నే విన్నవింతును. భృత్యునిదె ప్పుడును నెత్తురుకూడుగదా! భృత్యునిది యజమాని యావల కులోఁబడిన జీవనము. నాయజమాని తనశత్రునొకనిఁబట్టు కొనఁదలంచి తనతోడ నన్నుఁ గృష్ణగిరికిం గొంపోయెను. ఆ శత్రువును నేను బట్టిబంధించితిని. ఒకనిముసముగడచినయెడల విజయసింహుకంఠము తెగి నేలపయిఁ బడవలసియుండెను. కాని యప్పు డొకమహాపురుషుఁ డేతెంచి నాహస్తమును ఖండించి విజయసింహుని వదలించెను.

రాజు—నీ యజమానుఁ డెవరు ?

భృత్యు—భూతివర్మ. వారివలనన నాకీయాపద సంభవించినది.

ఈసాక్ష్యము విని భూతివర్మ మిగులభయమున వడంకుచు నిలువఁబడెను. మోము పయికెత్తనే లేదు. సభికులంద ఱాతని విభ్రాంతిం జూచుచుండిరి. 'ప్రభుభక్తియు దేశాభిమానమునుంగల విజయసింహుం బొరిగొననెంచిన దీతండా! ఈతం డెంతకయిన సాహసుండ' అని సభ్యులందఱుఁదమలోఁదాము గుసగుసలాడఁజొచ్చిరి. అపుడు రాజు భూతివర్మను జూచి

'భూతివర్మా! నీవీవిజయసింహుని విషయమయి యిటుల జరిగించినావని వీరు వక్కాణించుచున్నారు. దీనికి నీవేమి చెప్పఁ గొందువు?' అని యడిగెను. రాజు వేసినప్రశ్నకు భూతివర్మ బదులేమియుఁజెప్పఁజాలక నిరుత్తరుఁడయ్యెను. ప్రబలమయిన

మనదేశక్షోభమునకుంగూడ నీతండే కారకుఁడయియుండనో పునని కొంద ఱభిప్రాయపడఁజొచ్చిరి.

ఈసమయమునఁ గొందఱు భటులు లోకదీర్ఘకాయుని వెంటఁగొనివచ్చి రాజసమ్ముఖమ్మున నిలువఁబెట్టి యుత్తర మొకటి రాజుచేతనుంచిరి. ఈ ఘోరరూపము సభికులనందఱ భ్రాంతచిత్తులఁగావించెను. వారంద ఱతనిదెస నత్యాశ్చర్యమునఁ జూడఁదొడఁగిరి. కాని భూతివర్మమాత్ర మాతనివంక దృష్టిమఱల్పలేదు. అతనిం గాంచిన తోడన భూతివర్మ తనపయియుత్తరీయము మొగమున కడ్డముగ నిడికొని పెద్దపెట్టున రోదనము సేయసాగెను. వద్దనున్న రాజభటు లాతని నేడువవలదని బెదరించిరి.

రాజు—వీరిలో రక్తాక్షుఁ డెవరు?

రక్తా—మహాప్రభూ! నేనే రక్తాక్షుఁడను.

రాజు—నీ దేదేశము?

రక్తా—నా దీదూరుగ్రామము మహాప్రభూ!

రాజు—ఈ దేశమున కేల వచ్చితివి?

రక్తా-బ్రతుకుటకు.

రాజు-ఇచట నెటుల జీవించుచుంటివి?

రక్తా—స్వామీ! నేనొకరియొద్ద సేవకుఁగుదిరియుంటిని.

రాజు—ఎవరియొద్ద?

రక్తా—భూతివర్మగారి యొద్ద.

రాజు—ఈయనను నీ వెఱుఁగుదువా?

రక్తా— అయ్యా! ఆయనయే నాయజమానుఁడయి యుండెను.

రాజు—ఇపుడు గాఁడా?

రక్తా—ఆయనసేవ నిపుడు వదలుకొనవలసివచ్చినది.

రాజు— ఏల వదలుకొనవలసి వచ్చినది? నీకై నీవు మానుకొంటివా? లేక యాయనయే నిన్ను వదలుకొనెనా?

రక్తా—స్వామీ! రెండును గాదు. ఒక మహాపురుషుని కృపారసంబున నాకీభూతివర్మగారి సేవ తప్పినది.

రాజు—అట్లుపలికెద వేల? భూతివర్మ సేవ నీయిష్టమునఁగాదా?

రక్తా—ఎంతమాత్రము వారిసేవ నాకు సరిపడలేదు. బలవంతముగ విధిలేక చేయుచుంటిని. దైవము నాకది తప్పించినాఁడు.

రాజు—అంత యిష్టములేనిపను లేమిచేయుచుంటివి?

రక్తా—స్వామీ! భూతివర్మ శక్తిపూజ చేయుచుండెడివాఁడు. ఆదేవత కర్పించునది నరబలులు. ఆ బలివిధానము నేను చేతులార చేయవలసివచ్చుచుండెడిది.

రాజు — ఆపనులు నీవు బుద్ధిపూర్వకముగఁ జేయుట లేదా?

రక్తా — పొట్టకొఱకు యజమాని యాజ్ఞల నెఱపుచుంటిని గాని నాయిష్టమున నెంతమాత్రమును గాదు మహాప్రభూ!

రాజు — నీవుగాక భూతివర్మగారి సేవయం దితరులెవ
రైన నీపనులు సేయుచుండిరా ?

రక్తా—స్వామీ ! నాతల్లి యొకతె యుండెను. ఆమె
గతి యేమయ్యెనో నాకిటీవలఁ దెలియలేదు.

వీరిటుల మాటలాడుచుండ నొక భటుఁ డొకవృద్ధ
భిల్లవనితను మఱియొక విప్రబాలునిఁ దోడ్కొనివచ్చి రాజు
సముఖమున నిలువఁబెట్టెను.

రాజు—ఈబాలుఁ డెవరు?

బాలు — బాబూ ! నేను జాలావధానులవారి యేక
పుత్రుఁడను.

రాజు—నీవును భూతివర్మగారియొద్దనే యుంటివా ?

బాలు—అయ్యా! ఆయనయొద్దనే కొలఁదికాలముంటిని.

రాజు—వారియొద్ద నీవేమిపనులు సేయుచుంటివి?

బాలు- గృహంబున కతిథివర్గ మేతెంచినపుడు వారల
కుపచారములు సేయుచుంటిని.

రాజు - వారి గృహమని చెప్పితివి. చిత్తూరులోని
గృహమా?

బాలు - కాదు కాదు. నాగేంద్రములోని గృహము.

రాజు - ఆగృహమున కతిథు లేలవచ్చుచుండిరి.

బాలు- ఏలవచ్చుచుండిరో నాకుఁ దెలియదు. మా
నాయనగారివెంటఁ జనుదెంచుచుండెడివారు.

రాజు - వీరి నెఱుఁగుదువా?

బాలు - ఎఱుఁగుదును, భూతివర్మగారు. వీరియొద్దనే నే నున్నది.

ఈలాగునఁ బ్రభువు వారల నడుగుచుండ నెవరో యొక మనుజుఁడు రోదనము సేయుచుఁ బరువుపరువున నేతెంచి సభ్యుల కెదుటఁ జాఁగిలి మ్రొక్కెను. వాని రోదన మంత కంతకు హెచ్చుచుండెను. రాజాతనిం గాంచి నీవెవరవు. ఏల యిట్టుల నడ లెదవని యడిగెను.

' స్వామీ ! నేనతి ఘోర పాపుఁడను. జాలావధానాభిధేయుఁడను. నాముఖము చూచిన, రౌరవాది పాతకము సంభవించును. దుర్మార్గుఁడనయి నాశరీర మొకని కమ్ముకొని చేయరాని దుష్కార్యములనెల్లఁ జేసితిని. ఎందఱినో మోసమున గొనివచ్చి చేతులార మృత్యువున కొప్పఁ జెప్పితిని. పేరునకుమాత్రము బ్రాహ్మణుఁడను. బోయవాఁడనయి తమ చేయ నీయకొనని ఘోర కార్యములం జేసితిని. ఇదంతయు నీపాడుపొట్టకొఱక ! భగవంతుఁడు నన్నే పాడు పురుగ్వగఁ బుట్టించునో ! నన్ను మీరు ఖండఖండములుగ నఱికి వేయుఁడు. ఇట్టి ఘోరకృత్యములఁ జేయఁ బూనిన యీ నా చేతుల కగ్గి యిడి దహించివేయుఁడు. అప్పుడు గాని నాకిల్బిషము హరింపదు. "నావిష్ణుః పృథివీపతి" అని వేదంబు లుద్ఘోషించుచున్నవి. రాజదండనము నిందితుని దోషరహితుం గావించును. తా మేమిచేసినను జేయుఁడు."

అని మొఱలిడెను.

రాజు — ఈభూతివర్మ నెఱుంగుదువా ?

జాలా—"ఎఱుంగుదును. స్వామీ! ఎఱుంగుదును. ఈ తండ్రే నాకొంపఁ దగ్ధిపవాఁడు. పీ రర్భించు శక్తిలోఁ జి కే నెందఱితల్లుల నేడ్పించితిని! ఎందఱిపత్నుల దుఃఖవార్ధి ముంచితిని! నాపాపమునకు మేరయింత యని వచింపఁజాలను" అని రోదనము మరల నారంభించెను.

రాజు—రక్తాక్షా! ఈమెయేనా నీతల్లి?

రక్తా—స్వామీ! ఈమెయే నాతల్లి.

రాజు—అమ్మా! నీవును భూతివర్మగారియొద్దనే సేవ సేయుచుంటివా?

తల్లి-అవును స్వామీ! నేను నచ్చటనే సేవచేయుచుంటిని.

రాజు-వారియొద్ద నేమిపనులు సేయుచుంటివి?

భిల్లవ—నే నొకయబలసేవయం దునుపఁబడితిని.

రాజు-ఆయబల యెవరు? నీజాతివనితయా?

భిల్లవ-అయ్యా! ఆమె భిల్లవనితగాదు. కడుసుకుమారియయిన రాజపుత్రివనిత.

రాజ-ఆచిన్నది యాస్థలంబున నీవశమున నుండు టెట్లు సంభవించెను?

భిల్లవ-నాయనా! అదియంతయు నాకేమియుం దెలియదు. ఈభూతివర్మగారకన్నియను వలచితెచ్చి యాగృహంబున నిర్బంధమున నుంచినటుల నాకుఁదోఁచినది.

రాజు-ఆచిన్నదిప్పు డెచట నున్నది?

భిల్లవ-ఎచట నున్నదియు నాకుఁదెలియదు. జాలావధానులగారు నాఁడా చక్రపురమందలి సత్రమున నన్నును నాసుందరిని డించి కాపాడుచుండెను, కాని యొక నిశాసమయమున నామె యెట్లో యదృశ్యయయ్యెను. అప్పటినుండి నేను విష్ణుశర్మగారి పోషణలో నున్నాను.

రాజు-రక్తాక్షా! నీతల్లియొక్కయు నీయొక్కయు నడవడినిఁబట్టియు మీమాటలంబట్టియు నాలోచించిన మీరు యోగ్యులుగాఁ గనుపడుచున్నారు. ఇట్టిపాపకార్యముల కెట్లొడిఁగట్టితిరి ?

రక్తా-స్వామీ! మాదురదృష్టదేవత మమ్మాపాదుకవికి లోఁబడంజేసినది.

అయ్యా! రాజభక్తిపరాయణులగు వీరి నిట్టినీచసేవయందునిచి పాపంబు నొడిఁగట్టుకొనిన యాపరమద్రోహియగు యతి యీ పాపియే! నన్నిఁక మన్నింపకుఁడు? అని జాలావధానులు నొడివి సభ్యుల నందఱ విభ్రాంతియందు ముంచివైచెను.

భూతివర్మ జాలావధానులవిషయమయి యేమిచేయవచ్చునని రాజాలోచించుచుండెను. అప్పుడొక రాజభటుఁడేతెంచి "మహాప్రభూ! తమదర్శనమునకయి యెవ్వరో యొకవిప్రోత్తముం డొకబాలునితో విచ్చేసి వెలుపలవేచి యున్నవాఁ" డని నుడువ వారిం దోడ్కొనిరమ్మని రాజు సెలవొసంగెను. అంతట భటుం డేగి యా యిరువుర లోనికిం గొని వచ్చెను.

ఆవిప్రుం గాంచినతోడన రా జతనికి స్వాగతమొసంగి తనసరస నాసనమువేయించి యాయనను గూరుచుండఁబెట్టి కొనెను. ఆవిప్రుని వెంటం జనుదెంచిన యువకుఁడునావిప్రు సరసనున్న యాసనముపయి నుపవసించెను. అప్పుడు జాలా వధానులు లేచి యావచ్చినబ్రాహ్మణునకు నమస్కరించెను.

రా జావిచ్చేసియున్న విప్రుం జూచి జాలావధానుల నేరము నతని పశ్చాత్తాపము మొదలగుజరిగినసంగతులన్నియు నాయనకు వివరించిచెప్పెను. ఆ విప్రుఁడు విజయసింహుని తోనాలోచించెను. అంత విజయసింహవిష్ణుశర్మలు రాజుతో మంతనంబొనర్చిరి. పిమ్మట విజయసింహుఁడు జాలావధానులు పశ్చాత్తాపపడుచున్నవాఁడు గాన వానిని క్షమింపఁదగునని వక్కాణించెను. విష్ణుశర్మయు నా జాలావధానుల పశ్చాత్తాపము నిక్కువమయినదని తా నెఱుంగుదు ననెను.

విష్ణుశర్మతోడ నేతెంచినపడుచువాఁడు జాలావధానుల చర్యలు చిత్రముగఁ జూచుచుండెను. ఆయువకునిమోము శ్మశ్రువిహీనమయియున్నది. బహుశః యతండు పేడుమూతివాఁడయి యుండవచ్చును. వయసు పదునేను వత్సరముల కంటె మించలేదు. ఈచిన్నవాని నెచ్చటనో చూచియున్న లాగునఁ దోఁచి రాజప్పుడప్పు డతనిమోమువంకఁ జాటు చూపులు చూచుచుండెను. కాని యతఁడెవ్వరయినది యెచ్చటఁజూచినది యతఁడు గుర్తించలేదు. ఆ యువకుని రూపము మాత్రము ప్రభువున కానందమునొసంగుచుండెను. ఇంతలో రాజపుత్రుఁ డొకఁడేతెంచి రాజసముఖమున నిలువఁబడెను.

రాజు - నీ వెవండవు ?

రాజ - స్వామీ! నేను నాగేంద్రపురవాసుఁడను. ధీర సింగను పేరుగలవాఁడను. తమతోడ నొకవిన్నపముఁ జేసికొన నేతెంచితిని.

రాజు - విషయ మేమి ?

ధీర - స్వామీ! నాపుత్రి నేఁటికి నాలుగుమాసముల క్రిందఁ గొన్ని కారణములచే నిలువెడలిపోయెను. ఆమెకొఱకు వెదకివెదకి వేసారితిని.అది నాకేకపుత్రిక. రెండువివాహముల చేసికొనినను నీ కొమరితమాత్రము వంశాంకురమయి నిలిచెను. ఇతరసంతానమేమియును లేదు. మీ రనుగ్రహించినంగాని నాసుత నాకు లభింపదు. నామనంబును నెమ్మదిపడదు.

రాజు- ఆచిన్నదానియాచూకి యేమయినంజిక్కెనా?

ధీర - ఆచూకి యంతచక్కగా తెలియలేదు. కానియిప్పుడామె చిత్తూరుపట్టణవాసియగు భూతివర్మ నిర్బంధమున నున్నట్లు తెలిసినది. అందుచేత నేనిందువచ్చి తమకు విన్నవించుకొంటిని.

రాజు - భూతివర్మయొద్ద నున్నదను ననుమానము నీకేల గలిగెను ?

ధీర- నాయనా! అలాగనుమానముకలుగుటకుఁ గారణమున్నది. నాకూఁతుఁ దనకిచ్చి వివాహముచేయుమని భూతివర్మ కొంతకాలముక్రింద నొకబ్రాహ్మణుని మూలమున కనిపియుండెను. అతని పెండ్లిగూడుట నాకొమారిత కిష్టము లేకపోవుటచే నేనావివాహమున కంగీకరింపలేదు. ఆకార్య

ణ్యామును మనంబున నిడికొని యాతం డెట్లో నాబిడ్డ నపహరించియుండవచ్చునని నే నూహించితిని. దీనికిం దోడు భూతివర్మ దుర్మార్గుఁడనుమాట యొకటి జనులలోఁ బొక్కినది. అతనియాధీనమందు యాయబల యున్నట్లు లోక గాలికబురు తెలిసినది. కాన నాతనయ నాకు లభించునను నాశచే నేనిట్లు తమసన్నిధి కేతెంచితిని.

రాజు - భూతివర్మను నీ వెఱుఁగుదువా?

ధీర - స్వామీ! ఆయన విషయము వినుటయకాని ముఖాముఖి నెప్పుడు నాతని చూడలేదు.

రాజు-మీగృహంబునకుఁ గన్యనిమిత్తమయి యే తెంచిన విప్రుఁ డెవరు?

జాలా-అయ్యా! ఈధీరసింగిపుడు వచించిన దంతయు నిక్కువము. నేనే ధీరసింగు నుటజమునకు వెళ్లినది. భూతివర్మయే నన్నంపెను. ఏలాగయిన నాచిన్నదాని తనకిప్పింపు మని యాతఁడు నన్ను బ్రతిమాలికొనెను. ధీరసింగాతనికిఁ దనకుమారితనిచ్చుట యెంతమాత్రి మిష్టములేకపోయినను, నాచిన్నదాని సవతితల్లిని గట్టుకొని యక్కన్య నెట్లయిన నెత్తికొనిపోవ సమకట్టితిని. కాని యది సందర్భపడలేదు. పిమ్మట సమయమువేచి యాచిన్నది బయలునఁ దిరుగుచుండ భటులచే నామెను బట్టితెప్పించి భూతివర్మవశము చేసితిని. అంత నామె నాయన నిర్బంధమునను చెను. కాని యాచిన్నది యతనికిఁ దక్కలేదు.

అని జాలానధాని వచించఁగానే, రాజును విష్ణుశర్మయు, విజయసింహుఁడును దమలోఁ దా మేమో విచారించుకొనిరి. అంతట రాజు భూతివర్మం గాంచి "భూతివర్మా! వీరి వ్యాఖ్యాతములనెల్ల వింటివిగద! ఈయందఱ సాక్ష్యము వలన నీవు రాజద్రోహివనియు, దేశవిప్లవమునకుఁ గారకుఁడవనియు, నిచట జరుగు నసంఖ్యాతములగు నరహత్యలకు హేతుభూతుఁడ వనియు, పరసతీమానభంగోద్యోగివనియు నూకు ధ్రువమైనది. దీనికి నీవేమిచెప్పుకొనెదు? నీకుత్తర సాక్ష్య మేమయినం గలదా" అని యడిగెను.

భూతి- చెప్పుకొనుట కేమిగలదు. నిజస్థితి బయలువడినది. నే నపరాధిని.

రాజు - 'నీవెంతకయిన సాహసుఁడవ! కాన నీకు యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్ష విధించితిని' అని రా జాజ్ఞ యొసంగెను. తోడన రాజభటు లాతని నావలకుం గొనిపోయిరి. విప్రబాలకభిల్లాంగనారక్తాక్షుల క్షమించి రాజు వారల నాదరించెను. వీరొనర్చిన కార్యములు తమస్వబుద్ధింగాక యితరుల బలవంతమున నొనర్చిరి. ఇంతియగాక వారంద ఱిప్పుడు పశ్చాత్తాప పడుచున్నవారు. కాన వానియందుఁ బ్రభువు కనికరించెను. రక్తాక్షుఁడు రాజున కప్పటినుండి శరీరరక్షకభటుఁడ య్యెను. విష్ణుశర్మవిజయసింహులు జాలావధానుల పక్షమున మాటలాడినందున రా జతనిభాపిప్రవర్తనమును గుఱించి తగుభారము పుచ్చుకొని యతని స్వేచ్ఛగ వదలివేసెను. శత్రువులయందు గొప్పవారికిఁ బ్రతీకారము కనికరమె గదా?

ధీర-నాకొమరితవిషయమయి యేమిచేసితిరి. నాబహిఃప్రాణమయివ నాసుత నాకుఁదక్కనియెడ నాప్రాణములును దక్కవు.

రాజు - నీకూఁతువిషయమయి విచారించుటకుం దగు యత్నములు జరుపఁబడును. ప్రస్తుతము మీరును మానగరుననే యుండుఁడు.

విష్ణు-ధీరసింగూ! నీయాత్మజకుఁ బాణిగ్రహణమైనదా?

ధీర-నాతనయకు వివాహయోగ్యమగువయసు వచ్చినదని తగువరుని విచారించి పరిణయముచేయఁగడంగితిని. కాని మాగ్రామవాసుఁడగు రామాజోశ్యులవారు నీబిడ్డ కిదివఱకే వివాహమయినదని చెప్పెను. కాన నావివాహము మానివేసితిని.

విష్ణు-నీకొమార్తెకిప్పుడు తన వివాహమువిషయమయి యేమియభిప్రాయము ?

ధీర - పెండ్లిమాట యెత్తినపుడెల్ల యామె చెవిని వేసికొనక యెద్దియో యాలోచించుచుండును.

ఈసంభాషణము ముగించినపిదప సభచాలించి రాజు దిగ్గునలేవ, సభ్యులందఱు లేచి యెవరిగృహంబులకు వారేగిరి. విష్ణుశర్మమాత్రము తనతోడవచ్చిన పడుచువానితో ధీరసింగును గలసికొని ముచ్చటలాడుచు మఱియొక ప్రిక్షను నడిచెను.

———o———

# 3౫ వ భాగము.

ఆహా! విష్ణుశర్మ యెంత మేలొనర్చినవాఁడు! ఎంతకనికరముగలవాఁడు! నావిషయమయి రాజున కెంతనచ్చఁ జెప్పినాఁడు! నన్నెంతచనవున నాదరించినవాఁడు! ప్రాణపదముగు నాబిడ్డను నేలాగయిన వెదకి తెప్పించి నాకొప్పింతునని గట్టివాగ్దానముచేసినాఁడు. వీరిబుద్ధికుశలతవలనఁగదా భూతివర్మమొదలగు దుర్మార్గుల దౌష్ట్యము బయలుపడి దేశము మరల స్తిమితపడినది! నీవీయింట నిలువుము. నీకూఁతు నిందురప్పించెదనని యాపడుచువాని నామెకొఱకుఁబంపియున్నాఁడు. 'ఆచిన్నవాఁ డింకనురాలేదు. కాని యాచిన్నవాఁడెవరయియుండును! వానిముఖమున మావిద్యుత్ప్రభాలక్షణంబులు కొన్నిగనుపట్టుచున్నవి. వాఁడు నాబిడ్డయే యౌనా? సరియు! నేనువెఱ్ఱివాఁడను. మగవాఁ డాఁడుబిడ్డయే లాగౌను? అబ్బా బిడ్డను జూచి యెన్నినాళ్ళయినది!' అని తనసుతరాక కెదురుచూచుచు ధీరసింగు రాచనగరున నొకయింటఁ గూరుచుండియుండెను. ఎప్పుడు తనజనకునిం గాంతునాయని వేగిరపడుచున్న విద్యుత్ప్రభ తండ్రియున్నచోటి కపుడు సత్వరంబున నేగుదెంచుచుండెను. ఆపడుచు నల్లంతదూరమునఁజూచినతోడన ధీరసింగు సంతోషబాష్పాకులితనయనుండయి దిగ్గన లేచి బిడ్డకెదురుగఁ బరుపిడెను. కూఁతురును గడుఁబ్రమోదమునఁ దండ్రిం గాఁగిలించుకొని కన్నీళ్ళువెట్టుకొనెను. బంధు

దర్శన మేరికి సంతసంబుఁ గూర్పదు! పరస్పరాలింగనమున గొంతదుఃఖభారము వారలకుఁదగ్గెను. పిమ్మట వారిరువురును దమ యెడబాటుకాలమున జరిగినసంగతుల నుగ్గడించుకొను చుండిరి. అపుడు విష్ణుశర్మ వచ్చి ధీరసింగును రహస్యము లాడు నెపంబున నొందేనిఁ గొనిచనెను.

అంత విద్యుత్ప్రభ తన మనోహరుండగు నరిభీమణుఁడు తన మనసునకురా, నిటుల నాలోచింపఁ దొడఁగెను :-

'నాకుఁ గలుగవలసిన శుభంబు లన్నియుఁజేకూరెను. నా కష్టము లన్నియుం దీరి గట్టునఁ బడితిని. ఏమిగలిగిననేమి? నా కోరిన నిక్షేపము నా కింకను లభించలేదు గదా! ఆమహా పురుషుఁ డరిభీమణుఁ డిపు డెందున్నవాఁడో! అతండు నా కెన్నఁడయిన లభించునా? లభింపకున్న నేను బ్రతికి యేమి ప్రయోజనము?'

అని విచారించుచు విద్యుత్ప్రభ యచటనే కూరు చుండి యుండెను. ఏలయనఁ దాను చెఱనుండి విముక్తయయి నందునకును, తా నెన్నఁడును మరలఁ జూడనని నిస్పృహను బొందిన తన జనకు నిపుడు దాఁ జూడఁగలిగినందునకును విద్యు త్ప్రభ కరంబు సంతసించెను గాని, తన బంధవిముక్తికిఁ గార కుండును దన మనంబు నపహరించినవాఁడు నయిన మహా పురుషుఁ డింకను దనకు లభింపమికిఁ జాల విచార పడెను. అయినను విష్ణుశర్మ యరిభీమణునిఁ ద్వరితముగఁ గనుగొందు వని నాతో నొడివియున్నవాఁడు. తప్పక యాతం డట్లొనరింపఁ గలఁడని సంతసించుచు నతనిరాక కుత్కంఠతో జూచుచుండెను. విద్యు

త్ప్రిభ, యీ విచారములో మునింగియుండ నొకయువకుం డా మెను సమీపించి యామె భుజముపయిం జేయి వైచెను. విద్యుత్ప్రిభ మిక్కిలి యబ్బురపాటునం దనవిశాలనేత్రముల నా తనికై త్రిప్పెను. అపు డామెకుం గలిగిన యానంద మింతయని వర్ణింపనగునా! ఆమెకుం గనులనుండి యానందబాష్పము లొకటివెంట నొకటి జారం జొచ్చెను. ఆమెకు మేను బులక లెత్తెను. "మనోభవనిభా! నేం గాంచుచున్నది నా యరి భీమణుండా నా ప్రాణరక్షకులా వీరు? అనుచు నామె దిగ్గన లేచి నిలువంబడెను.

అరి - "తరుణీ! నీకష్టము లన్నియుం దీఱెనుగదా? ఇంక నీవిచారము నుజ్జగింపుము. ఎల్లి నీవివాహము సుమీ?"

విద్యు - ఇదే యీ శరీరము నీ కర్పించికొన్నాను.

అరి - ఆలాగున ననకుము. నీవు మిగుల నదృష్ట వతివిగదా!

విద్యు - నిన్ను గూడుటవలన నిక్కముగ నే నదృష్టవతి నయ్యెదను.

అరి - ఆభాగ్య మబ్బిన నేను నదృష్టవంతుండనే.

విద్యు - ఏ మట్లనెదరు? నేను నీ దాసనుగదా?

అరి - నిన్నుం గాంచినది మొదలు చిత్తూరు రాజయిన యప్పాజీ తానే నిన్నుం బరిణయమాడం దలంచెను. అది యుక్త మని నాకును దోంచి యాసంగతి నీతోడం జెప్ప వచ్చితిని.

విద్యు - ఏమీ! నిన్ను వదలి నే నన్యులం గ్రిహింపం గలనా? అదెప్పటికినిం జరుగదు. ద్యుమణిసమాగమముం

గోరు పద్మిని రాజు నేలాగు వరింపనేర్చును.

అరి - రాజును వరించిన నీకేమికొఱంత ? నీవును మహారాజ్ఞివయి యుండువుగద !

విద్యు - తాము వలచినపురుషుఁడు పరమదరిద్రుఁడయిన నేమి? కన్యక యతనినే గోరును. నాకు నీతోడిద లోకము. గంజిదైన నీతోడఁగలసి భుజించితినేని యదియు నాకుఁ బాయసము సుమీ!

అరి - నీవు నన్నుఁ జేపట్టితివేని రాజుకంటె నేనధికుఁడనయ్యెదను. ఆలాగు వారిరువురు మాటలాడుచుండ విష్ణుశర్మయు ధీరసింగు నచటికేతెంచిరి. అంతట వారందఱును గలసి యొండేనిం జనిరి.

## ౩౬ వ భాగము

ఒకదినమునఁ జిత్తూరునగరమంతయు నలంకరింపఁబడియుండెను. ఎచటఁజూచినను బురజనులు మహానందరసోదధి మునిఁగి తేలుచుండిరి. ఎండిపోయి మోడువడిన మ్రాఁకులు నయితము చిగురించులాగు విలాసినీవతులు మృదుమధుర మగు పాటలచేతఁ దమ గానచాతుర్యమును బ్రదర్శించుచుండిరి. రాచనగరునందలి పెండ్లిపందిరియందు రెండు వివాహవేదిక లమర్పఁబడి యుండెను. వానిలో నొకదాని యందు నిండువెన్నెల పోరవంటి దువ్వలువను ధరించి సకల

భూషణాలంకృతయయి విద్యుత్ప్రభ తనమనోహరుఁ డరిభీమ
ణునితోడం గూరుచుండియుండెను. ఆసమయమున విద్యుత్ప్రభ
యొకసారి తన మనోహరుని ముఖపద్మముం గాంచెను.
అప్పు డామెకుఁ గలిగిన యాశ్చర్య మేమని చెప్పవలెను!
తన మనోహరుఁడగు నరిభీమణుఁడే చిత్తూరుప్రభువగు నప్పాజీ
యని యామె తెలిసికొనెను. సంతోషమున నామె తనలోఁ
దా నిముడలేక పోయెను. ఇదిగాక యామెకపుడు మఱియొక
యానందముగూడఁ గలిగెను. తన విభుఁడు మున్ను నాగేంద్ర
పట్టణమునఁ దోఁటలో నుయ్యాలత్రాడు నొసంగు నెపంబునఁ
దమ్మందఱ నాటపెండ్లి యాడిన యప్పఁడే యీ యప్పాజీ
యని గ్రహించెను.

ఈలాగు విద్యుత్ప్రభాప్పాజీలు పరిణయమయి తమ
చిరకాలమనోరథములను బాడించుకొనిరి. ధీరసింగును దన
కూఁతు విచిత్రకథావసానమునకు నెంతయు సంతసించెను.

ఆవివాహసమయమున నప్పాజీరావు భూసురుల
కనేకాగ్రహారములను ధనకనకాద్యనేక వస్తువాహనములను
నొసంగెను. అట్లు రాజువలన సత్కారమునొందిన బ్రాహ్మణ
శ్రేష్ఠులలోఁ గృష్ణాతీరవాసుఁడయిన కామయ్య యగ్రగణ్యుఁడు.
ఆతండును దాను మున్ను దన వివాహమునకై చేసిన
ఋణమును దీర్చికొని తనయింట నుంచివచ్చిన కన్యను వివా
హంబయి సుఖముగఁ గాలంబు గడపెను.

వివాహపుఁగాయమానమునందు విద్యుత్ప్రభాప్పాజీల
కొఱకు నుంపఁబడిన పెండిలియరుఁగుగాక వేరుగ మఱియొక

వేది వేయఁబడియున్నదని చదివియున్నాము. అదెవరికొఱకు వేయఁబడినదియు మన మిప్పుడు గ్రహించెదము. విద్యుత్ప్రభాప్పాజీల పాణిగ్రహణము ముగిసినతోడన విజయసింహు కూరిమికూఁతు జీవాబాయిని ముత్తయిదువులు వివాహమంటపమునకుం గొనియే తెంచిరి. విజయసింహుఁడు రాజానుమతిని ధర్మసింగుం బ్రార్థింప నాతండును సంతసించి జీవాబాయితోడ రెండవవేది నలంకరించెను.

అంతట వారిరువురకును సక్రమముగఁ బరిణయమాచరించిరి. ధర్మసింగు తనమనోరథము పండినదని మిగులనుప్పొంగెను. వెనుక రణరంగమునఁ దనప్రాణరక్షణ మొనర్చిన యబలయే యిప్పుడు తనయావజ్జీవమును దనశరీరరక్షణ చేయఁ బూనినదనియు నానందించెను. జీవాబాయియుఁ దాను మొదటినుండి యేపురుషుని వరింప నువ్విళ్ళూరుచుండెనో యాధర్మసింగునే తా వివాహమాడినందునకు సంతసించెను. రాజావధూవరుల సత్యాదరంబున గౌరవించెను.

అచటఁ జేరినవారందఱును విద్యుత్ప్రభాప్పాజీలను జీవాబాయీధర్మసింగులను గాంచి యమితానందముం బొందిరి. వాసంతీవసంతోత్సవములం బోలు నాదంపతులకూడిక యెవరి కానందము గలుగఁ జేయదు ?

ఈవివాహద్వయమునకుఁ గావలసిన సకలసన్నాహములును సేవకాగ్రగణ్యుండయిన రక్తాక్షుని యాజమాన్యము క్రింద జరుపఁబడెను. వివాహకాయమాన నిర్మాణమును దానియలంకారరచనయుఁ గూడిన జనసమూహమును గ్రమ

ముగ నొత్తిడిలేక యుండునటుల సమాహితము చేయుటయుఁ గావలయు వస్తువాహనముల సమకూర్చుటయు మొదలగు పనుల నెరవేర్చుటయందు రక్తాక్షుఁ డతిసమర్థతఁగనుపర్చెను.

కార్యమువట్టుల నిప్పటి సోమరిసేవకులవలెఁ గాక మెచ్చుటఁజూచినఁదానయయి యొకభుజము వేయిభుజములుగఁ బొంగుచు నాతండు కార్యమునిర్వహించెను. ఇంత యేల! వెనుక శ్రీరామున కాంజనేయునివలె రాజకార్యములనెల్ల మిగుల శ్రద్ధాభక్తులతో రక్తాక్షుఁడు నలిపెను.

ఇతఁ డీరీతి నెచటఁజూచినఁ దానయయి పనులుసేయు చుండుట, నచటనంతఃపురసీమంతినీ నివహముకొఱకుఁ బ్రత్యేకముగ నేర్పరుపఁబడిన పందిరిభాగమునుండి యొకవనితామణి చూచెను. అలాగాతనిఁజూచినది రాజమాత యగు కుంతీబాయి. ఆమె రక్తాక్షుని నచటినుండియే గుర్తించెను. అంతఁ దనకొమారుని వెంటనే పిలువనంపించి యామె రక్తాక్షుపూర్వ చారిత్రమతనికి రహస్యముగ నెఱుఁగఁజేసెను.

అప్పాజీ యంతట రక్తాక్షుం బిలిచి యాదరించి సభికు లందఱు వినుచుండ 'నాయనా! రక్తాక్షా! నీచరిత్ర మఱివిచిత్రము. నీయుదంతమంతయు సవిస్తరముగఁదెలుపుమని యతని నడిగెను. అంతనాతఁడు తనచారిత్రమిట్లు చెప్పఁదొడంగెను:-

స్వామీ! నాచరిత్రము కడుదీనమయినది. ఇట్టి దీనచరిత్రము తమబోటి మహాప్రభువులకు విన్నవించికొనిన నామనోభారము గొంత తగ్గిపోవును. నాచిన్నతనమునుండియు, నేను మాభిల్లప్రభువుచెంత సేవకుఁడ నయియుంటిని. దైవసమా

నుఁడగు మా ప్రభువును మాజాతిభిల్లు లంద ఱొక కారణమునఁ జంపివేయుట తటస్థించెను. భర్తృమరణానంతరమున మా రాణియు మూడేండ్ల నిసువగు నామె చిన్న కొమరుఁడును భిల్లుల బారింబడకుండుటకై దేశాంతరులయి ప్రాణమును దక్కించుకొనవలసి వచ్చెను.

"ఆబాల్యము నారాజకుటుంబము నా కింత యన్న వస్త్రము లిచ్చి బిడ్డవలెఁ బెంచుచున్నవారు. గనుక నాయమను వదలలేక యామె సేవసేయుచు నామెను వెంబడించి యీదేశమును జేరితిని. కాని యొకనాఁటి రేయి నా దురదృష్టము నా పాలిటి శత్రువయి నిద్రాసమయమున, నన్నావరించి నన్ను నాయజమానురాలికిని నా శిశువునకును దూరస్థునిగ నొనరించెను. నిద్రలేచి చూచునప్పటికి నా యిరువు రెందే గిరో నాకుఁ దెలియలేదు. శత్రువులేమయిన వారిం గొని పోయిరా యని చింతించితిని. అప్పటినుండియు దిక్కుఁగానక నాగేంద్రపట్టణ సమీపమునఁ బిచ్చివానివలెఁ దిరుగులాడుచుండ నొక యోగిపుంగవుఁడు నన్నీభూతివర్మ సేవయందుఁ బ్రవేశపెట్టి యెందేనిఁ జనెను. పిమ్మట నా యజమానురాలు గాని పసిబిడ్డగాని యా యోగిపుంగవుఁడుగాని నా కన్నులఁ బడలేదు. పిదప నా జననియు నీదూరు వదలి బయలుదేరి నన్ను వెదకికొనుచు వచ్చి యిచ్చటన భూతివర్మగారి సేవయందుఁ గుదిరెను.

నాచిన్న దొరయు నాయజమానురాలయిన రాణియు నన్నెడఁబాసినది మొదలు మా యవస్థ యిట్లయినది. వారిపు

కొందున్న వారో గదా ! అని రక్తాక్షుఁడు వ్యసనపడెను.

తనతల్లి వలన నీయుదంతమంతయు నిదివఱకే వినియున్న వాఁడుగాన నీ రక్తాక్షుఁడు తనతాతతండ్రుల నాఁటనుండి తమ కుటుంబమును సేవించుచున్న విశ్వాసపాత్రుఁడు రక్తాక్షుఁ డితండయని యపు డప్పాజీ గ్రహించెను.

అటుతర్వాత విద్యుత్ప్రభా ప్పాజీ లిరువురు ననుకూల దాంపత్యమున కొక దొడ్డదృష్టాంతమయి బహుకాలము మనిరి. అప్పరావు హిందూమతమునకు నూఁతకోల యనియు సకలమహీమండలాధీశ్వరుఁడనియు, బిరుదముల గ్రహించెను. ఆతండు చిత్తూరురాజ్యమును మదాంధీభూతపరిపంథిజలధరజం ఝూనిలుండయి చిరకాలము పాలించి రాజ్యమభివృద్ధిఁ జెందించెను. హిందూదేశమందేమి, యితరదేశములయందేమి విజిగీషుఁడయి సంచరించి మిగులఁ బ్రఖ్యాతి వహించి పెక్కుకన్నియలం బెండిలియయ్యెను.

అప్పాజీ కొరాసానను నొక రాజ్యమును స్థాపించెను. కాశ్మీర గాంధార పారశీక ప్రభువులును కాఫరస్తాన ఇస్పహాను మొదలగు తక్కుంగల పశ్చిమదేశాధీశ్వరులు నాతనికి లోఁబడి కప్పములం గట్టుచుండిరి.

సంపూర్ణము.

——(o)——

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరాలయందు ముద్రితము.

